## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In... ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

## Part I

# మహారాణి అహల్యాబాయి

## Part II

స్వరాజ్య సారథి, లోకమాన్య

# బాలగంగాధర తిలకు

నవయుగ నిర్మాత

# కందుకూరి వీరేశలింగము

విప్లవ యోగి

# అరవింద ఘోషు

Published by
THE GOVERNMENT OF ANDHRA PRADESH

# పరిచయము

ఆంధ్రప్రభుత్వమువారి ఆదేశానుసారముగ, స్కూలుఫైనలు విద్యార్థులకై ఈ ఉపవాచకము రచితమైనది. విషయము ఉన్నతాదర్శాత్మకము, చరిత్రాత్మకమునై యుండుట మంచిదని విద్యాధికారుల సూచన.

ఇందలి మొదటి భాగము, కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి 'అహల్యాబాయి' నవలకు సంగ్రహము. అబలయయ్యును బలవంతులగు దేశద్రోహుల దుష్టప్రయత్నముల నెదుర్కొని, ప్రజాశ్రేయ మాదర్శముగ రాజధర్మమును పాలించిన అహల్యాబాయి భారత వీరనారీమణులలో నొకతె.

దేశీయాభ్యుదయమును, ప్రజాహితమును తమ జీవితాదర్శములుగ నిడికొని, తమసర్వస్వమును తత్సాధనయందు ధారవోసి చరితార్థులైన మహాపురుషుల జీవితగాథలు రెండవ భాగమున కూర్పబడినవి. మహారాష్ట్ర, ఆంధ్ర, వంగభూములలో నుద్భవించిన ఈ కారణజన్ముల జీవితములు, వారి త్యాగము, వారి సందేశములు, భారతీయ సంస్కృతి చరిత్రకు ఉదాత్తత నాపాదించినవి. ఈ ఉన్నతాదర్శములు భావిపౌరులను సద్ధర్మ పథానుగాములుగ చేయగలవని సంపాదక వర్గమువారి ఆశయము.

ఉపవాచకములు, చాలవరకు, విద్యార్థులు స్వయముగ పఠించునవి యగుటచే తద్రచనయందు భాషాసారళ్య అర్థవైశద్యములు ఆదర్శములైనవి. చదువుటలో అవ్యవహితోచ్చారణ తప్పనిసరియగుచోట్ల సంధియు, సంధి కార్యములును పాటింపబడినవి. అర్థవైశద్యము ప్రయోజనముగ ఆపిచదువవలసినచోట్ల విసంధియే కాననగును. తదనుగుణముగ యడాగమ నుగాగమ సరళాదేశాదులను చేయలేదు. సంధికి ఆధారమగునది సంహిత యగుటచే పైవిధానమనుసరింపబడినది. ద్విత్వరూపమున మాత్రమే శకటరేఫ నుపయోగించి, తక్కినచోట్ల సాధురేఫను నిలిపినాము. అరసున్న లెందును వాడలేదు.

విషయ గౌరవమునుబట్టి వాడిన ఒకటి రెండు పదములు (చాల క్వాచిత్కముగ) విద్యార్థులకు క్రొత్తవిగ తోపవచ్చును. అధ్యాపకులు వానిని గమనించి సహకరింతురని ప్రార్థన.

—సంపాదక వర్గము.

## PART I

# మహారాణి
# అహల్యాబాయి

★

గ్రంథకర్త:

కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహం

★

[This abridgement of Maharani Ahalyabai has been made primarily for the use of candidates sitting for the Andhra S. S. L. C. Public Examination in 1958. It was first published under the authority and on behalf of the Director of Public Instruction, Andhra Pradesh (at) Kurnool on 31st, May 1957.]

ABRIDGED AND EDITED

BY

**The Committee Constituted by**

THE GOVERNMENT OF ANDHRA STATE, KURNOOL.

# అహల్యాబాయి

హోల్కారు రాజ్యమునకు ఇందూరు నగరము రాజధాని. దాని కేడు క్రోసుల దూరమున మాహూ అను పట్టణము గలదు. చుట్టును పచ్చని యడవులు శోభిల్లుచు దానికొక వింత రామణీయకము నాపాదించుచున్నవి. ఆ పట్టణమునకు మూడు క్రోసుల దూరమున వింధ్యపర్వత భాగములచే నావరింపబడిన యొక గూడెము కోట నడుమనున్న పల్లెవలె సురక్షితమై యుండెను. ఆ పల్లె కులవృత్తివలన జీవించు గొల్లలకు నివాసస్థానమై వారికి కామిత సౌఖ్యప్రదాయినియై యుండెను. అందు ఆ గొల్లలచే భగవదవతారమని పూజింపబడుచు నొక వృద్ధుడు నివసించుచుండెను. మాహూనగరవాసు లతనిని ఆగతానాగవేది యగు మహర్షియని తలచి గౌరవించుచుండిరి. వెండ్రుకలన్నియు నూడిన యాతని తల యత డతి వృద్ధు డని చాటుచున్నను, అతని పటుతర దేహదార్ఢ్యమును, దంతపటిమయు, శ్రవణ నయనాదీంద్రియముల శక్తియు, గమనవేగమును చూచినచో నత డంత వృద్ధుడగునా యను సందియము కలుగక మానదు. మూఢభక్తిగల గొల్లలు మాత్రము అతడు మహానుభావుడని నమ్మి అతని కభిలోపచారములు చేయుచుందురు. శతవత్సరపూర్ణుడైనను మనోబలము చెడనివాడగుటచే రాజకార్యములయందుకూడ నతని యాలోచన మమోఘము.

ఒకనాడు సాయంకాలమున గడియరాత్రి యయిన తర్వాత, సత్యఋషి యని ప్రసిద్ధికెక్కిన ఆవృద్ధుని యొద్దకు ఒక పడుచువాడు పాదచారియై వచ్చుచుండెను. అతనికి యౌవన మంగసౌష్ఠవమును పరిపూర్ణముసేయ, విద్య గుణసౌష్ఠవమును పూర్తిచేసినది. చిన్ననాటినుండియు సాము కసరతులు చేయుటచే దండలు దిరిగిన భుజములును, విశాలవక్షమును, అతని మూర్తిని మనోహరముగ నొనర్చినవి. అట్లే విద్య, శాంతము, సువర్తనము అను గుణములు అతనిని సుజనస్తోత్ర పాత్రునిగ చేసినవి. అతని పేరు శ్యామసుందరదత్తు. ఆయువకుడు సత్యఋషి కుటీరమునుచేరి తలుపు ద్రోసియు, ప్రత్యుత్తరము రానందున బయటనే నిలువబడియుండెను. వృద్ధుడు లోన నెవరితోడనో గుస గుస లాడుచున్నట్లు శబ్దమువినవచ్చినది. ఆమాటలు పూర్తిగ విన బడకమున్నే శ్యామసుందరదత్తు మరల తలుపు త్రోయుటచే, ఋషి తన నిమిత్తమెవరో వచ్చినారని తెలిసి లోపలనున్న మను ష్యుని వెడలిపొమ్మని యానతిచ్చి తలుపుదీసెను. అంతట వృద్ధుడు శ్యామసుందరుని రమ్మని పిలువ, ముసుగువైచుకొని కుటీరము నుండి చనుచున్న యతిదీర్ఘకాయుడును మహాసత్త్వుడును నగు నొక పురుషుని తేరి చూచుచు, దత్తు వెంటనే లోపల ప్రవేశింప డయ్యెను. ఆ పురుషుడెవ్వడై యుండునాయని యోజించుచు శ్యామసుందరుడు లోనికిజని వృద్ధుడు చూపిన ప్రాత కంబళ ముపై కూరుచుండిన తర్వాత వారికిట్లు సంభాషణ జరిగెను.

ఋషి: నాయనా, నీవెవ్వరు పంపగా నేనిమిత్తము వచ్చినావు ?
నీ పేరు శ్యామసుందరదత్తు గదా !

శ్యామ: అవును. రాధాకాంతరావుగారు మీ దర్శనముచేసి ఆయన మొన్న మనవిచేసిన యంశమును గూర్చి మీరా లోచించితిరేమో, తెలిసికొని రమ్మన్నారు.

ఋషి: (తలయూచి) ఆ. నేనావిషయమై యోచించినాను. తుద నెగ్గుట కష్టసాధ్యము.

శ్యామ: కష్టమునకేమి ? వారి ధనము దినుచున్న మేము వారి పక్షమున నెంతైన కష్టపడుదుము. శ్రమకేమియు వెను దీయము.

ఋషి: మీరెంత కృతజ్ఞతతో పని చేసినను ఆమె స్త్రీ కదా ! పురుషులపై కక్షవహించి తుదనెగ్గుట అసాధ్యము. నేనిట్టి వెన్నియో చూచినాను. జస్వంతరావు చెప్పిన ట్లామె, వినుటమంచిది.

అని యాతడు తన యభిప్రాయ మెరింగింపగనే దత్తు ముఖ వికాసము రవంత మందమగుట ఋషి కనిపెట్టి, ఆతనికి ధైర్యము కలుగున ట్లుత్సాహ వాక్యముల నిట్లు పలికెను.

ఋషి : ఐనను, దైవము మనపక్షమున నున్నాడు. హోల్కారు వంశమును మొదటి నుండియు నెరింగిన నేను, మన రాణి గెల్చునట్లు ఆశీర్వాద మొసంగెదను.

శ్యామ:అయ్యా ! మీరు రాణిగారి పూర్వుల నెరుగుదురా? మీ వయ సెంత ?

ఋషి : ఎన్ని యెరిగిననేమి ? ఎంత వయస్సున్ననేమి ? ఈమెకు సాహాయ్యా మొనర్ప గలిగితినేని నాజన్మము ధన్యత గాంచును. కృతజ్ఞు లామెచుట్టును లేరుగనుక ఆమె నిర పాయస్థితిలోలేదు.

శ్యామ : (తొందరతో) ఏమీ ! ఎవరు కృతజ్ఞులుకారు ?

ఋషి : ఎవరునుకారు. రాణోజీ, దౌలత్‌రావు, గోమోజీలు తప్ప తక్కినవారెవ్వరును కృతజ్ఞులుకారు. రాధాకాంత రావు కూడ మంచివాడని చెప్పవచ్చును.

రాధాకాంతరావు విషయములో ఋషి పలికిన సందిగ్ధ వచనములు శ్యామసుందరుని మనసునకు కొంత వ్యాకులపాటు కలిగింప, అదివరకు తాను కన్నులార చూచుచుండిన దానికిని నేడు చెవులార విన్నదానికిని గల వ్యత్యాసమునకు కారణ మూహించుచుండెను. మార్పునొందిన దత్తు ముఖువై ఖరి నవలో కించి ఋషి యేమో మరల పలుక ప్రయత్నించుచు పెదవులు కదుపుచుండ, అంతలో కుటీరపువాకిట, "అయ్యో, అయ్యో, నిష్కారణ మిద్దరును చచ్చిపోవుచున్నారు. రక్షింపుడు, రక్షిం పుడు. కటకటా ! స్త్రీకూడ దారుణముగ ఆపదపాలగుచున్నది, రండు, రండు"...అని యెవడో అంగలార్చుట వినబడినది. కరుణార్ద్రి హృదయుడగు శ్యామసుందరుడు వెంటనేలేచి, చిలుకకొయ్యకు తగిలించియుండిన విల్లు నమ్ములనుగొని, మొలలోనున్న చిన్న కైజారును చేతబట్టి, ఆ స్థలమువంకకు బరుగెత్తెను. ఆర్తనాదముచేయు నాపురుషుని ఋషి పిలిచి యాపదనొందినవా రెవ్వరని యడిగెను. కాని, వాడు బదులు

చెప్పకయే దత్తును వెంబడించి పోవుటచే ఋషి సందేహము తీరలేదు. "ఈ దినముననో రేపో ఆతడు వచ్చునని తెలిసినది. ఈ యదృష్టహీనుడు వాడై యుండడుగదా!"—అని ఋషి తనలోతాను వితర్కించుకొనుచు, నేమియు దోపకపోవుటచే నిటునటు పచారుచేయుచు, ఎందుచేతనో తాను ఆప్రదేశమునకు మాత్ర మరుగక, ఉద్విగ్నుడై యుండెను.

* * * *

రాణోజీవల్కార పప్పటికి ఏబది సంవత్సరములు పైబడిన వాడు. చిన్నతనమందు మలహారురావు హోల్కారునకు తమ్మల పాకు చుట్టలు, దుస్తులు నందించు సేవకకోటిలోనివాడై యుండియు ఆ ప్రభువు ననుగ్రహమునకు పాత్రుడై క్రమముగ సైన్యమున నొక సరదారయ్యెను. తెలివితేటలు గలవాడగుటచే శీఘ్రమే రాజ్యమునందలి ముఖ్యోద్యోగులలో నొక్కడై మల హారురావు చనిపోవునప్పటికి ప్రధానవర్గములో నొక్కడైనాడు. సత్కులీనుడును సదాచారుడును కాకుండినను మిక్కిలి ప్రజ్ఞ గలవా డితడు. అందును కుయుక్తులకు పెట్టినదిపేరు. మోస మున నితనిజెప్పి మరియొకని జెప్పవలెను. సౌందర్యములేని నల్లని మోటువాడని చెప్పుటకంటె నతని యాకారమును వర్ణింపనక్కరలేదు. ప్రథమ కళత్రము చనిపోవుటచే మరల వివాహమాడ యత్నించి, తన ప్రియమిత్రుడగు హరిహర పాండ్యాజీ సహాయమున సౌందర్యరాశియగు నొక కన్యను వెంటబెట్టుకొని, మరికొన్ని రాజకార్య విషయకములగు

నుత్తరములను సంగ్రహించికొని, ఇందూరు నగరమునకు వచ్చు చుండెను. అత డారాత్రి యెట్లైన మాహూపురమును చేరవలె నని నిశ్చయించి ప్రొద్దుపోయిన వెనుకకూడ పయన మొనర్చు చుండెను. పల్లకియందు పదునెన్మిదివత్సరములు గల సుందరి యొకతె కూరుచుండి, తలుపు లించుక తెరచి, చుట్టునున్న కొండలను, మహావృక్షములను, నిర్మలమైన యాకాశమును తనివి దీర చూచుచుండెను. ఓంకారనాదములతో బోయీలు పల్లకి మోయుచు తనవెంట రాగా, రాణోజీవల్కారు తన్ను మోయ లేక మోయుచు మాటిమాటికి సకిలించుచున్న గుర్రముపై గూర్చుండి, ఇరుప్రక్కల నిరువురాయుధపాణులగు భటులు కొలువ బడలికతో ప్రయాణ మొనరించుచుండెను. మార్గశ్రమచే చెన్ను చెదరి విసిగియున్న ఆ సుందరియుండిన పల్లకి ప్రక్కగా మధ్యమధ్య నొకమారు తన గుర్రమును నడపించుచు, "కమలా! నీవు మిగుల శ్రమపడినట్లున్నావు. వచ్చినంతదూరము పోనక్కర లేదు. కావలసినయెడల నా దగ్గరనున్న రొట్టెలు నాల్గు తిను" మని యోదార్చుచు, వడిగ నడుగులు వైవుడని బోయీలను హెచ్చరించుచు రాణోజీ బాగుగా చీకటిపడునప్పటికి ఋషి వసించు ప్రదేశమునకు సమీపముగా వచ్చెను.

అట్లు పయనముచేయు నా మనుష్యులయెదుట మోర యెత్తి ఘణిల్లు, ఘణిల్లు మని చెవులు బ్రద్దలగునట్లు రంకె వేయుచు, కాలి డెక్కలతో నేల త్రవ్వి దుమ్ము రేపుచు, ఒక వృషభము భయంకరముగ దారి కడ్డము నిలిచియుండెను.

ఎద్దును బెదరింపుమని రాణోజీ తన సేవకులలో నొకని నాజ్ఞా పించెను. మందబుద్ధియు మోటుమానిసియు నగు ఆ ద్విపాద పశువు తనపైనున్న ఎఱ్ఱగుడ్డ తీసి విదలించుచు హూత్, హూత్ అని ఆ యెద్దును బెదరించెను. ఆ వృషభ మదివరకే ఒక కారు దున్నపోతుతో పోరాడి గాయపడి కడు కోపముతో నుండినది. అంతలో గుఱ్ఱముకూడ సకిలించినది. బోయీ లోంకార మెక్కు వగ చేసిరి. రక్తవస్త్ర దర్శనముచే బెదరి, బోయీల యోంకా రముచే కళవళపడి, గుఱ్ఱపు సకిలింపును సహింపనోపక, ఆ ఆల పోతు మార్గస్థుల గుండెలు వ్రక్కలగునట్లు రంకెవైచి, రభస ముగ వారిపై బడినది. దీనికంతకును కారకుడైన సేవక పశువు దాని బారినుండి తప్పించుకొని యావలబడినాడు. వాని వెను కనే వచ్చుచున్న రాణోజీ గుఱ్ఱముపై నా యెద్దు దుమికి దానిని కూలద్రోయ రాణోజీకూడ నేలగూలక తప్పినదికాదు. అతడు లేవ బ్రయత్నించునంతలో వృషభ మాతనిపై దుమికి వాడియైన కొమ్ములతో నాతని గుండెమీదను, డొక్కలోను, కణతమీదను తన యిచ్చవచ్చినట్లుక్రుమ్మి, క్రొన్నెత్తురుతో తన కొమ్ముల నలంకరించుకొన్నది. తమంతట తామే ఆయుధ ములు చేతులనుండి నేలజార, భయకంపితులైన సేవకులు వెనుకకు తిరిగియైనను చూడక పరుగెత్తిరి. బోయీలు పల్లకి నచ్చట విడిచి చెల్లా చెదరైరి. ఒక్క నిమేషమున, క్రింద బడియున్న నాయకుడును పల్లకిలోనున్న సుందరియు దక్క అం దెవ్వరును లేరైరి. పారిపోయిన సేవకులలో నొకడు ఋషి కుటీరము దగ్గరకు వచ్చి ఆ ఘోరవార్తను చాటు

టయు, సహాయార్థము శ్యామసుందరదత్తు బయలుదేరుటయు మీరు అందరు నెరుగుదురుకదా !

ఈలోన పల్లకిలోని స్త్రీ నోటమాటరాక, అంగము లాడక, కొయ్యబారినది. బోయీలు పల్లకి దింపుటయు, రాణోజీపై నెద్దు పడుటయు నామె యెరుగునేకాని, తర్వాత జరిగిన దామెకు గుర్తులేదు. ఇట్లామె పల్లకిలో పడియుండ నాయెద్దు కోపాగ్ని చల్లారకపోవుటచే కాబోలు ఆ పల్లకిని కొమ్ములతో గుభిల్లుగుభిల్లుమని పొడుచుచు కాళ్లతో తన్నుచు మహాబీభత్సము చేయుచుండెను. ఆబాలిక భయముచే నొకకేక వైచి నిశ్చేష్టయై పడిపోయినది. శ్యామసుందరదత్తు ఆ కేక విని అతి త్వరితముగా వచ్చి రెండు బాణము లాయెద్దు ముఖమున నాటనేసెను. కోపము ద్విగుణీకృతమై వృషభ మాతనిపై బడనుంకింప దత్తు మరిరెండు బాణములను దానికన్నుల గాడ నేసినాడు. 'అంబా' అని యరచుచు నెద్దు నేలబడినది. దత్తు ననుసరించి వచ్చిన యా సేవకుడు క్రిందబడిన యెద్దును నరకి తన యసహాయశూరతను ప్రదర్శించెను. దత్తు పల్లకిని యథా ప్రకారముగా పెట్టించి తలుపుల దెరచిచూడ నందు మూర్ఛితయైయున్న సుందరి కనబడినది. కొంచెము చల్లనీరు తెమ్మని సేవకునంపి, తానామగువను కూరుచుండబెట్టి పడకుండ పట్టుకొనియెను. ఇంతలో సేవకుడు నీరుతేగా చల్లని యా జలమామెమొగమున దత్తు చిలుకరించినాడు. అంతలో నామె కొంత సేదదీరి, యత డందిచ్చిన యాజలమును కొంత త్రావి, మరల సొమ్మసిలి, తిరిగి కొంతయుదకము గ్రోలి కనువిచ్చినది.

కనువిచ్చి యా సుందరి భువనసుందర విగ్రహుడగు శ్యామసుంద రుని గనుగొన్నది. పరపురుషుని యెదుట గూరుచుండుటకు సిగ్గుపడిన యామె యావలకు జరిగి, క్రిందపరచిన యుత్త రీయమును మేలిముసుగుగా వైచికొని యాత డెవ్వడని యాలోచించుచు, "ప్రభు వెట్లుండె" నని సేవకు నడిగెను. ఈ నడుమ శ్యామసుందరుడు రాణోజీ యొద్దకు బోయి చూచి, శరీరమునిండ గాయములు తగిలిన యాతడు జీవించుట కష్ట మని యెంచియు, తగు చికిత్స చేయదలచి తానును సేవకు డును మెల్లగ వానినెత్తి పల్లకిలో పరుండబెట్టిరి. "నా భార్య, నాభార్య" యని రాణోజీ మెల్లగా నన "నీభార్య సురక్షిత ముగ నున్నది. భయము లే" దని దత్తు ప్రత్యుత్తర మొసగి రెండు గుడ్డలు మసిచేసి ఆ గాయమునకు కట్టు కట్టెను. ఆ రెండుమాటలు తప్ప ఎన్నిసారులు పిలిచినను రాణోజీ పలుకక తనలోతాను పలుమారు పలవరింపదొడగెను. తన ప్రభు వింకను సురక్షితుడుగనే యున్నాడని సేవకునివలన నెరిగిన కమలా బాయి "ఇంకను జీవించియున్నాడా! దైవమునకు నాపై నింత కసియుండ నాకు మంచిస్థితి యెట్లు కలుగును? ఎద్దు పూర్ణముగ నాకుపకారము చేసినదికాదు. నన్ను చంపినను మేలుగా నుండెడిది"— అని తనలో విచారించుచుండెను. ఇంతలో బోయీలు తిరిగి వచ్చుటచే, రాణోజీని పల్లకిలో బెట్టించి, గూడెమునుండి తెప్పించినబండిలో కమలను గూర్చుండ బెట్టి, వారి నందరిని శ్యామసుందరదత్తు మాహూనగరమునకు తీసికొని పోయెను.

★ ★ ★ ★

ఏహూహూ గ్రామమున మురళీధరదాసను నొక గృహస్థుకు గుణవతియగు ఆనందబాయి యను నిల్లాలితో కాపురము చేయుచుండెను. అతడు మారువాడీ వర్తకులయొద్ద లెక్కలు వ్రాసి కుటుంబమును పోషించుకొనుచు, గౌరవముగ కాలక్షేపము చేయుచుండెను. అర్ధరాత్రి సమయమునకు శరీరమెరుగక పడియున్న రాణోజీని, దిక్కులేక భయవివశయైయున్న కమలాబాయిని వెంటబెట్టుకొని శ్యామసుందరదత్తు మాహూ నగరమును ప్రవేశించినాడు. భోజనముచేసి పురాణము చదువుకొనుచున్న మురళీధరుడు శ్యామసుందరుని చూడగనే అమితానందముతో భార్యను పిలిచి "మనదత్తు వచ్చినాడు, మనదత్తు" అని అరచెను. ఆనందబాయి తమ్ముని చేరవచ్చి, "ఏమి నాయనా, ఇంతకాలము జాగుచేసినా"వని అతని నాదరముతో పలుకరించినది. "అక్కయ్యా! నారాకకేమికాని, రాణి అహల్యాబాయి కొలువులో గొప్ప యుద్యోగిగా నున్న రాణోజీరావు మరణావస్థలో నున్నాడు. అతనితో అతని భార్యకూడ వచ్చినది. వారి విషయమున మనము శ్రద్ధపుచ్చుకొనవలె"నని జరిగిన వృత్తాంతమంతయును బావకును నక్కకును తెలియపరచెను. అంతలో కమల యెక్కిన బండియు, రాణోజీ పల్లకియు వచ్చినవి. స్పృహలేకపడియున్న రాణోజీని మెల్లమెల్లగా చేతులమీద వైచుకొని లోపలికితెచ్చి యొక గదిలో పరుపుమీద పరుండబెట్టినారు. పాపము రాణోజీ మూలుగుటయేకాని, బాధయిదియనికూడ చెప్పలేక, పిలిచిన పలుకక ప్రక్కపై కొట్టుకొన

సాగెను. వారప్పుడొక వ్రణవైద్యుని రప్పించి రాణోజీని జూపగా వైద్యుడు పెదవి విరిచి రోగి బ్రతుకుట దుర్లభ మని యెను. ఆనందబాయి కమలాబాయిని మిగుల గౌరవముగ లోనికి దెచ్చి, రెండు మెతుకు లెంగిలిపడునట్లుచేసి, దుఃఖ భారమున ఆత్మహత్య చేసుకొనునేమోయని కడు మెలకువతో ఆమెనొక నిమేషమైనను వదలక కాపాడుచుండెను. ఆమె యందమున కాశ్చర్య పడుచు "కాకి ముక్కునకు దొండపండు గట్టినట్టు లిట్టి ముసలివాని కీ చిన్న దానిని తల్లిదండ్రు లెట్లి చ్చిరోకదా! వానితోనైన ఇంత పసుపుకుంకుమ పెట్టుకొని పదికాలములపాటు కాపురము చేయనీక దైవ మామెకు ఘోరవైపరీత్యము తెచ్చిపెట్టెను" అని విచారపడుచు ఆమెపై చేయి వైచుకొని పండుకొన్నది. మురళీధరదాసు రాణోజీ స్థితిని జూచి, అతని తమ్ముడగు దౌలత్‌రావునకు ఒక మనుష్యు నిచే వర్తమాన మంపెను.

ఈనడుమ, ఆనందబాయి కొంచెము కన్నుమూసినందున పలువిధము లగు తలంపులు మనసున మల్లడిగొనుటచే రెప్ప పాటు లేకయున్న కమల లేచి కూర్చుండి, కన్నులనిండ ముక్తా ఫలములవలె క్రందుకొనియున్న బాష్పములను మాటిమాటికి తుడుచుకొనుచు, దుఃఖింపసాగినది. అంతలో నానందబాయి మేల్కొని కమలనుచూచి, "అమ్మా, ఏల వాపోవుదువు. విల పించిన కార్యమేమి? నీభర్త ప్రాణముల విషయమున తప్ప మరియే విషయమందైనను నాతమ్ముడు నీకు కావలసిన సాయము చేయును: అతడు మంచివాడు—" అని యూర

డించెను. తన వెనుకటి యవస్థయెల్ల మనస్సున తట్టుటచే కమల ఆమె యొడిలో తలపెట్టి గట్టిగ రోదన మొనర్చి, కొంత యుపశమిల్లినది. "అమ్మా! నీవు మా తల్లివంటిదానవు. నీ తమ్ముడు మిగుల మంచివాడు. అట్టివాని నింతవరకు చూచి యెరుగను. ప్రాణములు నిలిపిన మహాత్ము డతడుకదా! ఎన్నటికైన నా కతడే దిక్కని నమ్ముకొంటిని "- అని కమల పలుకు నంతలో శ్యామసుందరదత్తు గదిలోని కరుదెంచుటచే వారి సంభాషణ మాగిపోయినది. కమల ఆతని జూచుటతోడనే చటుక్కున లేచి గోడకుచేరి నిలిచి సిగ్గున తలవంచి పదాంగుళముతో నేల వ్రాయుచుండెను. దత్తామెను చూచుచు తన సోదరితో, "అక్కయ్యా! రాణోజీగారికి రవ్వంత నిలబాటు చేసినదని తోచుచున్నది. కుదురవచ్చునని నా కాశ కలదు,"- అని చెప్పి తన రాకచే వారి సంభాషణ ఆగినదనియు, కమల సిగ్గుపడుచున్నదనియు గ్రహించి తా నా గదినుండి వెలుపలికి బోయి, ఏమియు తోపక ఇటునటు పచారు చేయుచుండెను.

దౌలత్‌రావున్న యిందూరు నగరము అచటికి పదునాలుగు మైళ్ళంటిమి. అతనికై పోయిన మనుష్యుడు తెల్లవారు నప్పటికి అతనిని వెంటబెట్టుకొని వచ్చినాడు. శవమువలె పడియున్న సోదరునిజూచి దౌలత్‌రావు విలపించి, అతనిని పొరుగూర నుండనీయ జనదని, అతనిని కమలను పల్లకులలోనుంచి, దుండిరావును సేవకులును వెంటరా బయలుదేరెను. ఆనందాబాయిని వీడుటతో కమల మరల భయగ్రస్తయైనది. శ్యామసుందరు డామెను సాగనంపుటకు కడుదూరమరిగి, ఆమెను విడువ

లేక విడిచి, దౌలత్‌రావును వీడ్కొని యింటికి మరలెను. కొంత దూరము పయనము సాగిన తర్వాత రాణోజీకి ఆయాస మెక్కువ కాగా పల్లకీలను చెట్టుక్రింద దింపిరి. దౌలత్‌రావు గుండెలు బాదుకొని యేడువ నారంభించెను. కమల నిశ్చేష్ట యయ్యెను. పల్లకిలో నున్న రాణోజీ పల్లకిలోనే మృతి నొందినాడు.

★ ★ ★ ★

రాణోజీవల్కారునకు దౌలత్‌రావు వయసున తమ్ముడే యయినను దుర్గుణములలో నన్నయని చెప్పవచ్చును. రూపమున అచ్చముగా నన్నగారి పోలికయే. అభిమానముచేత అతని భార్యయు, పక్షపాతముచేత అతని స్నేహితులును నీలమేఘ శ్యాముడని ఇతనిని వర్ణించెదరు. నిజమున కితడు మాలకాకివలె నల్లనై, కొండముచ్చును బోలిన స్వరూప వికారము కల్గినవాడు. పెరిగిన బొర్ర కడుపు, విపరీతముగ పెరిగిన శరీరము చూచు వారికి నవ్వు పుట్టించుచుండును. అన్నదమ్ము లిరువురును కుయుక్తులతో గొప్పయుద్యోగములను సంపాదించి, హోల్కారు సంస్థానమునందు, దుర్మార్గమునకు పేరు వహించినవారు. అయినను, అంతవరకు తమ యేలిక విషయమై మాత్రము ఏ ద్రోహమును తలపెట్టినట్లులేదు.

రాణోజీ శవమును పల్లకియందేయుంచి, కమలాబాయిని మాత్రము వెంటబెట్టుకొని జాముప్రొద్దెక్కునప్పటికి దౌలతు రావు ఇందూరు నగరమును ప్రవేశించెను. తనభార్య కప్పగింపు

మని కమలను దుండిరావుతోనంపి, అన్న శవమును శ్మశానము నకు తీసికొనిపోవుటకు ఏర్పాటుచేసి, బంధుజనులకు వర్తమాన మంపి రుద్రభూమికి రప్పించి, తన సోదరునకు యథావిధిగా అగ్నిసంస్కారము చేసినాడు. అక్కడకు వచ్చిన కులస్థులందరును, కాలము తప్పినతర్వాత వివాహ మాడకూడదనియు, ఈ సుందరికి వివాహ మయ్యును కాకమునుపే వైధవ్యమువచ్చుట దుర్భరమనియు, ఆమె కీదురవస్థకలిగించుటకే యీశ్వరు డీపెండ్లి సంకల్పించెననియు బహువిధములుగ జాలినొందిరి.

దౌలత్‌రావు భార్య దుర్గాబాయి పెద్దపెట్టున ఏడ్చుచు ఎదురువచ్చి తోడికోడలిని కౌగలించుకొని, "అమ్మా! తోడి కోడంద్రమని పట్టుమని పదినాళ్లైనను కాపురము చేయమైతిమి. ఏ సుఖము ననుభవింపకముందే, పసుపు కుంకుమలైన మనసు దీర పెట్టుకొనకముందే, ఒక ముద్దు ముచ్చటయు తీరకముందే, యింతలోనే యీలాగున నైతివిగదే! ఎంత దురదృష్టవతివే,"- అని పరిపరి విధముల నంగలార్చి, కమలయు కొంచెము దుఃఖింప ఆమెను ఓదార్చుచుండెను. కమల యెందుచేతనో కాని ధైర్యము చిక్కబట్టి యెక్కువగా నేడువక గుండె రాయిచేసికొని యుండెను.

అగ్ని సంస్కారాదుల జేసి దౌలతురావు, కర్మ లన్నియు నడిపిన తర్వాత, దుండిరావును పిలిచి కమల విషయ మిట్లు ప్రస్తావించెను.

దౌలత్ : దుండీ, మాయింటి కెంత దుర్దశవచ్చినది ! నా కుడి చేయి పడిపోయినది కదా ! ఇంక నా బ్రతుకెట్లు ?

దుండి : దైవ నిర్ణయమున కేమి చేయగలము ! కాని, మీ వదిన గారి మాట దలచిన నాగుండెలు తాళుట లేదు.

దాల : ఆహా, ఏమి యామె యందము ! ఇంతటి యందగత్తెను నేనెక్కడను చూడలేదు. ఇటువంటి యువతి యెంత యదృష్టవంతునకు భార్య యగునో!

దుండి : (కొంచెమాలోచించి, సందేహముతో) - ఆమె యెక్కడి కరుగగలదు ! పాపము. ఇక నీవే దిక్కు. నిన్ను నమ్ముకొని యుండును గనుక నీవామె సుఖము చూడుము.

దాల : ఆమె నాదగ్గర నుండునా ! పుట్టింటి కరుగునేమో!— నిజముగా, ఈమెను మాఅన్నగారు వివాహమాడినారా!

దుండి : వివాహమైనపుడు నేనక్కడ లేనుగాని, పెండ్లి అయినదని మీ అన్నగారు నాతో చెప్పినారు. త్రోవలో తన్నడిగిన వారందరితోను ఈమె తన భార్యయే యని చెప్పినాడు. కనుక,- పెండ్లి అయినదనుటకు సందేహము లేదు.

దాల : ఐనదా? నేను కాలేదనుకున్నాను. సరే, ఇక విచారమే లేదు.

దుండి : విచారమెందుకు ? నా దగ్గర దాపక చెప్పుము. మనకు లాభించు నెడల పెండ్లి కాలేదని చెప్పుదుము. నీకేమైన ఆశ కలదా ?

దాల : మిత్రుడా ! కమలను మాయన్న పెండ్లియాడలేదని చెప్పి నీవు నాకు సహాయము చేసెదవేని, నే నామెను వివాహమాడవలెనని యున్నది.

దుండి : నీకు ప్రియము సేయుటకంటె నాకు కర్తవ్యమేమి? ఆమెను నయమున, భయమున లొంగదీసి నీకు వివాహము చేయింతును. కొన్నినాళ్ళు మాత్రము నీవు నోరెత్తకుము.

అని వారు మాటాడుకొనుచుండ దుర్గాబాయి లోపలి నుంచి వచ్చి, కమలాబాయి తల్లికిని, తమ్మునకును వర్తమాన మంపుమని భర్తనుకోరెను. దుర్గయనినచో దుండిరావున కొక విధమగు భయము. కనుక, ఆమె వచ్చిన తోడనే అతడు లేచి మెల్లగా వెలికి జారుకొన్నాడు. కమల పుట్టినింటికి వర్తమాన మంపుటకు సమ్మతించి, దౌలత్‌రావు తన కోరికను భార్యకు నెరిగింప గోరి, ఆమె యెడ్డ భయముగలవాడగుటచే రవంత సంశయించి యూరకుండెను. సద్వంశమున బుట్టిన యిల్లాలు దుర్గాబాయి. సదాచారుడుగాని భర్త సద్గుణవతి యగు భార్యకు జడియుట సహజమే. అయినను, ఈ దుష్టుడు చీవాట్లకు వెరవక, అప్పుడప్పుడు తన మనోరథముల నామెకు దెలిపి, ఆమెచే మందలింపబడుటయు కలదు. ఆనాడు దౌలత్‌రావుకును భార్యకును నిట్లు ప్రసంగము జరిగినది.

దౌల : పిల్లలులేనివారి బ్రతుకు వ్యర్థముకదా! మా యన్నకు బిడ్డలు లేనందున నేనే కర్మ చేయవలసి వచ్చినది. నాకును పిల్లలు లేరుకదా! ఈ వల్కారువంశ మింతటితో అంతమగును కాబోలు!

దుర్గ : (సిగ్గున తలవంచుకొని) మీ రెవరినైన పెంచుకొనుడు.

దౌల : పెంచుకొనినవారికి ముప్పు గడచుట అరుదు. అంత కంటెను తెగించి మరియొక దానిని పెండ్లి యాడుట యుత్తమము. నీ కిష్టమైనచో అట్లు చేసెదను.

దుర్గ : నాకిష్టమే కాని మీ కీవయసున పిల్లనిచ్చు వా రెవరు ?

దౌల : ఇచ్చెడి వా రెవరు ! పిల్ల సిద్ధముగనే యున్నది. నీ దయ యుండిన——అది——

దుర్గ : (వెలవెలబోయి, చూచుచు) పి - పిల్ల యెవరు !

దౌల : (లేచి భార్య రెండు చేతులు పట్టుకొని) - నేనొక మాట చెప్పెదను కోపపడక వినుము. కమలను నాకిచ్చి వివాహము చేయుము.

దుర్గ : (దెబ్బతిన్న పామువలె బుస్సుమని లేచి, కోపావేశముతో పెదవులు తడబడ) ఛీ, ఛీ, నీవంటి కఠినచిత్తుని, పాపకర్ముని ఎందును చూడము. అన్నగారి చితి తిన్నగ చల్లారనైనలేదు. పుట్టెడు దుఃఖములో నున్న ఆయన భార్య నోదార్చుటకు మారు ఆమెను పెండ్లియాడెదనని చెప్పుటకు నోరెట్లు వచ్చెను ? విధవయని సందేహము కూడ లేదు. అన్న భార్య తల్లివంటిదను గౌరవము లేదు. నీ ముఖము చూచినచో పంచమహాపాతకములు చుట్టును. ఛీ. ఛీ.

దౌల : (మెల్లగా) ఆమె నిజముగ విధవయైనచో నాది తప్పే. మా యన్న ఆమెను పెండ్లియాడ లేదట.

దుర్గ : ఈ మాయమాట లెవరు చెప్పిరి ? దుండిరావేనా ? వాని యమ్మ కడుపు మాడ. వానికి చావు మూడదు ! ఆ

కాళికాదేవికి వాడిమీద దయ. ఆ దిక్కుమాలిన వాడే నా కొంప తీయుచున్నది. ఊరిలో సాటివారు విన్న నేమందురు? పెండ్లి కాకున్నచో వైధవ్య మనుభవించుటకు ఆమెకు ముచ్చటా?

దౌల : (బతిమాలుచు) నీకు సవతి వచ్చునను నీర్ష్యచే నిట్లనుచున్నావు. కోపపడక నా ముద్దు చెల్లింపుము.

ఆ పలుకులు దుర్గ అలుక నధికము సేయ ఆమె విదిలించుకొని లోపలికి పోయెను. తన భర్తకును, తనకును జరిగిన ప్రసంగమంతయు పూసగ్రుచ్చినట్లు కమలకు దెలిపి జాగ్రత్తగ నుండుమని యామెను హెచ్చరించి అంతటితో తృప్తికలుగమి, తనయింటి పొరుగుననున్న రాధాకాంతరావు భార్యయైన రోహిణీబాయితో నీ వార్త చెప్పి, ఆమె మగనిచే సాయము చేయించునట్లు మాట గైకొనివచ్చెను. దౌలత్‌రావు దురుద్దేశము నెరింగిన కమల భయపడుచు తోడేలు నోటినుండి విడివడి పులి నోట బడితిని కదా అని దుఃఖింపసాగెను.

మరునాడు రాధాకాంతరాయలు ఈ విషయమును భార్యవలన విని, కమలతో స్వయముగ మాటలాడి రమ్మని రోహిణీబాయి నంపెను. రోహిణియు, దుర్గయు నెన్ని విధములనో తరచి తరచి ఆమెను వివాహమును గూర్చి యడిగిరి. కాని, ఆమె తిన్నగా ప్రత్యుత్తర మీయక, "నా కర్మము నే ననుభవింపక తప్పదు. జల మరణమో, అగ్ని మరణమో నా మొగమున వ్రాసియున్నది. నాకు మానహాని మాత్రము కలుగకుండ మీరు కాపాడు"డని బదులు చెప్పెను.

"ఆమె యాత్మ హత్యకు ప్రయత్నించునేమో జాగరూకతతో గమనించుచుండు" మని దుర్గకు బోధచేసి, రోహిణీబాయి దౌలత్‌రావు దుర్మార్గము చేయబూనుచో నామెను తన యింటికి పంపుమని నొక్కిచెప్పి యింటికరిగెను. ఆమధ్యాహ్నము రాధాకాంతరావుకూడ "అన్న భార్యను బాధింపవల"దని దౌలత్ రావునకు హితోపదేశము చేసెను. దానితో దౌలత్‌రావు మండి పడి, వృద్ధ రాధాకాంతుని అనరానిమాట లనెను. రాధా కాంతుడును, పట్టుదల గలవాడగుటచే ఈ విషయమున ఎంత పనియైననుచేసి కమలను రక్షింప నిశ్చయించినాడు. మొండి వాడగు దౌలత్‌రావు కమలను వివాహమాడుటకే నిశ్చయించి నాడు. మానహానికి భయపడిన కమల ఆత్మహత్యకు నిశ్చయించు కొన్నది.

★ ★ ★ ★

మహారాష్ట్ర ప్రభుకుటుంబములలో నమిత గౌరవము నకు పాత్రమైన హోల్కారు వంశమును స్థాపించినవాడు మల్హారరావు హోల్కారు. ఈతడు మొదట పీష్వాలయొద్ద సిపాయిగ నుండి, బలాతిశయముచేత వాసికెక్కిన యోధ వరుడై, తన ప్రభువుల కనుగ్రహ పాత్రుడయ్యెను. అందుచే పీష్వా బాలాజీరా వితనికి మాళవదేశమున జాగీరులిచ్చి, తనకు లోబడి యుండునట్లు, ఒక చిన్న రాజుగ నొనర్చెను. తర్వాత, మల్హారరావు మరికొంత రాజ్యము సంపాదించి, మాళవదేశమున నున్న యిందూరు నగరమును రాజధానిగ చేసికొని, పేరుకు

మాత్రము పీష్వాకు లోబడినట్లుండినను, చాలమటుకు స్వతంత్రుడుగనే వ్యవహరించుచుండెను. కాని యాతని యుత్సాహవృక్షము మూలమును పెకలించినట్లు అతని కుమారుడగు ఖండేరావును భగవంతు డెత్తికొని పోయినాడు. ఖండేరావున కప్పటికి మాలిరావను నొక కుమారుడును, గుణముక్తాభరణ యగు ముక్తాబాయి యను నొక కూతురు నుండిరి. నిండు జవ్వనమున నుండిన ఖండేరావు భార్య యహల్యాబాయి, భర్తృహీనయై, యొంటిపూట భుజించుచు, నేల బండుకొనుచు కాలము బుచ్చుచుండినది. ఈలోగా, మల్హారరావు మరణించినాడు. మాలీరావును, మల్హారుని గలిసికొన్నాడు. భర్తయు, మామయు, కుమారుడును నించుమించుగ నొకమారే కాల ధర్మము నొందుటయు, హోల్కారు వంశము నశించుటయు, ఇందూరు రాజ్యలక్ష్మి తనవలె అనాథ యగుటయు చూచి, యబలయయ్యు నహల్య రాజ్య రక్షణకై నడుము బిగించినది.

రాణోజీ వల్కారు మృతినొందిన నాల్గవనాడు మాహూపురము నుండి శ్యామసుందరదత్తు రాధాకాంతరావు గృహమునకు వచ్చి, ఋషికిని తనకును జరిగిన ప్రసంగమును, రాణోజీ మరణ విషయమును, తానొనర్చిన సహాయమును వివరించెను. తన మిత్రుని కుమారుడగు నితని నభివృద్ధికి దెచ్చుటకై రాధాకాంతుడు దత్తుకు నెలకు ముప్పది రూకల జీతముగల యుద్యోగ మిప్పించి, యాతనికి బంధువు లెవ్వరు నచ్చట లేమిని, తన యింటనే భోజన మిడుచు, ఆప్యాయముగ జూచుకొనుచుండెను. చనిపోయిన మల్హారరావునకు రాధాకాంతు డాప్త మిత్రుడై

నందున జనులు రాధాకాంతునిపై నమిత గౌరవమును జూపుచు, నతని కాజ్ఞానువర్తులై మెలగుచుండిరి. డెబ్బది సంవత్సరముల వాడైనను సడలని దేహపటిమకును, అంతకన్న పటిష్ఠమైన రాజభక్తికిని నిత డిక్కయై యుండెను.

రాధాకాంతుడు శ్యామసుందరుని వెంటబెట్టుకొని రాణిగారిని దర్శింప నేగెను. రాణిగారి యనుజ్ఞతో నొక సేవకుడు వారి నంతఃపురములోని యొక గదిలోనికి గొంపోయెను. ఆ గదిలో ముత్యాల జాలరువలె నడుమ వేయబడిన తెల్లని తెర చాటున, నొక నల్లని బక్కపలుచని యంగనయు, నామెకు కొంత వెనుకగ పదునారేడుల బాలిక యొకతెయు ఆసీనలై యుండిరి. రాధాకాంతుడును, శ్యామసుందరుడును తెర సమీపమునకు జని నమస్కరించి, యట నుపవిష్టులైరి. క్రొత్తవాడగు దత్తును జూచి పడుచుకన్నె యగు ముక్తాబాయి వేరొక గదిలోనికి బోయెను. అప్పు డహల్యాబాయి తెరదీయించి యిట్లు ప్రసంగించెను.

అహ : నీవు మాతో మాటాడిన దీ బాలుని విషయమేనా ?

రాధా : చిత్తము. ఈ కుఱ్ఱవాడే. ఏలినవారు నాయం దెట్టిభావ ముంచినారో యీ బాలునియందును అట్టి భావ ముంచదగును.

అహ : (కంట తడిబెట్టుచు) ఈ బాలు డచ్చము మాలిరావు వలెనే యున్నాడు.

రాధా : అమ్మా ! చింతించి లాభములేదు. మాలిరావు మరి రాడు. ప్రజలందరు మీ బిడ్డలేకదా ! వారిని చూచి యూరడిల్లుడు.

అహా : అవును, ప్రజలే బిడ్డలని నమ్ముకొంటిని. కాని, కొందరు నాయందు విశ్వాసములేక ప్రవర్తించుచున్నారు.

రాధా : అమ్మా ! అంతపాపకర్ములు, దౌర్భాగ్యులు నెవ్వరు?

అహా : నీయందును గంగాధర జస్వంతరావు నందును నాయాస లన్నియు నిలిపికొని యుంటిని, కాని నా యాస—

రాధా : (తొందరతో) అమ్మా! నా విషయమై మీకు సందేహ మేల ? మీపాదములు సాక్షి—నా ప్రాణమునకైనను లెక్కసేయను.

అహా : నీవిషయముకాదు, జస్వంతరావును గూర్చి చెప్పు చున్నాను. నిన్న అతడు నా దగ్గరకు వచ్చి, కుమారుని బెంచుకొమ్మని యనేకవిధముల నుపదేశ మొనర్చి, నేను రాజ్యముచేయుట ప్రజల కిష్టములేదని కఠినముగా బలికి నాడు. ఇతడిట్లగునని నేనెన్నడును తలపలేదు.

ఈమాటలు చెవినిబడ్డ ముక్తాబాయికి మనస్సు మనస్సులో లేదు. తన తల్లికిని తాను ప్రేమించిన జస్వంతునకును సఖ్యము కలుగవలెనని ప్రార్థించిన దామె. రాధాకాంతుడు గంగాధరుని విషయమై మొదటినుండియు సందేహము నొందుచుండుటచే నతని యనుమానము రాణి తెలిపిన సంగతులచే బలపడినది. దత్తుమాత్రము నమ్మజాలకుండెను.

అహా : ఇంకను విశేషములేమి ? రాణోజీ పాపము పోయినా డట ! దౌలత్‌రావునకు కష్టము సంభవించినది కదా !

రాధా : అతనికే కాదు. చచ్చెడివాడు చచ్చుచు నొక బంగారు వంటి పిల్ల గొంతుక కోసినాడు. పాప మా అనాథబాలిక కూడ నిక్కడికి వచ్చినది.

దత్తు : దౌలత్ రా వామెను బాధించుచున్నాడట.

అహ : నా పాలనలో స్త్రీల కవమానము జరుగకూడదు. దౌలత్‌రావును నేను మందలించి యామె కష్టమును బాపెదను.

రాధా : ఆమెను పెండ్లియాడునట యతడు. ఆమెకు వివాహమే కాలేదని వాదించుచున్నాడు. మీ రిందు జోక్యము కలిగించుకొన్న, దుష్టుడగు నతడు శత్రు పక్షములో చేరినను చేరును. మనకు నష్టము కలుగగలదు.

అహ : నా రాజ్యము పోయినను పోనిమ్ము. సాధుబాధ నివారింపకున్న నా రాజ్యమెందుకు ?

దత్తు : (తనలో) ఈమె ధర్మదేవత.

రాధా : అమ్మా! అట్లయిన జస్వంతరావు మొదలగు వారితో నింకను నెవ్వరు చేరినారు ? దానికి మనమేమి ప్రతిక్రియ చేయవలెను ?

అహ : దౌలత్‌రావు చేరును, ఇంక నెవరు చేరుదురో తెలియదు. ఎందరు చేరినను మీ బలముండినచో గెలువ గలను.

రాధా : మీ పాదములు సాక్షిగా, శ్రీ విశ్వేశ్వరుడు సాక్షిగా మీయెడ విశ్వాసముంచినాడను. దత్తున్న [illegible]

దత్తు : అఖిల దేవతలు సాక్షులుగ నేను మీ ఆజ్ఞను నెరవేర్తును.

ఈ పలుకులతో నహల్యాబాయి మిక్కిలి సంతోషించి, వారిని సగౌరవముగ వీడుకొల్పినది.

★ ★ ★ ★

గంగాధర జస్వంతరావు సుమారు ముప్పదియేండ్ల వయస్సువాడు. బుద్ధిచేతను, బాహుబలము చేతను అతడు తలచిన కార్యములెల్లను నిర్వహింపగల సమర్థుడు. మల్హారరావు మృతి నొందిన వెనుక, మంత్రియగు నితనికి అధికారముపై నాశ జనించినది. అహల్య యున్నచో తన యాటలు సాగవని తలచి, కుమారునొకని బెంచుకొమ్మని యామెకు బోధచేసెను. తనకు కుమార్తె యుండగా పరుని నొకని దెచ్చి వానికి రాజ్య మిచ్చుట కహల్య యంగీకరింపలేదు. అందుచే గంగాధరు డాగ్రహించినాడు.

వెనుకటి ప్రకరణమున జెప్పబడిన సంగతులు జగిరిన మరునాడు రాత్రి, గంగాధరుడు భోజనముచేసి తన మిత్రుల నిమిత్త మెదురు చూచుచుండెను. ఇంతలో హరిహరపాండ్యాజీ యను బ్రాహ్మణుడు వచ్చి, గోమోజీరావు దౌలత్‌రావులు సిద్ధముగ నున్నారనియు, తాను వారి నిక్కడికి రమ్మంటిననియు జెప్పినాడు.

గంగా : రఘునాథరా వేమనుచున్నాడు ? నేను చెప్పిన ట్లతనికి నీవు చెప్పినావా ?

హరి : ఈ కార్యము రఘునాథరావున కిష్టమే. నీ వెపుడు రమ్మన్న నపుడె దండెత్తి వచ్చి యహల్యాను రాజ్య భ్రష్టగ చేయును.

గంగా : నిజముగా నాత డట్లు వాగ్దానము చేసినాడా ?

హరి : నాతో అబద్ధము పలుకడు. కొంత రాజ్యము వాని కిచ్చుటకు సమ్మతింతువేని నీవే హోల్కారగునట్లు నేను చేయగలను.

గంగా : నన్ను హోల్కారుగ జేసిన నేనతనికి సగము రాజ్యము నిచ్చుట యాశ్చర్యమా ? కష్టమా ? కాని, నేను హోల్కారు కావలెనను పట్టింపు నాకు లేదు. ఈ ఆడు దాని పాలన తప్పిన చాలును. అహల్యాను చూచిన నా యొడలు మండును. కాని, ముక్తను గన్గొన్న నా హృదయము ద్రవించును.

అని జస్వంతరావును, హరిహరపాండ్యాజీయును ముచ్చ టించు సమయమున సేవకసహితుడై గోమోజీరావు వచ్చెను. దౌలత్‌రావు దుండిరావులు కూడ నరుగుదెంచిరి. జస్వంతరా వందరను మేడమీదికి గొంపోయెను. అందరు నొకరి నొక రెరు గుదురు కాని గోమోజీ సేవకుడగు సకారామును మాత్ర మెరుగరు. తమవాడే యని గోమోజీ యభయ మిచ్చిన తర్వాత వారు మాటాడ మొదలిడిరి.

గంగా : స్నేహితులారా ? మన ప్రభువు మల్హారరావు చని పోవుటయు, ఆయన పుత్రపౌత్రులును నశ్శే మనకు దక్కక పోవుటయు నెరుగుదురు. ఇంకొకనిని దత్తత

చేసికొనుమని నేను రాణికి విన్నవింపగా ఆమె తిరస్క రించి నన్ననరానిమాట లనినది. మనపై నధికారము చేసి తీరుదునని స్పష్టముగ చెప్పినది.

గోమో : రామా! ఎంత దౌర్భాగ్యము! ఆడుది రాజ్యము చేయు కాలముకూడ వచ్చినది,

దౌల : మామగారి చావు, కుట్టుగుంటచావు ఆమెకు పండుగ లైనవి. కుమారుడు కడతేరి మూడు మాసములైనను కాలేదు. ఇంతలో నింకొక స్త్రీ యైనచో రాజ్య మేల దలంచునా!

గంగా : మనమందరము పరువుగల మహారాష్ట్రులము. ఇంత బలము, ఇంత బుద్ధిసంపద కలిగియుండియు, చివరకు ఆడుదాని పరిపాలనకు లొంగి పడియుండవలసినవార మైతిమి. ఈ ఆడుదాని ప్రభుత్వమున మన గౌరవ ప్రతిష్ఠలు నిలుచునా! ఈమెకు లోబడియుండుట మీకిష్టమా! మీరు మహారాష్ట్రులగుదురేని ఆమె యొనర్చు ప్రతి కార్యమునకును విఘ్నములు గలిగింపుడు. మీకిది సమ్మతమేనా?

దౌల : అడుగవలెనా! అవమానమును భరింపలేకున్నాను. నీ వెట్లు చెప్పిన అట్లు చేసెదను. భిల్లులను సహాయము చేసికొని దేశమును కొల్లగొందము. ఆమె యేమి చేయునో చూతము.

జస్వం : ఆమెమీది కోపముతో నిరపరాధులగు ప్రజలను క్షోభ పెట్టుట తగదు. ప్రజలను హింసించుట అన్యాయము.

గోమో : ఉదయపుర మహారాణావారికి వర్తమానమంపి మన దేశముపై దండెత్తుమని ప్రోత్సాహపెట్టుట యుక్తము. భేతాళసింగుతో నేనిదివరకే ఆమాట తలపెట్టియున్నాను.

జస్వం : రాజపుత్రు లసాధ్యులు. వచ్చినతర్వాత వారిని వదల్చుకొనుట కష్టము. కాన, వారిని బిలువరాదు. కావలె నన్న రఘునాథరావును రమ్మందము.

దౌల : బాగుగనున్నది. (దుండిరావు చెవిలో) ఈ జస్వంతరావు రఘునాథుని సాయమున తాను బలపడ నెంచుచున్నాడు. మనము భిల్లులను వదలిపెట్టరాదు.

దుండి : అయ్యో ! శ్యామసుందరదత్తును, రాధాకాంతుడును మనల బట్టుకొందురట. జాగ్రత్తగ నుండవలెను.

దౌల : మరచితిని. ఆ కుఱ్ఱవాడు శ్యామసుందరుడు తెగ నీలుగుచున్నవాడట. గోమోజీ కొత్వాలు కదా ! అతడు తలచుకొన్నచో దత్తు నణచియుంచగలడు.

గోమో : నను గూర్చియు వాడు ప్రేలుచున్నాడట. వాని నేమైనను చేయవలెను.

జస్వం : దౌలత్‌రావూ ! నీవు మీ యన్న భార్యను వివాహ మాడెదవని విన్నాము. నీ వట్లుచేసినచో ప్రజలకు మనము దూరమగుదుము. ఆ పనిమాత్రము వద్దు.

దౌల : పరవాలేదు. ఇక పోదము.

—అని యందరును లేచిపోయిరి. సకారాము ఏమియు మాటాడ నందున జస్వంతు డనుమానించెను. గోమోజీ సకా

రామును వెంటబెట్టుకొని కొంత దవ్వరిగి యచ్చట నతని చెవిలో, "ఓయీ, స్వలాభ పరాయణులు, దురాత్ములు నగు వీరిని నమ్ముకొని నా యుద్యోగము మానుకొందునా! దౌలత్ రావు జస్వంతరావులు తమ తమ మనోరథముల నెరవేర్చదలచి యీ యెత్తులెత్తిరి. ఏమైనను, నింబపురమును గైకొమ్మని రాణా వారితో చెప్పుము. అరుగుము—" అని వానిని పంపి తాను గృహామునకు ఏగెను.

* * * *

"—నేను మీ ముఖ్యమంత్రులలోని వాడనని మీ రెంచుకొనుట లేదు. పుత్రస్వీకారమును చేయుటకు మీ రంగీకరించుట లేదు. రాజ్యమునకును మీకును అమితోపకారము చేయుచున్న మావంటి వారిని నిరాకరించితిరి. మీరు జంబుకములను నమ్ముకొను చున్నారు. నిజము నిలకడమీద తేలును. కుమారుని పెంచుకొనరేని మీకడ నే నుద్యోగము చేయజాలను. త్రికరణ శుద్ధిగ వ్రాసిన యీ నా మాటలకు తిరుగు లేదు" - అని యున్న లేఖను చదువుకొనుచు రాధాకాంతుని నిమిత్తమెదురు చూచుచుండిన దహల్యాబాయి. ఇంతలో రాధాకాంతుడును వచ్చినాడు. "ఈ చమత్కారమును నీ వెరుగవు గాబోలును. ఈ చీటి చదువుకొ" మ్మని యా లేఖను రాధాకాంతునిపై వేసిన దామె. అతడది చదివిన తర్వాత వారి కిట్లు సంభాషణ జరిగినది.

రాధా : అమ్మా! జస్వంతరా వెంతటివాడై నాడు ? శ్రుతి మించి రాగమున బడినది. మనము జాగ్రత్తగ నుండ వలెను.

రాణి : భయములేదు. ఐనను, ఇట్టివా రింకెందరున్నారో తెలిసి కొనవలెను కదా !

రాధా : (రాణి ధైర్యమునకు సంతసించి) శివరావును నింబ పురములో నుంచుటలో మీరు మంచిపని చేసినారు. అతడు మన కాప్తుడు. కొత్వాలు గోమోజీకూడ మంచి వాడే యని నాకు తోచుచున్నది. తుకాజీ హోల్కా రుది కుక్కవిశ్వాసము. ఐనను, అతనికి గొప్ప యుద్యోగ మీయదగదు.

రాణి : (అతని మాటల కడ్డము వచ్చి) గుణములచే తుకాజీ యుత్తముడు. అతనికి సైన్యాధిపత్య మొసగినదందుకే. ఈ విషయము లన్నిటికంటె ముక్తాబాయి విషయమే నన్ను కలవరపెట్టు చున్నది. ఆమె మనస్సింకను తమ్ముని పైనే యున్నది.

రాధా : చమత్కారముగ కథలు చెప్పి ముక్తాబాయి బెంగ పోగొట్టుటకై మాయింట నున్న సీతయను నొక దాసి నంపెదను. నేటి కిక నేను సెలవు గైకొందును.

రాధాకాంతరా వరగిన యొక గడియలోపలనే దౌలత్ రావు తన యేలిక దర్శనమునకై వచ్చినాడు. రాణి నాలుగు నిమేషములు వానివంక చూచి, కూర్చుండుమనెను.

అహా : పాపము ! మీ యన్నగారు పోయినందుకు చాల విచారముగ నున్నది. నీకు పెద్దకష్టము వచ్చినది.

దౌల : (తలవంచి) ఏమిచేయగలము ! కాలవశము !

అహా : క్రొత్తగా పెండ్లియైనదటకదా ! ఆ యనాథ యెచ్చట నున్నది ?

దౌల : ఇక్కడనేయున్నది, పెండ్లి కాలేదని చెప్పుచున్నారు.

అహా : ఛీ ! ఛీ ! నాదగ్గరకూడ నీమాయమాటలేనా ! నీవా మెను బలవంతముగ వివాహమాడ దలచినావట ! నారాజ్యములో దుర్మార్గము జరుగరాదు. అన్నభార్యను బలవంతముగా పెండ్లియాడుటకు నీకు సిగ్గులేదా !

దౌల : అమ్మా నేనట్టి దుష్కార్యమును తలపెట్టలేదు. కిట్టని వారు అబద్ధము చెప్పినారు. అన్నభార్య తల్లికాదా ! నేనట్టిపని చేయుదునా ! ఆమెకు పెండ్లియైనచో నాకక్కరలేదు.

అహా : సరే, జస్వంతరావు మాపై నలుకవహించినాడట ! నీవును అందు చేరినావా ! ఇంకను నీవంటివారు లెందరు?

దౌల : రామరామ, నేనేపాప మెరుగను. మీ పాదములతోడు. శ్రీ విశ్వేశ్వరస్వామివారితోడు. సెలవైనచో జస్వంత రావును బట్టియిచ్చెదను.

అహా : అతడేకాదు. మీరందరును చచ్చినట్లే భావింపుడు. ఇక నీవు పో.

అటనుండి వెడలిన దౌలత్‌రావు ఆరాత్రి కమలను బల వంతపరుపబోయి విఫలుడై, భార్యచేత చీవాట్లుదిని, ఎట్లో

నిర్ధరించినాడు. ఇక నట నుండరాదని యెవ్వరికిని చెప్పక యే చీకటిలో కమల గృహమునుండి యెచటికో వెడలిపోయినది. ఉదయమున ఆమె యింట లేకుండుటగాంచి దుర్గయు, దౌలతు రావును ఆమెను వెదికింప నేర్పాట్లు చేసిరి. దీపము పెట్టిన తర్వాత నొకడు వగర్చుకొనుచువచ్చి, "తోట నూతిలో కమల శవము తేలుచున్నది"—అని చెప్పినాడు. ఎవ్వరికి దెలియకుండ దహనము చేయుటకై యాతనికి నాలుగురూపాయలిచ్చి దుండిరావును కూడ సహాయమిచ్చి పంపినాడు దౌలత్‌రావు.

* * * *

తన యజమానుని యాజ్ఞ నిర్వర్తించి, దుండిరావు మాహులాపుర సమీపముననున్న గూడెముచేరి, యందున్న ఋషి కుటీరము ప్రవేశించెను. ఆ ఋషి దౌలతురావు విషయమై ప్రశ్నించుచుండు నంతలో దీర్ఘకాయుడగు నల్లని మనుష్యుడొక డటకు వచ్చెను. అతని యాకారమును బట్టియు, చేతనున్న గండ్రగొడ్డలిని బట్టియు నత డొక యాటవికు డని తెలియ వచ్చును.

ఆటవికుడు : తాంతియా రాలేదా! ఈ దుండిరా వేమను చున్నాడు? ఇతనిని నమ్మవచ్చునా?

ఋషి : ఓయీ! గండా! వచ్చి కూర్చుండుము. ఇతడు మన వాడే.

దుండి : ఓయీ, గండాభిల్లుడా! జస్వంతరావు, దౌలత్‌రావు, గోమోజీరావు మొదలగు ప్రబలులు రాణిపై కత్తి

కట్టినారు. నీభిల్ల సైన్యముతో వారి కండగ నిల్చితివేని ఉభయులకును లాభముండును. నీవు దోచుకొన్న సొమ్ము నీదే. అదికాక, మనుమడు చనిపోయినచో మరియొకనిని దత్తము గై కొనవలెనని మల్హారరావు మరణశాసనమును వ్రాసినాడు. వారి బందుగుల కుఱ్ఱవాడొక డున్నాడు. మనవా రాతనికి పట్టాభిషేకము చేయుదురు. క్రొత్త హోల్కారునకు మీరు సహాయము చేయుడు.

ఋషి : ఆ హోల్కారును నేనెరుగుదును. గండా! అహల్యా బాయి యిక సింహాసనముపై నుండదు. ఈ విషయము రాధాకాంతరావుతోడను చెప్పినాను. శ్యామసుందరుడు నాతో మాటాడినపుడు వారిప్రక్క నున్నట్లే పలికి మోసగించినాను. కాని, నేను వారి పతనము చూచు వరకు నిద్రింపను. మలహారురావు నా కపకారము చేసి నాడు. దేశమును మంగలములో పెట్టి మాడ్చివేయ వలెను. నీవు నీ రెండువేలమంది భిల్లులతో వెంటనే దోపిడి యారంభింపుము. నీకు నాదీవెన లిచ్చెదను. ప్రజ లకు నాపై విశ్వాసము మెండు. నీవు జంకకు.

—గండాభిల్లీ పలుకుల నాలకించి సంతోషముతో రంకె వేసి, "పని నెరవేరునేని కాళికి నూరు దున్నలను బలియిచ్చె దను, దొరకినచో మనుష్యునే యొసగెదను. నే నిందులకు సమ్మతించితిని—" అనెను.

దుండిరావు ఋషికి నమస్కరించి, భిల్లునొద్ద సెలవు గై కొననుండ, నొక మనుష్యుడు పదునేడు వత్సరముల బాలు

నొకని వెంట బెట్టుకొని వచ్చెను. ఈ వచ్చిన మనుష్యుడే తాంతియా భిల్లు. అతడు రూపమున గండాభిల్లుకంటె భయంకరముగ నుండెను. బాలుడు గడగడ వడకుచుండ, అతనిని కాళికి బలియిమ్మని ఋషి తాంతియా నాదేశించినాడు. దానితో నా బాలుడు మూర్ఛిల్లెను. తాంతియాయును, గండాయును ఆ బాలుని మోసుకొనిపోయిరి.

ఇదియైన కొన్ని దినములకే దేశమునం దక్కడక్కడ బందిపోటులు, కన్నపు దొంగతనములు దారి దోపిడులు నారంభమై దేశమంతయు అట్టుడికిన ట్టుడుకసాగెను. తన అసహాయ స్థితిని, అరాచకమును చూచి విసిగి చేయునది లేక యహల్య మంత్రులకు లోబడుట యుచితమని యనుకొనవచ్చినది. ఈ విషయములకు కమల మరణవార్తయు, రఘునాథరావు దండయాత్ర వార్తయును తోడైనవి. రాధాకాంతుడును, శ్యామసుందరుడును మాత్రము ఆమెకు ధైర్యము చెప్పుచు, ప్రోత్సహించుచుండిరి.

* * * *

అది భయంకర వింధ్యాటవి. సూర్యోదయ సమయము. భిల్లుల కోలాహల మమితముగ నుండినది. ఒక వృక్షమునకు బాలకు నొకనిని బంధించినారు. అతని యొడలెల్ల జేగురు గంధము పూసినారు. మొగమున నెత్తుని కుంకుమబొట్టు పెట్టినారు. అప్పుడే నీట ముంచబడిన యతని తలనుండి నీరుజార, వికచారవిందముల బోలు కన్నులనుండి బాష్పము లొలుక, నా

బాలకుడు విలపించుచుండ, వానిని కాళికి బలిగావింప నున్నారు కిరాతులు. భిల్లులు సింహనాదములు సేయ, భిల్లాంగనలు చప్పట్లు చరువ, కులమున పెద్దయగు భిల్లుడు కత్తినెత్తి వ్రేయ నుంకించినాడు. అంతలో "మరాటీదండు, మరాటీదండు"-అను అరపులు వినవచ్చినవి. హఠాత్తుగా రాధాకాంతరావును, శ్యామ సుందరదత్తును వీరిపై బడిరి. తుపాకులు మొదలగు నాగరక సాధనములు గల మరాటుల దెబ్బకు భిల్లులు చెదరిపోక తప్పి నదికాదు. వీరశిఖామణియగు రాధాకాంతునకు, పాపము, వీపుపై నొక గాయము తగిలినది. భిల్లనాయకుడగు గండా భిల్లుడు శ్యామసుందరుని చేజిక్కినాడు. వృద్ధుడగు రాధాకాంతు నకు దగిలిన గాయ మపాయకరమైన దగుటచే నతనిని ముందుగా ఇందూరు నగరమునకు ఒక బండిమీద పంపించి, శ్యామసుందరుడు భిల్లుని పట్టుకొని నెమ్మదిగా పోవుచుండెను. ఇతర భిల్లులు లాగుకొని పోవుటచే బలిపశువగు బాలునకు మాత్రము భిల్లులచెర తప్పలేదు. శ్యామసుందరుడు గండాభిల్లుని తోడను, నలుగురు సేవకులతోడను పయనించుచు, రెండు దిన ములలో ఋషియున్న కుటీరమును చేరినాడు. సాయంకాల మైనందున నత డట విశ్రమింపదలచినాడు. గండాభిల్లుని కుటీర ములోనుంచి, కావలికై సేవకులను నియోగించి, తాను వెలు పల నొక మంచముపై బండుకొన్నాడు దత్తు. గండాభిల్లు నచ్చటనే తర్వాతిదిన ముదయము ఉరితీయవలెనని రాణిగారి నుండి యొక లేఖ వచ్చినది. అలసియున్న దత్తు మైమరచి నిద్రించినాడు.

★ ★ ★ ★

శ్యామసుందరుడు లేచి చూచునప్పటికి రమారమి జాము ప్రొద్దుండెను. గండాభిల్లుని తా నురిదీయవలసి యున్నది కనుక ఆ విషయమే ఆలోచింప సాగినా డతడు. దారుణకార్యమైనను చేయక తప్పదుకదా యనుకొనుచు ఋషి కుటీరపు గుమ్మమును చేరునప్పటికి, అట కన్ను చెదరునట్లు రక్తము మడుగై యుండినది. నలుదెసలు పరికింప, అట, తన సేవకులలో నొకని శిర మొకవైపునను మొండె మొకవైపునను బడి యుండుట కన్పడినది. తత్తరపాటుతో లోనికేగగా అట గండాభిల్లుడు లేడు. తక్కిన మూవురు సేవకులును లేరు. కాలు చేతులు కట్టివేయ బడియున్న ఋషి మాత్ర మొకమూల బడి యుండెను. దత్తు అతని కట్టు విప్పినాడు. అప్పుడు సేదదీరిన ఋషి యిట్లు మాటాడినాడు.

ఋషి : నాయనా ! నీవెట్టి పాపపుగడియలో బయలుదేరితివో ! నీవు కుటీరము వెడలిన తోడనే నలువురు భిల్లులు మాపై బడిరి. తరువాత నేమి చెప్పుదును, తండ్రీ! విశ్వాసముగల, శూరశిఖామణి యగు నీసేవకుడు వారిచేబడి హతుడైనాడు. నాగతి యిట్లున్నది. గండాభిల్లు పారిపోయినాడు. మిగిలిన ముప్పురు సేవకులును నిద్దురలేచి భిల్లుడు లేకుండుట గాంచి పారిపోయినారు. నా కుటీరమున నీపని జరిగింది. ప్రజ లేమనుకొందురు !

దత్తు : (విషాదముతో) ఏ మొగము పెట్టుకొని ఇంక నిందూరు పోవుదును; నన్ను నమ్మిన రాణి నెట్లు చూతును? నన్ను మహాప్రయోజకు డనుకొని వారు పంపినారు. చేతు

లార దొంగను వదలుకొంటిని. ఈ కుట్ర దినములలో నన్ను నమ్మువారెవరు? ఐనను, రాణికి నాతప్పు విన్న వించెదను. మరణించిన నా సేవకుని కంటె తక్కువ వాడనైతినిగదా! ఛీ! (ఇంతలో పరుగెత్తి పోయిన సేవకులు ముగ్వురును దీనముఖులై యతని యెదుట నిలిచిరి.) దొంగ యేమైనాడురా?

సేవకులు: (ఏడ్చుచు పాదములపైబడి) స్వామీ! ఏమని చెప్ప గలము! మేము నిద్ర లేచునప్పటికే అన్ని పనులును నైపోయినవి. అటనిట వెదకితిమిగాని వృథాశ్రమమైనది.

వారి భయము పోగొట్టి, ఋషియొద్ద సెలవుగైకొని పయనమైనాడు దత్తు. రాధాకాంతునకు కూడ తన మూలమున అప్రతిష్ఠకలుగునను బాధచే కుందుచు, త్రోవలో మాహురా నగరమున తన సోదరినైనను జూడక ఆనాటి మధ్యాహ్నము రెండున్నర జాములకు ఇందూరునగరముచేరి, మున్ముందు రాణిని దర్శించుటకై కోటకరిగెను. ఆతనిం జూచుటతోడనే యామె యాత్రముతో "గండాభిల్లు నురిదీసినావుకదా! చచ్చు నప్పుడు వాడేమన్నాడు! భిల్లులకు బుద్ధిచెప్పితివా!" అని యడిగినది. అతడేమియును పలుకక నిలిచియుండ నామె మరల ప్రశ్నించినది.

దత్తు: (చేతులు జోడించి) అమ్మా! ఏమనిచెప్పుదును? గండా భిల్లు పారిపోయినాడు.

అహ: (ఆజ్యముపోసిన యగ్నివలె భగ్గునమండిపడి) నీవు ప్రాణములతోనుండగనే?

దత్తు : ఈవార్త నేలినవారికి విన్నవించుటకై జీవచ్ఛవమునై యున్నాను.

అహా : ద్రోహీ ! రాధాకాంతరావు కష్టపడి పట్టుకొన్న దొంగలను నీవు జస్వంతరావు మున్నగువారితోకూడి విడిచిపుచ్చితివా ! నాయెదుటికి వచ్చుటకు నీకెంత ధైర్యము?

దత్తు : అమ్మా ! పొరపాటు జరిగినది.

అహా : ఛీ ! సిగ్గులేక, వంకలు చెప్పుకొనెదవేల ? చేజిక్కినయపరాధిని చేతులార విడుచుట పొరపాటెట్లగును ? నా యెదుటినుండిపో ! నీముఖము చూడజాలను. ఓరీ, ఎవరురా ! వీనిచేతులు విరిచికట్టి కొనిపొండు. రాధాకాంతుని బిలుచుకొనిరండు.

ఇట్లు మెత్తని లేడిపై దుముక నుంకించు ఆడుసింగమువలె అహల్యాబాయి రూక్షవచనములతో శ్యామసుందరుని నొప్పించి, వాని నొక భటుని యధీనముచేసి, రాధాకాంతుని యాగమనమును నిరీక్షించుచుండెను. దత్తుతోవచ్చిన ముప్వురు సేవకులలో నొకడు రాధాకాంతుని గృహమునకు జని జరిగిన వృత్తాంతమంతయు నెరింగించెను. తాను నాటిన మొక్క నిర్మూలమగు సమయము వచ్చినదని రాధాకాంతుడు విచారించినాడు. ఇంతలో రాజసేవకులు రాగా నతడు వారివెంటనరిగి, కోపముతో మండిపడుచున్న యహల్యను గాంచెను.

అహా : ఏమయ్యా ! నీవు మా మేకలమందలో పెద్దపులిని తెచ్చి పెట్టినావు ! సుగుణమణియంటివి. రాజభక్తికి పెట్టిన

పేరంటివి. ఏవీ ఆ గుణములు! దొంగను చల్లగా పంపి నాడు నీదత్తు.

రాధా : అమ్మా! జరిగినసంగతియేమో విచారింపవలెను. అంత వరకు నతని యుద్దేశ మిదియని చెప్పజాలము.

అహ : నీకింత పక్షపాత మతనియం దుండుటచేతనే యింత మునిగినది. అట్టి పాపిని విడువరాదు. అతనికి మరణ దండన విధింపవలెను.

రాధా : అమ్మా! బాలుని యందు దయచూప వలెనని నా ప్రార్థన.

అహ : అహ్హా! ఏమి దయ! రాజద్రోహిపై దయ! వీనితో నింకెందరు ద్రోహులున్నారో? గోమోజీ విచారించును గాక!

అని రాణి కోపముతో నటనుండి నిర్గమించినది. రాధాకాంతుడు దుఃఖముతో తలవంచుకొని యింటికి మెల్లగా చేరుకొన్నాడు.

* * * *

గండాభిల్లు శత్రువులకు చిక్కినాడని విన్నది మొదలు కుట్రదారు లందరు గోమోజీ యింటిచుట్టును తిరుగజొచ్చిరి. భిల్లు తప్పించుకొని పోయిన వార్త చల్లగ చెవిని బడుటతో దౌలత్‌రా వపరిమితానందము నందినాడు. శ్యామసుందరుని వంటి బుద్ధిశాలియు, బలశాలియు తమ పక్షమునకు వచ్చునేని తమకు లాభము కలుగునని జస్వంతరావు ప్రముఖు లనుకొనిరి.

కారాగృహాధికారి తమలోనివాడే యగుటచే జస్వంతరావు రాత్రియందు రహస్యముగ చెరసాలకడ కరిగి జీవచ్ఛవమువలె పండుకొనియున్న దత్తును నిద్రలేపి యిట్లనెను.

జస్వం : శ్యామసుందరా! చపలచిత్తులగు ప్రభు పిశాచముల సేవించుట కంటె ముష్టి యెత్తుకొని బ్రతుకుట మేలు కదా! నిన్నుగూర్చి నాకు విచారమగుచున్నది.

దత్తు : నేనుచేసిన యపరాధమునకు దగిన శిక్ష ననుభవించు చున్నాను. ఇందు రాణిగారి లోపమేమియు లేదు.

జస్వం : నీ పిచ్చి యింకను వదలినట్లులేదు. ఒకమాట. రేపు నిన్ను కొత్వాలు గోమోజీ విచారణ చేయునుకదా! మాపక్షము వత్తువేని గోమోజీతో చెప్పి విడిపింప జేసెదను.

దత్తు : అయ్యా! నా ప్రాణము రాణిగారి విషయమున ధార పోయుదునని ప్రతిజ్ఞ చేసియున్నాను. కుట్ర వారిలో చేరి రాణిని క్షోభపెట్టి, కొలదికాలము సుఖపడుట కంటె, ఈ తుచ్ఛప్రాణమును విడుచుట మేలు.

జస్వం : (కోపముతోను, విసుగుతోను) దారుణపుచావు చావ వలసిన యోగము నీ నొసట వ్రాసియుండ, మంచిమాట యెట్లు విందువు? నీ కర్మ మంతే, చావుము—

అని యతడు చెరసాల విడిచిపోయెను.

ఆ రాత్రి దౌలతురావు గోమోజీని చూడబోయి రాజకీయ వ్యవహారముల ముచ్చటించుచు, నడుమ దత్తు విషయము నిట్లు ప్రస్తావించినాడు.

దౌల : జస్వంతరావు మాట మనము నమ్మజాలము. దోపిడి వలనుకాదట ! రాజపుత్రులు రాకూడదట ! నీతితో సాధింపవలెనట !

గోమో : అతనిని నేను నమ్మలేదు. రేపు, దత్తుని విచారింపవలెనట కదా !

దౌల : నీవు దత్తును కడతేర్చవలెనుసుమా ! అతడును, రాధాకాంతుడును చచ్చినగాని మనము గట్టెక్కము. కమల విషయమై నన్ను పీడించుచున్నది వారే. దత్తు నురిదీయింపవలెను.

గోమో : పిల్లలుగలవాడను. అన్యాయము చేయలేను.

దౌల : అయినక్లే యున్నది ! మనలో మన కీభేదము లున్నచో నెట్లు ?

గోమో : అన్యాయముగ చంపవచ్చునా, యని.

దౌల : సరే, నీ ఇష్టము. —నేను పోవుచున్నాను.

అని దౌలత్‌రావు విసుగుతో నటనుండి లేచిపోయిన తర్వాత గోమోజీరావు లోపల దాగియున్న యొక పురుషుని "భేతాళా, ఇక రావచ్చును"- అని పిలిచి తన ప్రక్కన గూర్చుండబెట్టుకొనెను. భేతాళసింగు రాజపుత్రుడు. ఇనుపకడ్డీలవంటి భుజములు, గుండ్రనితలయు, పచ్చని మొగమునకు నీలికాంతుల నొసంగు కోరమీసములును, వాని యాకారమును భయంకరముగ జేయుచున్నవి.

గోమో : సైన్యము లీపాటికి నింబపురము వచ్చియుండునా ?

భేతా : ఇంకను వచ్చియుండవు. ఈ నడుమ మా రాణావారికి దేహామున ఇంచుక అస్వస్థముగ నున్నది. అందుచే నాలస్యమయినది.

గోమో : శివనానా తప్పక పారిపోవును. అతని దగ్గర విశ్వాసమే కాని బలము లేదు. మీరు తుక్కాజీ హోల్కారునకు మాత్రమే జడియవలెను.

భేతా : అతడు నింబపురము మీదికి రాకుండ మీరు జాగ్రత్త పెట్టవలయును.

గోమో : సరే ; నాకు వేరే పనియున్నది. నీవిక పొమ్ము. నా సొమ్ము మరచిపోవద్దు.

అప్పుడు భేతాళసింగు వీధి యరుగుపై నిద్రించుచుండిన తన అనుచరుడగు భైరవసింగును వెంటబెట్టుకొని తన దారిని బోయెను. ఇంతలో వామనభట్టు వచ్చి తలుపు త్రోసెను. కొత్వాలు వానివైపు చూడ నత డిట్లనియెను.

వామ : అయ్యా ! అతడేమియు నిచ్చునట్టి స్థితిలో లేడు. వానికి బంధువులు లేరట !

గోమో : లేకేమి ? మాహులాపురములో నతని బావ యున్నాడట కదా ! అత డీకున్నచో దత్తు ప్రాణరక్షణకై రాఘాకాంతుడే లంచమీయగలడు. కాని అతనిని నమ్మరాదు.

వామ : నేను సాధ్యమైనంత ప్రయత్నము చేసి మీకు రెండువందలైనను ఇప్పించెదను. లంచము లేని పని చేయనని మీ ప్రతినకదా !

గోమో : కార్యము చెడకూడదు, పో.

వామనుడేగిన తర్వాత గోమోజీ పడుకపై నడుము వాల్చినాడు. గోమోజీ ప్రొద్దుననే రాణికడకేగ నామెయు నతనియందు విశ్వాసముగలదగుటచే నాదరముతో జూచినది. అప్పుడు వారిట్లు మాట్లాడినారు.

గోమో : అమ్మా! రాజ్య మల్లకల్లోలముగ నుండుటచే నాకు నిద్రపట్టుట లేదు. జస్వంతరావు ప్రేరణచే రఘునాథ రావు మనపై వచ్చుచున్నాడుట.

అహ : ఏమీ! వచ్చుచున్నాడా? నీ కెవరు చెప్పిరి? నిజమని తోచదు.

గోమో : అయ్యయ్యో! మీరు మాయమర్మము లెరుగరు. పీష్వామాధవరావుగారు పినతండ్రిని, తగుబలమిచ్చి పంపినారు. తక్షణమే తుక్కాజీని వారిపై కంపవలెను.

అహ : తుక్కాజీని కాదు. రాధాకాంతు నంపెదను. ఈవేళ నీవు దత్తుపై వచ్చిన యభియోగమును విచారించి న్యాయమైన తీర్పు చెప్పుము.

గోమో : రాధాకాంతుడు ముసలివాడు. తుక్కాజీని బంపుట యుచితము.

అహ : ఎవరైననేమి? విశ్వాసముతో బనిచేయుటయేముఖ్యము. నీవింక పోవచ్చును.

అన గోమోజీ నిష్క్రమించెను. రాధాకాంతుని బిలిపించి, తగుసైన్యముతో తక్షణమే పూనానగరమునుండి వచ్చుచున్న రఘునాథరావున కెదురుగజని వానిని తోడితెమ్మని రాణి యాదేశించినది. దత్తు విచారణ సమయమున పౌరుగూరికి

హోవలసి వచ్చినందుకును, దత్తుకు సహాయము చేయలేక పోయి నందుకును రాధాకాంతుడు మిక్కిలి చింతించియు, పోక తప్పదు గనుక పురి వెడలినాడు.

★ ★ ★ ★

రాణిని దర్శించి వచ్చిన తర్వాత గోమోజీరావు తన కచ్చేరికి పోయెను. అతడు పీఠ మలంకరించినతోడనే నేరములు చేసినవారు క్రమక్రమముగ నచటికి కొనిరాబడిరి. తనకు మరణము తప్పదని దత్తు అనుకొనుచుండెను. రాధాకాంతుని భార్యయగు రోహిణీబాయి రాణికడ నీ ప్రస్తావన దెచ్చినది కాని ఫలితము లేకపోయినది. దత్తుతో నుండిన ముగ్గురు సేవకులు సాక్ష్యము నిమిత్తము కొత్వాలుచే రప్పింపబడిరి. ఋషి కుటీరములోనుండి దొంగ పలాయన మందుటచే, ఋషికిని రావలెనను వర్తమానమంపిరి. విచారణ మారంభమైనది. "నేరమును చేసితివా ?" అని కొత్వాలు దత్తు నడిగెను. "బుద్ధి పూర్వకముగ జేయలే"దని దత్తు బదులుపలికెను. సేవకుడొక డిట్లు సాక్ష్యమిచ్చెను : "నేనెరిగిన వరకు నిజము మనవిచేసెదను. ఋషి కుటీరములో మేమందరముండగ, దత్తుగారు గండాభిల్లును తన వెంట తీసికొని ఎక్కడికోపోయిరి. అది ప్రమాద కారణమని మేము వారించినను ప్రయోజనము లేకపోగా, మేము రహస్యముగ వారిని వెంబడించితిమి. నాలుగువందల రూపాయ లను మాటలు వినబడినవి. తర్వాత కొంతసేపటికి దొంగ పారిపోయి నాడని యాయనయే మాకు చెప్పెను." ఇట్లే తక్కిన సేవకు

లును సాక్ష్యమిచ్చిరి. అంతలో పల్లకిలో కూర్చుండి ఋషి యరుదెంచుటయు, ఎల్లరు లేచి యాతనికి నమస్కరించుటయు జరిగినవి. "నారాయణ నారాయణ" యనుచు నతడొక యున్నతాసనముపై కూరుచుండి యిట్లు చెప్పెను. "భగవంతుని మోము చూచి చెప్పెదను. శ్యామసుందర దత్తు దొంగను పొరపాటున విడిచెనో, బుద్ధిపూర్వకముగ విడిచెనో చెప్పలేను. అతని రాజభక్తిని నేను ఎక్కువగ నమ్మజాలను. ఇతడు అసత్పురుషుడని నా అభిప్రాయము."

సాక్షి విచారణము అయినది. ఇంతలో నొక సేవకుడు జనుల నొత్తిగించుకొని వచ్చి కొత్వాలు చేతికొక లేఖనిచ్చెను. అది చూచి గోమోజీ యిట్లనెను. "చూచితిరా, వింత! రాధాకాంతుడు జాబు వ్రాసినాడు. దత్తును విడిపింపవలెనట. నాకు లంచము నిచ్చుటకైనను సిద్ధుడేనట!" - ప్రజలెల్లరు నది విని యాకులపడిరి. దత్తుకు మరణదండన విధింపబడినది. రాణి యాశిక్ష నామోదించినది.

* * * *

"అమ్మయ్యా! నాప్రాణ మిప్పటికి కుదుటబడినది. సీతా! నేను అదృష్టవంతురాలిని సుమా!-" అని ముక్తాబాయి పలుక సీత యాత్రముతో, "అమ్మా, ఏమది? సంగతి చెప్పు"డని వేగిర పెట్టినది. ఆమె యిట్లు చెప్ప మొదలిడినది - "జస్వంతరావుగారు మరల మా యమ్మతో చేరినారే! నిన్నరాత్రి మాయమ్మకొక వ్రాలులేని యుత్తరము వచ్చినది. దానిని చదువుకొని యామె

జస్వంతరావుగారింటిపై దాడిచేసినది. తలుపులు తెరచి చూచిరి కదా, జస్వంతరావుగారు దౌలత్‌రావు హరిహర పాండ్యాజీ లతో దాదాపు నూర్వురు మాయమ్మపై కుట్రలు పన్నుటకు చేరి యుండిరి. దౌలత్‌రావు మొదలగువారు పలాయితులైరి. జస్వంతరావుగారికి మాయమ్మ అభయమొసగినది. ఆయన మా యమ్మతో సఖ్యము కుదుర్చుకొన్నారు. ఒడలు జలదరించు చున్నదే సీతా!" ఈ పలుకులు విన్న సీత సంతోషించుచు, ఆ సంతోష సమయముననే శ్యామసుందరుని ప్రస్తావనదెచ్చి, తల్లితో చెప్పి యెట్లైన నీతని ప్రాణముల రక్షింపుమని ప్రార్థించి నది. భయపడకుమని చెప్పి ముక్త లోని కరిగినది.

అహల్యాబాయి శివనానా, తుక్కాజీ హోల్కారు, జస్వంతరావులతో నాలోచించుచుండినది. ఆమె శివనానాను చూచి "ఓయీ, రాజపుత్రులు నింబపురముపై నెంతటి సైన్య ముతో వచ్చినారు ? మనమెంత సైన్యమును తీసికొని పోవలెను" అని అడిగెను.

శివనానా : పదివేలుండు నని నేను తలచినాను. రాజపుత్రులు శౌర్యవంతులు. వారిని గెలుచుట కష్టముకాబట్టి మన సైన్యముగూడ నంతయుండవలెను. తుక్కాజీ హోల్కా రును, నన్నును ముందుగ బంపుడు, మీరు సైన్యముతో వెనుక రావచ్చును.

రాణి : భేష్ ! ఉన్నవారిలో నీవును, తుక్కాజీయునుగాక విశ్వసనీయు లెవరున్నారు! రాధాకాంతరావును నేనిది వరదాకా నమ్మియుంటిని. కాని, శ్యామసుందరదత్తు

నరిదీయించుచున్నానను కోపముతో నతడు రఘునాథ రావుతో చేరినాడట !

తుక్కాజీ : అమ్మా ! రాధాకాంతు డట్టివాడని నేను నమ్మను. ఇది యబద్ధమేమోయని మనవి యొనర్చెదను.

రాణి : ఈ చీటీని చదువుము.

తుక్కాజీ : (చదువును) "రఘునాథరావు కడనుండి రాధా కాంతునకు - నన్ను మొదట జస్వంతరావు మీదేశముపై దాడిరమ్మని పిలిచినాడు. అతడు చలచిత్తుడై నందున నమ్మనైతిని. నీవు నాతో చేర నిశ్చయించితివికాన రేపు వచ్చి నిన్ను కలిసెదను. మా పీష్వాయొద్ద నీకుద్యోగ మిప్పించెదను." (కాగితము మడిచి) అంతయు నయో మఁయముగ నున్నది తల్లీ !

జస్వం : (తలవంచి) అమ్మా! ఈ ద్రోహమునకు మార్గప్రదర్శకు డను నేనే. ఇక మీయాజ్ఞ నతిక్రమింపనని ప్రమాణము చేయుదును.

రాణి : (ఆ మాటలకు సంతసించి) ఓయీ, మన రాష్ట్రమున భిల్లులబాధ యెక్కువగ నున్నది. అదియుకాక, రెండు దినముల ముందర శాయాజీ హోల్కారను పేరుతో నొక క్రొత్తరాజు బయలుదేరి పట్టాభిషేకము చేసికొన్నా డట. మాకు సన్నిహిత జ్ఞాతియని చెప్పికొనుచు వాడు ప్రజలను పెడదారి బట్టించుచున్నాడు. భిల్లులు వానితో చేరినారు. పశూరుడైనను భిల్లులను అణచి, గండాభిల్లు మున్నగువారిని పట్టుకొని నా కప్పగించి, దేశమున

శాంతి నెలకొల్పెనేని వానికి నా కుమార్తె నిచ్చెదను. ఆ కార్యమును చేయగలవాడు పళ్ళెరములోని యీ తాంబూలమును గ్రహింపవచ్చును.

జస్వంతరావు తాంబూల మందికొన్నాడు. శివనానాయును, తుక్కాజియును సైన్యముతో నింబపురమునకేగ నాజ్ఞాపింపబడినారు. ఈమాటలు చాటునుండి వినుచున్న ముక్తాబాయి ముక్తవిచారయయి తల్లికడకేగినది. వికసిత వదనయైన ఆమెను చూచి తల్లి సంతసించినది. ఆ తరుణమున శ్యామసుందరుని విషయమై దీనముగ విన్నవించినది ముక్త. మరణశిక్ష తప్పించి యతనికి దేశాంతరవాసశిక్ష విధించినది రాణి. రెండు దినముల తర్వాత రాణి నింబపురముపై దండుతో నరిగినది.

* * * *

తుక్కాజీహోల్కారును, శివనానాయును సైన్యమును దీసికొని రాజపుత్రులచే నాక్రమింపబడిన నింబపురపు కోటను ముట్టడించిరి. ఉదయపుర రాణా, రాజపుత్రులకు నాయకుడై కోటలోనుండి మహారాష్ట్ర సేనలపై నగ్నివర్షము గురిపించుచుండెను. భేతాళసింగును, భైరవసింగును రహస్యవార్తల సేకరించుచుండిరి. రాజపుత్రులు నింబపురము నాక్రమించుటకు ముఖ్యకారకుడు గోమోజీరావేకనుక అతడెప్పటి వర్తమాన మప్పుడు భేతాళసింగున కెరుగజేయుచుండెను. రాజపుత్రులు నింబపురమున కరుదెంచిరే కాని గోమోజీకి డబ్బు మాత్రము ముట్టలేదు. అందుచే గోమోజీ తనకిష్టుడైన వామనబట్టు చేతికి

కొన్ని యుత్తరములు వ్రాసియిచ్చి యవి భేతాళసింగున కీవల సినదని నింబపురమున కతని నంపెను. జస్వంతుడు రాణితో చేరుటతో, గోమోజీని, భిల్లులను నమ్మిన నిక లాభము లేదని దౌలత్‌రావు నింబపురమున కరిగి రాణా నాశ్రయించెను. తుక్కాజీ బయలుదేరిన రెండు దినములకు, రాణి యహల్యా బాయి కొంత సేనతో నింబపురముపై జనుచు, మార్గమున నచ్చటచ్చట నిలుచుచు, ఆయా గ్రామముల ప్రజల కభయ మొస గుచు, పయనము చేయుచుండినది. చెరియొక పల్లకిలో సీతయు ముక్తయు రాణివెంట వచ్చుచు, అనాగరకులగు గ్రామస్థులను వింతగ చూచుచు వినోదించుచుండిరి. వనములలో ప్రయాణము చేయునపుడు నెమలి, లేడి మున్నగు జంతువులను చూచి ఆనం దించిరి. సైన్యమున విస్తారభాగము తుక్కాజీతో పంపబడుటచే అహల్య కొలది సైన్యమును వెంటబెట్టుకొని, గజాధిరూఢయై తాను సేనాగ్రభాగముననుండి, శత్రువు లొకవేళ పైబడిన స్త్రీల కపాయము కలుగకుండునట్లు సీతను, ముక్తను వెనుక రాజించి నది. ఇందూరు వెడలిన మూడవనాడు సాయంకాల మీ చిన్న సేన యొక యడవిలో, ముప్పురు మనుష్యు లొకమారు ప్రక్క ప్రక్కగా నడచిపోవుటకుకూడ చాలని యొక యిరుకుత్రోవను పట్టి పోవుచుండినది. రాణి యధిరోహించిన యేనుగు సుఖముగా నడచుటకు ఆ మార్గము చాలనందున, ఆ జంతువు మిక్కిలి కష్ట ముతో బయనము సేయుచుండెను. వెనుకవారు ముందుకు గాని, ముందువారు వెనుకకుగాని పోవుటకు వీలులేదు. అంద రును చీమలబారువలె నొకరివెనుక నొకరు నడుచుచు సాధ్య

మైనంత త్వరగా సమీప గ్రామముచేర యత్నించుచుండిరి. చీకటి దట్టమైనది. ఉరుములు, మెరుపులు నధికమైనవి. హోరు మని గాలి వీవదొడగినది. ఇంతలో ఆర్పులు, బొబ్బలు చెలరేగి నవి. గుంపులు గుంపులుగ భిల్లులాయుధపాణులై దండుపైబడిరి. బాలిక లిరువురును కేకలు వైచిరికాని, ముందున్నవారి కవి వినబడలేదు. సేనకుచెందిన సామగ్రియంతయు గండాభిల్లుని చేజిక్కినది. ఆ కన్నెల నగల నొలిచికొన్నాడు హరిహర పాండ్యుడు. వానిచేయి సోకగనే ఆ లతకూనలు మూర్ఛిల్లినవి. ఒక పల్లకిని భిల్లు లెత్తుకొని పోయిరి. రాణికి ఈ సంగతి తెలియ గనే వెనుదిరిగినది. ముక్తపోయినదేయని దుఃఖించు నామె, మిగిలియుండిన పల్లకిలోనున్న కన్యను లేపెను. సీత లేదేయని యాకన్యక పలవింప, సీతయే దొంగలపాలబడెనని తెలిసికొన్నది రాణి. సీతను వెదకింపవలసినదిగా జస్వంతున కాజ్ఞపంపి, ముక్తను తనయొద్ద గూర్చుండబెట్టుకొని పయనము సాగించినది. రాణి రాకనువిన్న శివనానా తుక్కాజీ లామె కెదురువచ్చి నింబపుర ప్రాంతమున ప్రత్యేకముగ వేయబడిన గుడారములో నామెను ప్రవేశపెట్టి, ఆమె రక్షణ కైదువందలమంది యోధుల నట నుంచిరి.

"అమ్మా, మేము వచ్చి నాలుగు దినములయినది. తుకాజీయు నేనును కడు జాగ్రత్తగ కోట ముట్టడించుచున్నాము. కోట తప్పక లోబడును. ఇచ్చట మీకు కావలియున్న సైనికులలో నేబదిమంది మహమ్మదీయులున్నారు. వీరు చాల విశ్వాస పాత్రులు. అందీ జమాన్‌ఖాన్ సాహసవిక్రమార్కుడు. రాజ

పుత్రులు వచ్చునప్పటి కీ శూరశిఖామణి యూరలేదు, కాని, ఉండినచో నింబపురమునకు ఇతరులు రావలసిన యవసరమేమియు నుండి యుండదు"—అని చెప్పి శివనానా ఒక తురుష్క వీరు నామెకు చూపెను. రాణియు సంతోషించెను.

మరునాటిరాత్రి గుడారములో రాణియు ముక్తయు కూర్చుండి సీతనుగూర్చి ముచ్చటించుచుండ, కావలికాచు జమానుఖానుని కంఠధ్వని వారికి వినవచ్చినది. అది యేమని సేవకు నొకని బిలిచి రాణియడుగ నతడు, "అమ్మా, నలుబది యేండ్ల స్త్రీ యొకతె తమ దర్శనమునకు రాగోరు చున్నది. యుద్ధ సమయమున పరులను రానీయరాదని జమానుఖా నామెను నిరోధించినాడు"- అని బదులు చెప్పెను. రాణి నవ్వి "స్త్రీలను రానిచ్చినచో ప్రమాద మేముండును? ఆమెను రాని"మ్మని యాజ్ఞ యిచ్చెను. అప్పుడు పొట్టిగ, లావుగ నున్న యొక స్త్రీ వచ్చి రాణి యెదుట నిలబడి, 'అమ్మా! నామొర ఆలకింపుడు. నా కుమారుని నిర్హేతుకముగ శివనానా చెరలో నుంచినాడు. నన్ను రక్షింపు'డని విలపించినది. శివనానా తప్పు చేయడని యెరిగియు అహల్య, "అమ్మా, నీ కుమారునకు గాని, నీకుగాని భయములేదు. ముట్టడి యగువరకు నీవు నా గుడారమున నుండుము"- అని ఆమె కథయ మొసగి ఆరాత్రి నిదురించినది.

* * * *

భిల్లులను శిక్షించుటకు ప్రతినబూనిన జస్వంతరావు కొంత సైన్యమును వెంటబెట్టుకొని భిల్లుల గూడెముపై బడి

వారిలో పలువురను చెరలో నుంచెను. ముఖ్యులగువారి నురి దీయించెను. అహోరాత్రములు నిద్రాహారములు విడిచి, ప్రాణములకు లక్ష్యము సేయక, ముక్తాబాయిపయిననే మనసు నిలిపి జస్వంతుడు భిల్లుల నణచుచుండెను. గండాభిల్లున్నచోటు మాత్ర మతని కెంతకును తెలియలేదు. కావున, దానిని తెలిసికొనుటకు విశేష ప్రయత్నము లొనర్పవలసి వచ్చినది. ఇది తెలిసి మరింత క్రుద్ధుడయిన గండాభిల్లు ఆజ్ఞతో, తాంతియాభిల్లు దేశమును నాశము చేయుచుండెను. జస్వంతుడు పట్టుదలతో భిల్లులను హతమార్చుచునే యుండెను.

అట నింబపురమున, దౌలత్‌రావు రసపుత్రులతో కలిసి అహల్యాబాయి నోడింపవలెనని యెంత ప్రయత్నము చేయుచున్నను, మహారాష్ట్రులే ఆ ముట్టడిలో పైచేయిగ నుండిరి. గోమోజీకి లంచము ముట్టనందున, అతనినుండి ఉదయపుర రాణావారికి సహాయము వచ్చుట నిలిచిపోయినది. దౌలత్‌రావు రాణాను దర్శించి శాయాజీ పక్షమున అహల్యాబాయికి సందేశమంపుట యుక్తమనియు, రసపుత్రులు శాయాజీతో కలిసిరని విన్నచో రాణి లొంగుననియు చెప్పియున్నాడు. అందులకై వామనభట్టు రాయబారిగ పంపబడినాడు. అహల్యాబాయి కడకు వామనభట్టరుదెంచి యిట్లనినాడు, "అమ్మా! శాయాజీ హోల్కారు మహారాజుగారు నన్ను తమయొద్ద కనిపినారు. ఇందూరు రాజ్యమున మీకు లేశమైన భాగము లేదని చెప్పినారు. మనోవృత్తిగ మీకు కొన్ని గ్రామములిత్తురు. మీరు రాజ్యము వదలవలెను. వదలకున్నచో శాయాజీ మహారాజు

గారు రసపుత్రులతో చేరెదరు. సత్వర ముత్తర మీవలెనని విన్న పము." ఈ మాటలు విని యహల్యా నవ్వి "మీ మహారాజుగా రెందున్నారు? వారు మా కగపడుదురా?" అని ప్రశ్నించినది. "వింధ్యపర్వతములలో నున్నా" రని ఆతడు జవాబు నొసగు నంతలో వెనుకనుండి వచ్చి జమానుఖాన్ వామనుని పట్టుకొని "అమ్మా! వీడు కుట్రలో చేరినవాడు. వీడిని చెఱలోనుంచిన మనకు కొన్ని అద్భుతవిషయములు తెలియగలవని వాని చేతు లకు సంకెళ్ళువేసెను. ఇంతలో భట్టుతో వచ్చిన రసపుత్రులు కత్తులుదూసిరి. కాని శీఘ్రమే మహమ్మదీయ క్రోధాగ్నికి శల భములైరి. ఈ వార్త విన్న దౌలత్‌రావు హృదయము క్రుంగి పోయినది.

* * * *

మరునాడుదయమున మంగళతూర్యారావములు సెలంగ నహల్యాబాయి మహోత్సాహపూరిత మానసయై కోటముట్టడి జరుపుచుండ, జమానుఖా నామెకు సలాము చేసి రాధాకాంత రావు వచ్చియున్నాడనియు, రాణి దర్శనము కోరుచున్నా డనియు, విన్నవించెను. రాధాకాంతునిపై అలుకవహించిన రాణి "ఓయీ! రాధాకాంతుని మొగము నేనింక చూడ జాలను. అతని విశ్వాసమును గూర్చి నాకిదివర కుండిన పిచ్చి నమ్మకము పోయినది. శ్యామసుందరదత్తును విడిచిపెట్టు మని గోమోజీరావుకు జాబు వ్రాయుటయు, రఘునాథరావుతో తానుచేరి నాపై కత్తివహించుటయు నా హృదయమున నాటి

నవి. అతనికి నాకడ నేమిపని ! రఘునాథునికడకే పొమ్మనుము" అని బదులుచెప్పి పంపినది.

మహారాష్ట్రులు లెక్కువ సాహస పరాక్రమములతో బోరుచుండిరి. రాణి యుత్సాహమునకు మితిలేదు. రాజపుత్రులకు తిండికే కరవైనది. కోటలో జలాధారములులేవు. కోట శిథిలస్థితికి రాజొచ్చినది, ఓటమి తప్పదని రాణాగారు నిశ్చయించుకొనిరి. తాను జయమునందినట్లే భావించినది అహల్య. రసపుత్రుల భయము తీరినది కనుక శాయాజీ హోల్కారు పని చక్కచేయవలెనని నిశ్చయించినది. వామనభట్టును బెదరించి వానినుండి శాయాజీ యునికిపట్టును కనుగొన్నది. జమాను ఖానునికి కొంత సైన్యమిచ్చి రాయబార మంపినది. జమాను ఖానుడును మూడురోజు లెడతెరపి లేకుండ ప్రయాణముచేసి, శాయాజీయున్న స్థానమును చేరినాడు. ఈ విషయము తెలిసికొన్న శాయాజీ సంతోషమునకు మితిలేదు. బేరము పెట్టినచో తనకు కొన్ని జాగీరులైనను దక్కునని యతని యాశ. శాయాజీ స్థితి చక్కగ నున్నచో, తాము సుఖముగ నుండ వచ్చునని భిల్లులు ఖానును గౌరవించిరి. శాయాజీయు, తాను తన పట్టాభిషేక కాలమున ధరించిన దుస్తులను దొడిగికొని తన గుడారములో ఠీవిగ ఆసీనుడై యుండెను. జమానుఖాను ప్రవేశించి, శాయాజీకి నమస్కారముచేసి, అర్ధాసనముపై నాసీనుడయ్యెను. గంశాభిల్లు గండ్రగొడ్డలిని బూని తన మహారాజు యొక్క వామభాగమున నిల్చెను. అప్పుడు ఖాను హోల్కారుతో, "స్వామీ! మీతో కొన్ని రహస్యములు మాటలాడ

వలెను. మీ భిల్లుల నావల కంపివేయవలెనని మనవి. మీ సందేహ నివృత్తికై నా సేవకులనుకూడ నావలకంపెదను" - అనెను.

సేవకులు వెడలిపోగా శాయాజీయు, ఖానును ఇట్లు మాటాడిరి.

జమాఖ : దేవా ! మీరు రాణిగారి విషయమున నేదో సదుపాయము చేయవలయును. ఆమెకు ముద్దులు మూటగట్టు నొక కుమార్తె కలదుకదా !

శాయా : రాణికి నేను రెండుమూడు జాగీరులుమాత్ర మిచ్చెదను. రాజ్యమంతయు నా కప్పగించి ఆమె యిందూరు నగరమును విడిచి పోవలెను.

జమాన్ : పాపము ! ఏదిక్కును లేని యాడుదానిని మీరింత శ్రమపెట్టుట యేమియు న్యాయముకాదు. ఈ షరతువలదు.

శాయా : ముక్తాబాయిని నాకిచ్చి వివాహము చేసినయెడల నేనహల్యను రాజ్యమునం దుండనిచ్చి యన్న వస్త్రముల నిచ్చి కాపాడెదను.

జమా : పోనీ, రాజ్యమంతయు మీకు వదలివేసినచో ఆమె కేమిచ్చెదరు ? మీతోడను, భిల్లులతోడను ఆమె యుద్ధము చేయజాలదు కదా !

శాయా : నెలకొక వేయిరూపాయల మనోవృత్తి యిచ్చెదను. అంతకుపైన వీలుకాదు.

జమా : ఆమె మిమ్ము పెంచుకొన్నచో మీరు దత్తమగుట కంగీకరించెదరా !

శాయా : ఆలోచింపవలెను. ఆమె తల్లియగుట నాకు శ్రేయము కాదు.

జమానుఖానుని మెత్తని పలుకులను జూచి యహల్యా తనకు జంకిన దనుకొని శాయాజీ గర్వించి నిర్లక్ష్యముగ బల్క నారంభించినాడు. "ఓయీ, నీ వాడినమాటలు మాకు మహానందమును గల్గించుచున్నవి. నీ భయభక్తులే నిన్నిట రక్షించినవి. ఎవరియొద్ద నెట్లు మాటాడవలయునో యెరుగుదువు. టక్కరివి" - అనినా డతడు. దీనితో ఖాను మండిపడి దిగ్గునలేచి, "నేను మీ పరాక్రమ మెరుగుదును. మీరు చెప్పవలెనా" - యనుచు శాయాజీ యొక్క రెండు భుజములను పట్టి గట్టిగ నొక్కి చేతిలోనున్న ఖడ్గమును లాగుకొనినాడు. శాయాజీ కేకలను విని గండాభిల్లు పరుగెత్తికొని వచ్చినాడు కాని, తురకల తుపాకుల దెబ్బకు వెనుదిరుగవలసి వచ్చినది. శాయాజీ రోదన మారంభించినాడు. ఏడ్చుచున్న శాయాజీ నొక ప్రాత పల్లకిలో బడవైచికొని తన పరివారముతో జమానుఖాను నింబపురమున కరిగినాడు. ఖానుని పరాక్రమమునుగూర్చి విన్న రాణి యతనికొక రత్నపు టుంగరమునిచ్చి బహూకరించినది. శాయాజీ నొక గుడారములోనుంచి సైనికులను కావలిబెట్టిరి.

★ ★ ★ ★

క్రొత్త హోల్కారుకు పట్టాభిషేక మగుటతో ప్రజలు తమకే కప్పములు కట్టుదురని దౌలత్‌రావు తలచియుండెను. కాని, కథ యడ్డము తిరిగినది. ఇతనివలన రాణాగారికగు సహాయమును శూన్యముగనే యుండెను. అనవసరశ్రమకు పాల్పడిన యుదయపుర రాణా మనస్సు వ్యాకులమంది యుండెను. అట్టి

రాణాగారి కడకు భేతాళసింగు వచ్చి యిట్లనినాడు, "దేవా! ఈ దౌలత్‌రావు వలన మనకు లాభమేమియు లేదు. ఇతనిని సాగనంపిన మంచిది. గోమోజీ మాటలువిని మిమ్మిటకు గొని వచ్చితిని. క్షమింపవలెను. నామనస్సు బాధపడుచున్నది. ఎట్లైనను, ఈరాత్రి యొక యద్భుత కార్యముచేసి తమకు జయము కలుగజేసెదను. అనుజ్ఞవేడెదను,"- అని రాణా చెవిలో నేదో రహస్యముచెప్పి యతని సమ్మతివడసి తన ప్రయత్నమున నరిగినాడు భేతాళుడు.

అది కటికరాత్రి. గుడారములో నహల్యాయు, నామె యభయమిచ్చిన యమునయు మేల్కొని మాటాడుచుండిరి.

అహ: యమునా! విచారింపకుము. ఇన్ని దినములు గడపితివి. ఈ రాత్రికూడ గడపుము, యుద్ధము ముగిసినదిగదా! శివనానాను పిలిచి నీ సుతుని విడిచిపెట్టుటకు అభ్యంతరమేమున్నదో యడిగెదను. కడుపుతీపిని నేనెరుగని దాననుకాను. ఏమైనను, నేటికి నీవు నిదురపో. నాకును నిదుర వచ్చుచున్నది.

యము: అమ్మా? నాకు నిద్రవచ్చునా? ఇన్ని దినములనుండి అన్నమనునది యెట్టిదో యెరుగను. నాకు పుత్రభిక్ష పెట్టవేని నేనింక బ్రతుకను.

అని విలపించినది యమున. పగలంతయు యుద్ధరంగమున దిరిగి యలసియుండిన యహల్యా తనకు తెలియకయే నిద్రాదేవతకు వశమైపోయినది. కోటలో దౌలత్‌రావున కా రాత్రి నిద్రరాలేదు. భార్యచేసిన హితోపదేశము వినకైతినేయని విచా

రించినాడు. రాజద్రోహము చేసినందుకు పశ్చాత్తాపముతో అవస్థ పడుచుండినాడు. ఇంతలో, వానికడకు భేతాళసింగువచ్చి, యేదో పనియున్నదని చెప్పి యతనిని కోట బురుజుపైకి గొని పోయినాడు. బురుజుపై భైరవసింగు కాచుకొని యుండెను. అహల్యాయి సైన్యము విడిసిన ప్రదేశముదిక్కు చూపి, ఆమె సైన్యము చెదిరిపోవుచున్నదిగదా, చూడుమన్నాడు దౌలత్‌రావుతో భేతాళుడు. దౌలత్‌రా వావంక చూచుచు "నిజమే నిజమే" యనునంతలో వెనుకనుండి యతని మెడపై భైరవునికత్తి గట్టిగ పడినది. మరుక్షణములో దౌలత్‌రావు శరీరము కందకములో తేలినది. గోమోజీ కీయవలసిన లంచపు సొమ్మును తా మపహరించినట్లు దౌలత్‌రావుకు తెలియుననెడి యనుమానముతో నా రాజపుత్రు లీ దారుణకార్య మొనర్చిరి. దౌలత్‌రావునకు, ద్రోహమునకు తగిన ప్రతిఫలము ముట్టినది.

ఎల్లెడల నిశ్శబ్దము. అహల్యాగదిలోనున్న యమున మాత్ర మటునిటు తిరుగుచున్నది. ఆమె నాలుగుమార్లు గుడారము వెనుక గుమ్మమునుదాటి, కొంతసే పావల నిల్చి యెవ్వరిని గానక లోనికి పోయినది. మరల నొకమారు వెలుపలికి పోబోవునంతలో నామె కాలి కేదో తగిలినది. ఎవడో మనుష్యుడు. అతనికొరకే ఆమె యెదురుచూచుచుండినది. అతడును, అతనితో వచ్చిన మరియొకడును తిన్నగ గుడారములోనికి వచ్చినారు. వీరిని దూరమునుండి కనిపెట్టుచుండిన ముస్లిము సైనికు డొకడు జోడు తుపాకులను గైకొని గుడారపు గుమ్మముకడ దాగుకొని, లోపల నేమి జరుగునో యని చూచుచుండెను.

లోనున్న వారిలో నొక డహాల్య కడకు పోయి యటనున్న దీపము నూదివేసినాడు. రెండవవాడు గుమ్మము కడ కావలి నిలిచినాడు. లోనుండిన వాడు రాణిగుండెపై తుపాకిని గురి పెట్టినాడు. అహల్యాబాయి కదలకుండ జాగ్రత్తగ బట్టుకొన దలచి యామెపై చేతులు వైచినది యమున. వెంటనే ధామ్మను ధ్వని వినబడినది. సైన్యమంతయు నిద్రనుండి మేల్కొనినది. శివ నానా తుకొజీలు కలవరపడి రాణి గుడారమునకు పరుగెత్తి నారు. గుడారములోనికి దీపము దెప్పించి చూడ నట యమున శవమును, ఆమె ప్రక్క నొక రాజపుత్రుని శవమును నుండినవి. ఈ కల్లోలమునకు జడిసి, వడకుచుండిన కుమార్తెపై చేయివైచి కొని నిశ్శబ్దముగ ముక్తయొద్ద గూర్చుండియుండినది అహల్య. అమెను చూచిన శివనానా "అమ్మా" అని ఆమె పాదములపై బడి రోదనము చేయసాగినాడు. సైనికులందర మనస్సులను శాంతింపజేయుటకై రాణి గుడారము వెలికి వచ్చి దివిటీల వెలుగులో నిలిచినది. తన ప్రాణముమ రక్షించిన రాజభక్తు డెవడో తెలియవలెనని రాణి యనుచుండ, తుకొజీవచ్చి "అమ్మా! ఈ మహోపకారముచేసిన వీరుడు మన జమాల్ ఖాన్"—అని తెలిపెను. ఇంతలో వారి యెదుట నొక క్రొత్త విగ్రహాము వచ్చి నిలిచినది. శ్యామసుందరు డతడు. "నీవును నిక్కడనే యున్నావా!"—అని పలుకరించినది రాణి. "అమ్మా! నిరపరాధియగు శ్యామసుందరుడే జమానుఖా"నని చెప్పి యతడు తన యేలికకు నమస్కరించినాడు. రాణి కన్నులు తడియైనవి. "నాయనా! నీ మూలమున శాయాజీ పట్టుబడి

నాడు. నీమూలమున నేను ప్రాణములతో నున్నాను. నిరప రాధివగు నిన్ను రాజ్యభ్రష్టుని గావింప నెంచిన నా పొరపా టును మన్నింపవలెను, తండ్రీ!" అని ఆమె గద్గదముగ బల్కి నది. దత్తు హృదయ ముప్పొంగినది. "అమ్మా! నే నెప్పుడును మీ సేవకుడనే" అన్నా డతడు. అందరును సంభ్రమముతో వీక్షించుచుండ నంతలో రాధాకాంతుడును నరుదెంచినాడు. అతనిం జూచి, "రఘునాథరా వేమైనా" డని ప్రశ్నించినది. తనపై రాణియే యవిశ్వాసమును వెలిబుచ్చినందుకు ముసలి రాధాకాంతుని శరీరము వడకిపోయినది. కన్నీరుగారగా నత డిట్లన్నాడు. "అమ్మా! ప్రతికక్షులోనివాడయిన గోమోజీరావు ఇట్లు చేసినాడు. నన్ను మీ సన్నిధినుండి సాగనంపు ప్రయత్న మది. రఘునాథరావు వచ్చుచున్నాడను నబద్ధము చెప్పి నన్ను దూరదేశమునకు పంపినాడు. నేనెంతకాలము కనిపెట్టుకొని యున్నను, రఘోబా రానేలేదు. ఆతడు దండెత్తి రాడనియు నాకు దెలిసినది."

ఈమాటలు విని రాణి యాశ్చర్యపడి, సరే, దత్తును వదలిపెట్టుమని గోమోజీకి నీవు లేఖ వ్రాసినదెందుకు? రఘు నాథుడు మీకు వ్రాసిన జాబు మాకు దొరికినది. వీనికేమి సమాధానము చెప్పెదవు"—అని యడిగి ఆ రెండు లేఖలను తెప్పించి యతనిచేతి కిచ్చినది. అవిచదివి, "అమ్మా! ఈవ్రాత వామనభట్టుది. నాదికాదు"—అన్నాడు రాధాకాంతుడు. వామనభట్టు నటకు దీసికొనిరాగా నతడావ్రాత తనదేయని యొప్పుకొన్నాడు. అతని జేబులో మరియొక యుత్తరమును

దొరకినది. "తనడబ్బు తనకీయవలెననియు, రాధాకాంతుని దూరదేశమునకు పంపి రాణాకు సహాయముచేసిన తనవంటి వానిని మోసము చేయరాదనియు"—గోమోజీచే భైరవ సింగునకు వ్రాయబడిన ఆయుత్తరములో నుండినది. కొత్వాలు చేసిన యాద్రోహమును గమనించి, యెల్లరు నసహ్యించు కొన్నారు. "అమ్మా! గోమోజీరావుగారితో తిరుగుచుండిన సకారామే భైరవుడు. బీదవాడను గనుక కూటికాసపడి వారితో జేరితిని. దయచూడవలె" నని వామనభట్టు మనవిచేసికొన్నాడు. ఇంతలో జాముకోడి కూసినది. అంతయు నుదయము విచా రింపవచ్చునని యానతిచ్చి రాణి వేరొక గుడారములోని కరిగి నది. ఈ విషయములన్నియు విన్న రాణాగారు తెల్లవారునప్ప టికి కోటవిడిచి పలాయనమైనారు. రాధాకాంతుడును, శ్యామ సుందరుడును నమితానందము నందిరని చెప్పవలయునా!

అట మాహూపురమున ఆనందాబాయి యొకనాడు దయ మున ప్రాచిపని చేసికొనుచుండగ గుమ్మములో నొక పల్లకివచ్చి నిలిచినది. దానివెంట నొకబాలుడును వచ్చినాడు. "ఎవరా" యని ఆలోచించునంతలో అందుండి యొక యువతి వెలికి వచ్చినది. ఆనందాబాయి యామెను కౌగలించుకొని, "కమలా! వచ్చితివాతల్లీ? నీవు బ్రతికియున్నావా! అమ్మా! దత్తును రాణి వెళ్ళగొట్టినదితల్లీ. వాడేమైనాడో!" అని కంటతడిబెట్టుకొనినది. శ్యామసుందరున కేభయమును లేదని చెప్పి, కమల యామె నూరార్చి, మార్గాయాసముచే డస్సిన తన తమ్మునకు అన్నము బెట్టించి, యానందముగ ఆనందకు ముచ్చటలు చెప్పజొచ్చినది.

ఆనం : నీతమ్ముడు నిన్నెచట గలిసికొన్నాడు ? నీవెందుండి వచ్చినావు ! ఏమిసంగతి ?

కమల : నానిమిత్తము మాయమ్మ మా తమ్ముని బంపగా, వాడు దురదృష్టవశమున భిల్లుల చేతబడినాడు. రెండు సారులు వానికి చావుదప్పినది. నేను రాణి దగ్గర సీత యను పేరున దాసిగనుండి, విధివైపరీత్యమున భిల్లులకు జిక్కితిని.

ఆనం : అయ్యో, పాపము ! ఆ దురాత్ముల బారినుండి యెట్లు తప్పించుకొన్నారు ? .

కమ : అక్కడ శాయాజీ హోల్కారు అను మూర్ఖు డొకడు నన్ను పెండ్లియాడ వలయునని యత్నింప మేము వానిని మోసముచేసి యిటకు వచ్చినాము. నన్ను పెండ్లి కొడబరచినచో విడిచెదనని నా తమ్మునికి చెప్పినాడు వాడు. నేను తమ్ముని వేషము వేసికొని విడుదలయైతిని. కావలియున్న సేవకుని మా తమ్ముడు కత్తికి బలిచేసి నాడు. ఎట్లో అవస్థపడి యిట కరుదెంచితిమి.

* * * *

నింబపుర వార్తలు విన్న గోమోజీ యూరువిడిచి యెటకో పరుగెత్తి పోయినాడు. జస్వంతునిధాటి కాగలేక భిల్ల సైన్యములన్నియు నశించినవి. హతశేషులు కొందరు బిచ్చమెత్తుకొని జీవింపసాగిరి. గండాభిల్లు మాత్రము దొరకలేదు. వానికై జస్వంతుడు చేయుచుండిన యన్వేషణ తీవ్రతరమై

నది. గోసాయీలను, బైరాగులను రప్పించి వారికి అడవులలో గండాభిల్లు అగపడెనేమోయని విచారింపసాగినాడు.

ఇట్లుండ మాహూనగరమున కొక మహాత్ముడు వచ్చెనని వార్త వచ్చినది. భిల్లుని సంగతి నతడేమైనను చెప్పగలడేమో యని జస్వంతు డటకరిగి యతనిని దర్శించెను. ఆ యోగి మౌన వ్రత మవలంబించి యుండుటచే మాటలాడుటకు వీలు చిక్క లేదు. ఆరాత్రి గంజాయి పీల్చుచుండు నా యోగికడకు వేరొక జోగివచ్చి కూర్చుండెను. రెండవవా డతనిని సంభాషణలోనికి దింపెను.

రెండ : మీ మౌనమును భంగపరచుచున్నానని నా మీద మీరు కోపపడవద్దు. గోసాయీలము. నేను క్రొత్తగ నీ యాశ్రమము స్వీకరించితిని. ఈ దినములలో బైరాగుల కును, గోసాయీలకును దేశసంచారము కష్టముగ నున్నది.

మొద : అవును. ఈ దేశమున మిక్కిలి కష్టము. జస్వంతరావు సన్యాసులను గండాభిల్లుని విషయమై ప్రశ్నించి బాధ పెట్టుచున్నాడు. ఏదో చెప్పక తప్పదు కదా !

రెండ : నన్నును ఆ విషయమై యాతడడిగినాడు. నే నేమియు దెలియదంటిని. స్వామీ! మీరు చాలదేశములు తిరిగినారు కదా ! గండాభిల్లు నెక్కడైనను చూచి యుంటిరా !

మొద : లేదు. అతని విషయ మీనగర సమీపముననున్న ఋషికి తెలియునందురు.

రెండ: అవును. ఆ ఋషియే వాని పక్షమున లేకున్నచో భిల్లుడు ఋషికుటీరమునుండి యెట్లు పారిపోగలడు?

మొద: అయ్యో! మనకెందుకు? గోడలకు చెవులుండును. ఈ సంగతి పైకి పొక్కినచో జస్వంతుడు మనలను బాధ పెట్టును. వానితో సంబంధము పాముతో చెలగాటము వంటిది.

అని పలికి యప్పటికి రాత్రియతిక్రమించుటచే మొదటి వాడు గాఢముగనిద్రపోయెను. రెండవవాడు నిద్రపోక, మొదటి వానిని బాగుగ పరీక్షించి చూచి, వానికడ నున్న సంచిని తన చంకకు తగిలించుకొని మెల్లగ లేచిపోయెను. ఆ సంచిలోనున్న సరకులను తీసిచూడ నందొక యుంగర ముండినది. దానినతడు కన్నుల కద్దుకొని ముద్దిడుకొన్నాడు. కొంతసేపటికి జస్వంత రావు భటులతో నరుదెంచి, మొదటి సన్యాసిని నిద్రలేపి, రాణి గారు పిలుచుచున్నారని చెప్పి, యతనిని పల్లకీలోనుంచి రాణి గారి కడకు ఇందూరు నగరమునకు తీసికొని పోయెను.

* * * *

నింబపురమును స్వాధీనముచేసికొని, విజయోత్సాహ ముతో నహల్య నిజరాజధానికి వచ్చినది. ఆరాత్రికే మురళీధర దాసును, ఆనందబాయియును తనవెంటరాగా సోదరసమేతయై సీత రాధాకాంతుని యింటికి చేరినది. రాధాకాంతుడు సంతోష ముతో వారి నాదరించినాడు. మధ్యాహ్నము రోహిణీ బాయితో కలిసి యానందయు, సీతయు రాణి దర్శనమున

కరిగిరి. వీరిని చూడగనే ముక్త పరుగునవచ్చి సీతను గౌగలించుకొని. "ఏమే, నీవింతకాలము నన్నువదలి యెట్లుంటివే? నాకు నోటి కన్నమైనను పోవుటలేదే, సీతా! నేనెంత యదృష్టవంతురాలినే," యనుచు వారలనందరను తల్లికడకు పిలుచుకొని పోయినది.

అహల్య : అమ్మయ్య? సీతచిక్కినది. అన్నిపనులును నింతటితో పూర్తియైనవి. జస్వంతరావు లోబడినాడు; రాజపుత్రులు పరాజితులైరి; దౌలత్‌రావు వారిచేతనే చెండాడబడినాడు. గోమోజీ పీడ వదలినది. శాయాజీ దొరికినాడు. దేశము ఇక శాంతిగనవచ్చును.

ముక్త : ఇన్నిటిలో, సీత దొరకుటయేకదా అమ్మా, ముఖ్యము.

అహ : కాని, గండాభిల్లు చిక్కలేదు, ఎప్పటికైన పట్టుబడక పోడు. ఏది యేమైనను, కమలను మాత్రము రక్షింపలేక పోతిని. ఆ విషయము నా హృదయమున శల్యమై యున్నది.

రోహి : అమ్మా! విచారపడ నవసరములేదు. ఈ సీతయే కమల. దౌలత్‌రావు బారినుండి తప్పించుటకై మావారు దాసిగ మీ కప్పగించిరి.

అహ : (సంతోషాశ్చర్యములతో) బ్రతికియున్నదా! ఆమె శవమునుకూడ దహనము చేసినారని వింటినే!

రోహిణి : అమ్మా! ఆ దినముననే యొక స్త్రీ మరదలితో వివాదమాడి తోటలోని నూతిలోబడి చచ్చినది. ఆమె శవమును కమల శవమని భ్రమించి దాని నా రాత్రే

కాల్చివేయించినాడు దౌలత్‌రావు. చచ్చిపోయిన ఆ స్త్రీ బంధువులు తమ కేమి మాటవచ్చునోయని నోరు మూసికొనినారు.

అహా : చాల అద్భుతముగ నున్నది. పాపము. ఈ చిన్న వయసు ననే భర్తృ హీనవైతివేయని, నేడు పరామర్శ చేయ వలసి వచ్చినదికదా ! కమలా ! ఇన్నినాళ్లు నీవు నా యొద్దనే యున్నావు కాని, నే నెరుగనైతిని.

ఆనంద : అమ్మా ! నామనవి చేకొనవలెను. ఈమె భర్తృహీన కాదు; అవివాహితయగు కన్యక.

అహల్యా : (కోపముతో) అబద్ధములను గట్టిపెట్టి నిజము బల్కుడు.

రోహి : అమ్మా ! ఆగ్రహింపకుడు. ఆ విషయ మామె నడుగుట మంచిది.

అహా : కమలా : ఏమందువు ?

కమ : తల్లీ ! నా చరిత్ర నాలకించి న్యాయమైనరీతి నన్నాదరింపగోరెదను. మా తండ్రిగారి మరణానంతరము ధనాశతో మాతల్లి హరిహర పాండ్యు డను బ్రాహ్మణుని ప్రేరణతో నన్ను వృద్ధుడగు రాణోజీవల్కారున కీయ దలచినది. నేను వలదని యెంత యేడ్చినను వినువారు లేరైరి. ధనము గ్రహించి మాతల్లి నన్నా వృద్ధున కప్పగించినది. ఇందూరులో వివాహముచేసికొనవలెనని రాణోజీ నన్ను వెంటబెట్టికొని పోయినాడు. మార్గ మధ్యమున వృషభ హతుడైన విషయము మీకు తెలిసి

నదే. తల్లిని కాదనలేక వానివెంట వచ్చితినేకాని, నేను వివాహితను కాను. నేను కన్యను.

అహ : అట్లయిన, నీవు వైధవ్యమేల యనుభవించితివి ?

ఆనంద : అమ్మా! నేను చెప్పెదను. ఈమెయు, గాయము తగిలిన రాణోజీయు మా యింటికి వచ్చిన నాటిరాత్రి యామె స్థితియంతయు దెలిసికొంటిని. రాణోజీ బ్రతికి నచో అతనిని వివాహమాడుమనియు, బ్రతుకనిచో కన్యకనని చెప్పుకొన వలదనియు నేనే యామెకు సలహా నొసంగితిని. కన్యకయని తెలిసినచో దుర్మార్గుడగు దౌలత్‌రావు ఈమెను విడువడని నా భయము. కావున, ఆమె భర్తృవిహీనవలె ప్రవర్తింపక తప్పినది కాదు.

ఆ మాటలువిని యహల్యయు, ముక్తయు బొందిన యానందము వర్ణింప నలవికానిది. అందాలబరిణయగు నాకన్య కెన్ని కష్టములు కలిగినవి! ఆమెకు మంచి సంబంధము చూచి పెండ్లి చేయవలె ననుకొన్నది రాణి. శ్యామసుందరుని విడుదలకై ప్రయత్నించిన కమల హృదయము నవగతము చేసుకొన్న రాణి, ఆతని విషయమై యానందను ప్రశ్నించినది. ఆనందయు, రోహిణియు కమలా శ్యామసుందరుల వివాహమున కంగీకరించిరి. కమలను ముక్తాబాయి నగరులోనే యుండ గోరినందున, తక్కినవా రానాటికి తమ గృహముల కరిగిరి.

* * * *

బైరాగి దగ్గర శ్యామసుందరునుంచి, జస్వంతరావు సుట్టమునెక్కి తగు పరివారముతో ఋషి కుటీరమున కేగెను. రాత్రి యొక జాముచేళకు, తానొక్కడే యేగి రాణి దర్శనముచేసి, భిల్లుల విషయమెరిగిన బైరాగిని విచారణ చేయవలెనని చెప్పి గృహమున కరగినాడు జస్వంతుడు.

సూర్యోదయము కాగానే, రాణి జస్వంతరావునకు వర్తమానమంపినది. అతడు బైరాగిని సగౌరవముగ వెంట దీసికొనివచ్చి రాణియెదుట నొక పీఠముపై గూర్చుండబెట్టి, స్వామీ! ఈయుంగర మెక్కడిదని యడుగుచు నుంగరమును చూపెను. బైరాగి వెలవెల బోయినాడు. ఉంగరమునుచూచిన రాణి "ఇది మా ముక్తాబాయిది. నాడు భిల్లులు దోచుకున్నప్పుడు పోయినది. వీడును భిల్లులలోని వాడేనా" యని యడిగెను. ఆ పలుకులువిన్న జస్వంతరావు, "శాయాజీని రప్పించిన నీవిషయము తెలియు"నని పలికెను. శాయాజీవచ్చి బైరాగిని చూచి, "గండాభిల్లుడా"యని యతనిని పల్కరించెను. వీడేనా గండాభిల్లుడని యందరు నాశ్చర్యమొందిరి. జస్వంతుడు రాణిచే మెప్పుల నందుకొన్నాడు. అప్పు డతడు, "అమ్మా! నేను స్వయముగ బైరాగివేషము వేసికొని వీని సంచిలోనున్న యుంగరము చూచి అనుమానించి వీనిని దెచ్చితిని. ఋషినికూడ బట్టుకొన దలచితినిగాని అత డంతకుముందే విషముదిని మృతినొందినాడు. తనకు మాటవచ్చునని గండాభిల్లును ఋషి తన కుటీరములో నుండనీయనందున వీడు కోపించి ఋషిపై నాతో నేరములు

చెప్పినాడు. దానితో నాత డాత్మహత్య గావించుకొన్నాడు. ఈతడు చిక్కినాడు. శత్రుశేష మిక లేదు"- అనెను.

ప్రజలనుదోచుకొను గండాభిల్లునకును, ఆద్రోహకార్యములకు దోహదముచేసిన శాయాజీకిని మరణదండన విధింపబడినది. వామనభట్టునకు చెరసాల తప్పినదికాదు.

కమల తమ్ముడగు బాజీరావునకు రాణి కొలువులో నుద్యోగము లభించినది. శ్యామసుందరుడు కొత్వాలుగ నియమింపబడినాడు.

ఇన్ని యుత్తరువు లొక్కసారిగా నొసగిన రాణియుత్సాహమునకు మేరలేదు. ఆ శుభసమయమున కమల జ్ఞాపకమునకు వచ్చినది. మౌహూర్తికుల రప్పించి కమలా శ్యామసుందరులకును, ముక్తాజస్వంతులకును వివాహ ముహూర్తములు పెట్టించినది రాణి.

నగరమంతయు నానందమున నోలలాడినది. మహావైభవములతో నిందూరు నగరము పెండ్లి మేళములతో మారుమ్రోగినది. దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును చేసిన వీరులవివాహములలో, ప్రజలెల్లరును పెండ్లి పెద్దలైరి. మహారాణి యహల్యాబాయి రాజ్యమున శుభకార్యముల కిది నాందియైనది. ఎటజూచినను పండుగలే, సంబరములే. శాంతి, సౌఖ్యముల కా దేశ మాలవాలమైనది.

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు

సంపూర్ణము



PART II

# [ Biographical Sketches ]

స్వరాజ్య సారథి, లోకమాన్య

## బాలగంగాధర తిలకు

నవయుగ నిర్మాత

## కందుకూరి వీరేశలింగము

విప్లవయోగి

## అరవింద ఘోషు



PLANNED AND EDITED BY

**The Committee Constituted**

*by*

THE GOVERNMENT OF ANDHRA STATE, KURNOOL.

[These Biographical Sketches have been planned and edited primarily for the use of candidates sitting for the Andhra S. S.L. C. Public Examination in 1958. It was first published under the authority and on behalf of the Director of Public Instruction, Andhra Pradesh (at) Kurnool on 31st May 1957.]

*Copies can be had of:*

**The Director, Government Central Press,**
**Andhra Pradesh, Hyderabad.**

AJANTA PRINTERS
SECUNDERABAD

# పరిచయము

ఆంధ్రప్రభుత్వమువారి ఆదేశానుసారముగ, స్కూలుఫైనలు విద్యార్థులకై ఈ ఉపవాచకము రచితమైనది. విషయము ఉన్నతాదర్శాత్మకము, చరిత్రాత్మకమునై యుండుట మంచిదని విద్యాధికారుల సూచన.

ఇందలి మొదటి భాగము, కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి 'అహల్యాబాయి' నవలకు సంగ్రహము. అబలయయ్యును బలవంతులగు దేశద్రోహుల దుష్టప్రయత్నముల నెదుర్కొని, ప్రజాశ్రేయ మాదర్శముగ రాజధర్మమును పాలించిన అహల్యాబాయి భారత వీరనారీమణులలో నొకతె.

దేశీయాభ్యుదయమును, ప్రజాహితమును తమ జీవితాదర్శములుగ నిడికొని, తమసర్వస్వమును తత్సాధనయందు ధారవోసి చరితార్థులైన మహాపురుషుల జీవిత గాథలు రెండవ భాగమున కూర్పబడినవి. మహారాష్ట్ర, ఆంధ్ర, వంగభూములలో నుద్భవించిన ఈ కారణజన్ముల జీవితములు, వారి త్యాగము, వారి సందేశములు, భారతీయ సంస్కృతి చరిత్రకు ఉదాత్తత నాపాదించినవి. ఈ ఉన్నతాదర్శములు భావిపౌరులను సద్ధర్మ పథానుగాములుగ చేయగలవని సంపాదక వర్గమువారి ఆశయము.

ఉపవాచకములు, చాలవరకు, విద్యార్థులు స్వయముగ పఠించునవి యగుటచే తద్రచనయందు భాషాసారళ్య అర్థవైశద్యములు ఆదర్శములైనవి. చదువుటలో అవ్యవహితోచ్చారణ తప్పనిసరియగుచోట్ల సంధియు, సంధి కార్యములను పాటింపబడినవి. అర్థవైశద్యము ప్రయోజనముగ అవిచదువవలసిన చోట్ల విసంధియే కాననగును. తదనుగుణముగ యడాగమ నుగాగమ సరళాదేశాదులను చేయలేదు. సంధికి ఆధారమగునది సంహిత యగుటచే పైవిధాన మనుసరింపబడినది. ద్విత్వరూపమున మాత్రమే శకటరేఫ నుపయోగించి, తక్కిన చోట్ల సాధురేఫను నిలిపినాము. అరసున్న లెందును వాడలేదు.

విషయ గౌరవమునుబట్టి వాడిన ఒకటి రెండు పదములు (చాల క్వాచిత్కముగ) విద్యార్థులకు క్రొత్తవిగ తోపవచ్చును. అధ్యాపకులు వానిని గమనించి సహకరింతురని ప్రార్థన.

—సంపాదక వర్గము.

# విషయ సూచిక

స్వరాజ్య సారథి, లోకమాన్య

# బాలగంగాధర తిలకు

ఉపాధ్యాయ వృత్తిలో నెల కయిదురూపాయల జీతమును గడించుచుండిన గంగాధరపంతు అను మహారాష్ట్రునకు పార్వతీబాయియందు 1856 వ సంవత్సరము జూలై నెల 23వ తేదీన బలవంతరావు అను పుత్రు డుదయించెను. ఈ బలవంతరావే బాలగంగాధర తిలకు. బాలగంగాధరుని తాత కేశవరావు. ఆంగ్లేయులు పీష్వాల రాజ్య మాక్రమించు కొన్నప్పుడు పరులకు లోంగియుండగూడ దనుకొని, రెవిన్యూశాఖలోని యుద్యోగమును త్యజించిన యాత్మాభిమాని యతడు. పండితుడైన కేశవునికడ బెరిగిన గంగాధరపంతు కూడ పండితు డగుటలో నాశ్చర్యము లేదుకదా! ఐనను, కుటుంబ పరిస్థితులు సరిగ లేనందున గంగాధరున కున్నతవిద్య లభింపలేదు. తానైయందులకు ప్రయత్నించెనుకాని, తల్లి మరణము, తండ్రి వైరాగ్యము నతని నుపాధ్యాయ వృత్తిలోనికి దింపినవి. స్వయంకృషి వలన నాతడు 'అసిస్టెంటు డిప్యూటీ ఇనస్పెక్టరు' (Assistant Deputy-Inspector of Schools) కాగలిగినాడు. ఆయన రచించిన యాంగ్లదేశ చరిత్రను, గణిత వ్యాకరణ పుస్తకములను సర్కారువారే ప్రచురించుకొన్నా రన్న, ఆయన శక్తి సామర్థ్యములు సువ్యక్తములుకదా!

బాలగంగాధరునకు సంస్కృత మహారాష్ట్రి భాషలను, గణితమును తండ్రియే బోధించెను. జ్ఞాపకశక్తికల బాలునకు సంస్కృతము మంచినీళ్ళప్రాయమైనది. పదవయేట పూనాపట్టణ పాఠశాలలో ప్రవేశించిన యీతడు రెండేండ్లలో మూడు తరగతులు దాటినాడు. ఎట్టి లెక్కలనైనను నోటితోనే చేసెడివాడు. 'ఏపద్ధతి ప్రకారము చేసితివిరా' యని యుపాధ్యాయు లడుగ నా పద్ధతి తన తలలో నున్నదని జంకులేక పలికెడివాడట!

పదునైదవయేట నితనికి వివాహమైనది. ఆ మరుసటి సంవత్సరమే తండ్రి గంగాధరుడు మరణించినాడు. బాలగంగాధరుని విద్యాభ్యాసమునకు కావలసిన యేర్పాట్లతడు చేసియుండుటచేత, బాలుని విద్యావ్యాసంగమునకు భంగము కలుగలేదు. తన పదునేడవయేట బాలగంగాధరుడు పూనాలోని డక్కను కళాశాలలో చేరినాడు. అతనికి నెలకు పది రూపాయలు విద్యార్థివేతనము లభించినది. కళాశాలలోని సంస్కృత కవిత్వపు పోటీలో నితనిదే ప్రథమస్థానము. కాని, పాఠముల కంటెను శరీరపరిశ్రమ యీతని నెక్కువగ నాకర్షించినది. చిన్నతల, ముందుకు త్రోసికొనివచ్చు పొట్ట, శక్తిహీనమగు దేహము కల తిలకు, పాఠములు పోయినను సరియే, శరీరమును పటిష్టము చేసికొనవలెనని పట్టుపట్టినాడు. ఎఫ్. ఏ. (F. A.) పరీక్ష మాత్రము పోయినది. ఇతరులను కూడ లాగుకొనిపోయి వారిచే దేహపరిశ్రమ చేయించెడివాడు. అట్టి పరిశ్రమలలో ఈత ముఖ్యమైనది. శక్తివంచనలేక చేసిననే యేకార్యమైనను ఫలించును

గానీ పిచ్చిపిచ్చి కలలవలన కాదని యతని నిర్ణయము. బలవర్ధ కౌషధములను నమ్ముకొని వ్యాయామము చేయనివారి కడ కేగి, యా మందుబుడ్లను బ్రద్దలు కొట్టెడివాడట! ఈ యుద్రేక స్వభావమే తర్వాతికాలమున విదేశవస్తు బహిష్కారమునకు దారితీసినది.

ఇరువదియవయేట నితడు పట్టభద్రు డైనాడు. M. A. పరీక్షకు చదివెను, కాని నెగ్గలేదు. పిమ్మట న్యాయశాస్త్ర పరీక్షయం దుత్తీర్ణు డయ్యెను. మరల నొకమారు M. A. పరీక్షకు కట్టెను కాని లాభము లేకపోయినది. దీనితో నాతడు పరీక్షల చదువునకు స్వస్తి చెప్పినాడు.

తనకున్న విద్యార్జనావకాశముకూడ లేనివా రెందరో యున్న యీ దేశమున విద్యావ్యాప్తి చేయుట కర్తవ్య మను కొన్నాడు. కాని, యే యాధారమును లేని వారు విద్యా వ్యాప్తి చేయు టెట్లు? తానే యుపాధ్యాయుడగుట తప్ప వేరు మార్గము కనిపించలేదు. భోజనమునకు సరిపోవునంత మాత్రము, నెలకు 75 రూపాయలకు మించకుండ ఎవరేని ధనసహాయము చేసిన, ఎల్లరకు నుచిత విద్యాసౌకర్యములు కలుగజేసెదమని బాలగంగాధరుడును, అగర్కరు మున్నగు కొందరు మిత్రులును పెద్దల నాశ్రయించిరి. ప్రభుత్వపు విద్యాశాఖనుండి విరమించిన విష్ణుశాస్త్రి చిప్లుంకరను నతడు పాఠశాల నారంభించుట కంగీకరించెను. తిలకును ప్రోత్సాహపరచిన మిత్రులు కొందరీ కార్యమువలన గలుగు లాభము శూన్యమని యెంచి జారు కొనిరి. అగర్కరుకు డక్కను కళాశాలలో నుద్యోగము

(Fellowship) రాగా, నాతడును పాఠశాలకు దూరమైనాడు. చిప్లుంకరును, తిలకును మాత్రమే మిగిలినను, పాఠశాల 1880 లో ప్రారంభమైనది. ఆప్టేకూడ చేరెను కాని, యతని కధికవేతన మీయవలసి వచ్చినది. మొదటి సంవత్సరము తిలకు గాని, చిప్లుంకరుగాని తీసికొన్న వేతన మేమియు లేదనియే చెప్పవచ్చును. క్రైస్తవ మిషనరీ పాఠశాలలవలె నడచు హైందవ పాఠశాల లేదేయన్న కొరత తీరినది. నాలుగేండ్లలో మెట్రిక్యులేషను పరీక్షలో నూటి కెనుబదితొమ్మిదిమంది వరకు నెగ్గునట్టి యభివృద్ధిని గాంచిన యీ పాఠశాలను సర్కారువారే ప్రశంసించినారు.

దారిద్ర్యము తాండవించుచుండిన రోజు లవి. క్షామములు తరచైనవి. పంటలులేక యవస్థపడు నాసమయమున భూమి పన్నును పెరిగినది. పండిన కొలది పంటను ఊడ్చి యాంగ్లదేశమున కెగుమతి చేయుచుండిరి. నీలి, జనుము పండించువారాంగ్లేయ భూస్వాములు. వారికడనున్న భారతీయులగు కూలీలగతి దుర్భరము. యజమాను లెట్టి ఘాతుక కృత్యము లొనర్చినను కాదనగలవాడు లేడు. ఎటుచూచినను ఆకలి. కని కరములేని వడ్డీవ్యాపారులవల్లను, మానవత్వము నశించిన ధనిక భూస్వాముల వల్లను ప్రజలు నలుగుడు పడినారు. అన్నమో రామచంద్రా యని ప్రజ లలమటించుచుండ కోట్లకొలది రూప్యముల ధన మాంగ్లేయు లెత్తికొని పోవుచుండినారు. తమదేశపు వస్త్ర వ్యాపారమున కడ్డము వచ్చునని భారతీయ గృహ పరిశ్రమలను కూలద్రోసినారు దొరలు. జిలుగు జిలుగు వలువల నతి

మనోహరముగ నేయు భారతీయ శ్రామికుల వ్రేళ్ళు కత్తిరించి నారు. ఇట్టి యాపత్సమయములో వైస్రాయి లిట్టను ప్రభువు స్వదేశ సంస్థానాధిపతులకు బిరుదములిచ్చి, విక్టోరియా రాణిగారి దర్బారుచూపి, వారిని లోబరచుకొన దలచినాడు. ఇక ప్రజలకు దిక్కేది? తామే తమ్ము రక్షించుకొనవలెనుకదా! పూనాలో స్వదేశీ, కుటీరపరిశ్రమల ప్రచారము ఆరంభమైనది. ప్రచారకుల వక్తృత్వము నుత్తేజపరచుట కొక సభ యేర్పాటైనది. సార్వ జనిక సభయు నేర్పాటు చేయబడినది. ఒక చిల్లిగవ్వయైనను దేశముదాటి పోరాదని యాసభ నిర్ణయము.

విప్లవ భావముతో సర్కారుద్యోగమును కాలదన్నిన చిప్లుంకరు ఉత్తేజితుడైనాడు. పత్రికా ముఖమున ప్రజాప్రబో ధము గావింప దలచినాడు. అంతకుముందే 'నిబంధమాల' యను మరాఠీ వారపత్రిక నితడును, 'డక్కన్‌స్టార్' అను నాంగ్ల పత్రికను నామ్‌జోషి యను నింకొక యుపాధ్యాయుడును నడపి యుండిరి. తాకట్టులో నుండిన నామ్‌జోషి ముద్రణయంత్రము నెట్లో కష్టపడి యంచెలపై జెల్లించు నేర్పాటుతో స్వాధీనము చేసికొన్నారు. స్వాధీనము చేసికొనిరి కాని దాని నుంచుకొను టకు స్థలమేది? పాఠశాలకే దానిని చేర్పదలచినారు. చేర్చుట యెట్లను ప్రశ్న యుదయించినది. భుజమున కెత్తుకొన్నాడు బాల గంగాధరుడు. అగర్కారు, నామ్‌జోషి, చిప్లుంకరులుగూడ గొన్ని భాగముల నెత్తుకొని ఆ యంత్రమును పాఠశాల చేర్చినారు.

డక్కన్ స్టార్ పత్రిక "మరాటా" పత్రికగా మారినది. మరాటీభాషలో "కేసరి" పత్రిక స్థాపింపబడినది. తిలకు, అగర్కా

రులు సంపాదకులు. వారి వ్రాతలు సర్కారువారిని కలచి వేసినవి. "త్రుప్పుపట్టిన తుపాకులను కూడ నుంచుకొన నర్హతలేని సంస్థానాధిపతులకు రాచరికమేల? విక్టోరియారాణి దర్బారులో నేమొగము పెట్టుకొని బిరుదముల గైకొందురు వీరు? వీర భారత సమ్రాట్టులకు వీరా ప్రతినిధులు!"-అని 'కేసరి' పత్రిక రణభేరి మ్రోగించినది. దుర్మార్గకార్యము లొనర్చువారి ప్రవర్తనను మారణహోమమొనర్చినది మరాటాపత్రిక విమర్శ. ఉద్యోగ లాలసులగు విద్యావంతుల ఊడిగపు టలసభావమును నిర్మూలించుటకై యుద్యమము లేవదీయ సంకల్పించినాడు తిలకు. విద్యావంతులు పూనుకొన్ననే కదా ప్రజలు విముక్తి నందెదరు? కొల్హాపురాధీశుని మంత్రి యాంగ్లేయులతో కుట్రచేసి రాజును పదభ్రష్టుని చేయ యత్నించుచున్నాడని తెలియవచ్చినది. కేసరి మరాటా పత్రిక లీ కుట్రను విమర్శించినవి. ఆ కుట్రవార్త యబద్ధమని తెలిసినపుడు తిలకు, అగర్కారు లుదాత్తముగ, తాము వ్రాయని వ్యాసమునకై, క్షమాపణ చెప్పుకొనిరి. కాని, యామంత్రి మొండిపట్టు పట్టి న్యాయస్థానమునకీడ్చినందున, తప్పునొప్పుకొన్న సంపాదకులకు చెరి నాలుగునెలల తేలికఖైదు విధింపబడినది. అభియోగము జరుగునప్పుడు పూచీకత్తు కావలెనని న్యాయస్థానమువారు కోరిరని తెలియగనే ముక్కుమొగ మెరుగని యెవరో యొక వ్యాపారి 5000 రూపాయలను తీసికొని న్యాయస్థానమునకు పరుగెత్తినాడట. తిలకు సహాయ నిధికై విద్యార్థులు వేసిన నాటకములో గోపాలకృష్ణ గోఖలే యొక యాడువేషమువేసి తన యుడుతభక్తి గనబరచినాడు.

అనుకొనని యీ కారాగార ప్రవాసము ధీరుడగు తిలకులో పౌరుషము చెలరేపినది. అతనికి దేశమున పలుకుబడి హెచ్చినది. దీనివలన పాఠశాలకును బలము కలిగినది. దక్కను విద్యాసంస్థ స్థాపింప బడినది. 1885 లో నాసంస్థ కెనుబదివేల రూప్యముల నిలువధనము కూడినది. గవర్నర్ ఫెర్గుసన్ పేరున నొక కళాశాల యేర్పరచినారు. సర్కారువారి సహాయము కూడ లభించినందున కళాశాల యునికి స్థిరపడినది. ప్రభుత్వము తమ విద్యాలయములనుకూడ నీ సంస్థకే చేర్పదలచిరన్న దీని ప్రతిష్ఠనుగూర్చి చెప్పనవసరము లేదుకదా ?

ఫెర్గుసన్ కళాశాలలో నాంగ్లాచార్యుడుగ నుండిన గోఖలే, సార్వజనిక సభలోను నుద్యోగము చేయదలచినాడు. ఒకేవ్యక్తి రెండుచోట్ల నొకే సమయమున నుద్యోగము చేయుట సరికాదని బాలగంగాధరుడు వ్యతిరేకించినాడు. భండార్కరు వంటి దక్కను విద్యాసంస్థ సభ్యులు గోఖలే పక్షమైనందున తానై పెంచి పెద్దచేసిన యీ సంస్థనుండి తిలకు తొలగిపోవలసి వచ్చినది. దీనితో నతని జీవితమున కాధారము పోయినది. కేసరి మరాటా పత్రిక లేడువేల రూపాయల ఋణముతో నతనిపై బడినవి. భాగములు పంచుకొన్నప్పుడు ముద్రణ యంత్రము గోఖలే, కేల్కరులకు దక్కినది. త్రాడులేని బొంగర మైనది తిలకు బ్రతుకు. న్యాయశాస్త్రమునం దుపన్యాసము లిచ్చిన పూట గడచునేమో యనుకొని, పత్రికలో నా విష యము ప్రకటించినాడు. నెలకు నూటయేబది రూపాయలు లభించు స్థితి యేర్పడినది. కొంత కుదుటపడిన తర్వాత, భాగ

ములు పోయిన H. N. గోఖలే, కేల్కారులకును నట స్థానమిచ్చి నాడు తిలకు.

విద్యాసంస్థతో సంబంధము వదలిన తర్వాత తిలకు దేశ సేవకై కంకణము కట్టుకొనినాడు. అప్పటికే కొంత పేరువడసి యున్న తిలకు, బొంబాయి రాష్ట్రసభలో ప్రముఖుడయ్యెను. ఇంగ్లీషువారికి లోబడియుండి సంఘ సంస్కారమును మాత్రము చేయదలచిన మితవాదు లొకపక్షము. రాజ్యతంత్రము భారతీయుల వశము కావలెనను అతివాదులు మరియొక పక్షము. ఇట్లు రెండుపక్షము లాసభలో నుండినవి. తీవ్రవాదియైన చిప్లుంకరుతో కలసి మెలసి యుండిన తిలకతివాదియే యగునుకదా!

లండనులోని పార్లమెంటువారు మందలించినను మద్యపాన వ్యసనమును ప్రభుత్వమువారు ప్రోత్సహించు చుండుటను ఈ సభవారు(1889)గర్హించినారు. ఉప్పుపై పన్ను తగ్గింపవలెనన్నారు. ప్రభుత్వ మొనర్చు తప్పులను సరిదిద్దవలసిన బాధ్యత ప్రజలదే యనియు, ఉప్పుపన్ను భరించుట యాత్మాభిమాన రాహిత్య సూచనమనియు, నాంగ్లేయులగు రస్ డెన్ (Rusden) మున్నగువారును మరాటా పత్రికలో తీవ్రముగ వ్రాసినారు.

ఇట్లుండ క్రాఫర్డు అను నుద్యోగి లంచగొండియని పది మందియు ననుకొనుచుండిరి. సాక్ష్యము చెప్పినచో తమ యుద్యోగము పోవునని చిన్నయుద్యోగు లూరకున్నారు. వారికి రక్షణలేనిదే సాక్ష్యము రాదన్నాడు తిలక్. రక్షణ నిచ్చుట కంగీకరించిన ప్రభుత్వము, సాక్ష్యమిచ్చిన తర్వాత వారిపై చర్యగైకొన్నది. క్రాఫర్డు సహాయకుడగు భారతీయుడు

హనుమంతరావు శిక్షింపబడెనే కాని ప్రజాద్రోహియైన క్రాఫర్డు మాత్ర మచ్చువేసిన యాబోతువలె విచ్చలవిడిగా విడువబడినాడు. ఇది యన్యాయమని బహిరంగసభలో అన్నాడు బాలగంగాధరుడు. బహిరంగసభలో మాటాడుట కతని కదియే మొదలు. కేసరి మరాటా పత్రికలు ప్రభుత్వముపై ప్రచండముగ దాడి చేసినవి. పూనాపట్టణ మట్టుడికిన ట్లుడికిపోయినది. ఇంగ్లండులో నాంగ్లేయులు బ్రాడ్లా, డిగ్బీ-యనువారు తిలకు కండగా నిలిచి పోరాడి విజయపతాకలు వినువీధి కెత్తించిరి. ఆప్రజాలని యానందముతో, కరుడులెత్తిన కంటినీళ్ళతో, నిండు హృదయములను నివేదించుకొన్నారు నిర్వ్యాజ కారుణ్యమూర్తికి, బాలగంగాధరునకు, ఆ నిరాలంబ భారతీయోద్యోగులు. చంద్రునకు నూలుపోగుగ నొక యున్ని పైపంచెను, ఒక వెండి గడియారమును కానుక పెట్టుకొన్నారు. జీవితాంతమువరకు నా గడియారమును బాలగంగాధరుడు భద్రముగ నుంచుకొన్నాడు.

సంస్కరింపవలసిన యానాటి దురాచారములలో బాల్యవివాహ మొకటి. పండ్రెండు సంవత్సరములును రాని పసిపాప మెడకు వివాహ పాశమును తగిలింపరాదనియు, వితంతువులు మరల వివాహమాడినను మొదటిభర్త యాస్త్రిపై వారి కధికారముండవలెననియు, శాసనము చేయవలెనని బైరాంజీ మలబారీ యను నతడు ప్రచారము చేయసాగెను. ప్రభుత్వ శాసనముల వలన సంస్కరణలు సరిగ రూపొందవని తిలకు దానిని వ్యతిరేకించెను. దానితో సర్వపక్ష బహిరంగసభ యేర్పాటైనది. దానిలో తిలకొక తీర్మానమును ప్రవేశపెట్టినాడు. బాలికలకు

పదునారేండ్లైనను రానిదే వివాహము కూడదనియు, నలుబది యేండ్లు పైబడిన పురుషులు వివాహమాడరాదనియు, అట్టి వారు పెండ్లాడదలచినచో వితంతువులనే వివాహమాడవలె ననియు, కట్నములు తీసికొనరాదనియు, వితంతువులను విరూపల నొనర్పరాదనియు, వివాహ సమయములందు మద్య ముపయోగింపరాదనియు, అన్నిటికన్న ముఖ్యముగ సంస్కర్తల మనుకొనువారు తమ యాదాయములో పదవభాగము ప్రజార్థము వినియోగింపవలెననియు—ఉన్న ఆ తీర్మానము అందర నాశ్చర్య మగ్నులను చేసినది. ఆయనలో సంస్కరణాభిలాష లేదని యెవరనగలరు?

వితంతు వివాహములనుగూర్చి బ్రహ్మాండముగ నుపన్యసించిన మహాదేవ గోవింద రనడే, భార్య చనిపోగా, కన్యకనే పెండ్లాడినాడు. సమయము వచ్చునప్పటికి అందరును వెనుక ముందాడెడువారే. బాలగంగాధరు డట్టి యాత్మవంచకుడు కాడు. తన యుద్దేశముల కనుగుణముగ తనకుమార్తెలకు పదునారేండ్లు దాటిన పిమ్మటనే వివాహ మొనర్చిన సంత్యసంధుడతడు. ప్రజలను రంజించి కార్యము సాధింపవలె ననుటయే తిలక్ రాజనీతి.

ప్రజా హృదయములను చూరగొన్న బాలగంగాధరుడు, బొంబాయిలోజరిగిన యఖిలభారత కాంగ్రెసు సమావేశము (1889) నకు పూనా ప్రజా ప్రతినిధిగ నరిగినాడు. శాసనసభలలో హిందువు లధిక సంఖ్యాకులుగ నున్నచోట వారికున్నన్ని స్థానము లితరులకును, ముస్లిము లధిక సంఖ్యాకులుగ నున్నచోట

వారికున్నన్ని స్థానము లితరులకును నుండవలెనను తీర్మానము చర్చకు వచ్చినది. భారతీయులలో విభేదమును కల్పించు నీ తీర్మానమును హ్యూం (Hume) ఎదిరించినాడు. హిందూ మహమ్మదీయ భేదముండరాదని హామీదాలీఖాన్ ప్రభృతులు వాదించి తీర్మానము నోడించినారు. ముస్లిములలోని యీ జాతీయ భావమును గాంచిన తిలకులో, భారతీయు లొకేజాతి వారన్న యభిప్రాయము దృఢముగ నాటుకొనినది.

ఆనాడు హిందువులు ముస్లిముల యుత్సవములలో అరమరలు లేక పాల్గొనుచుండినారు. ఇది సర్కారువారికి గిట్టలేదు. ముస్లిములను చేరదీసి, ఇతరులపై నుసికొల్పి కల్లోలములు కల్గింపదలచినాడు వైస్రాయి మేయో. స్వరాజ్యమేవచ్చినచో ముస్లిము లల్పసంఖ్యాకు లగుదురను బూచిని చూపి బెదరించినారు తెల్లదొరలు. జాతీయ సౌభాగ్యమున కీ నిప్పుపెట్టినవాడు ఆలీఘరు ముస్లిము కళాశాల ప్రిన్సిపాలు బెక్ (Beck) అను నాంగ్లేయుడు. గోవులపై దయచూపుట ముస్లిములపై దాడి చేయుట యని సిద్ధాంతీకరించినాడు ప్రిన్సిపాలు బెక్కు. గోసంరక్షణలో దోషమేమియు లేదని సర్ సయ్యద్ అహమద్ ఖాన్ వంటి పెద్దలు తెలియజెప్పినను ద్రోహబుద్ధి మానినవాడుకాడు బెక్కు. తానుచెడినకోతి వనమెల్లను చెరచెనన్నట్లు కళాశాలను కళంకశాలగా చేసివైచినాడు. విద్యుక్తధర్మములను ప్రక్కకుబెట్టి, వెర్రి విద్యార్థులను వెంట బెట్టుకొని ఢిల్లీ జుమ్మామసీదున కెదురుగ తిష్ఠవేసి, భారతదేశమునకు రాజకీయముగ నెట్టి యభివృద్ధిని చేకూర్పరాదను నంశముపై నిరువదియొక్క వేయిమంది చే వ్రా

శ్వేట్లో సేకరించి పార్లమెంటువారి కందజేసినా డీ ప్రబుద్ధుడు. సయ్యద్ సర్ఫుద్దీన్‌వంటివా రెదిర్చినను బెక్కు కల్పించిన చిక్కు తప్పలేదు. 1888 లో ముస్లిములకు ప్రత్యేక ప్రాతినిధ్య మొసగినాడు డఫరిన్. ఈ ప్రత్యేకత, ముస్లిములు వాంఛించినది కాదనియు, తెల్లవారి చేష్టయేయనియు సర్ మహమ్మద్ షాఫి తెలియజేసినాడు. ఎవ్వరును కోరకపోయినను నీ చీలిక బలవంత ముగా నేర్పరుపబడినదని డాక్టరు అంబేద్కరు చెప్పినాడు. 1892 లో రాజకీయ సంస్కరణములు కొన్ని పార్లమెంటువా రామోదించిరని తెలియగనే ముస్లిములను రెచ్చగొట్టినారు ప్రజాద్రోహులు. కల్లోల మారంభమైనది. ఆవేశముతో మతి చెడిన మూర్ఖుల నాపుట ప్రథమకర్తవ్యమైనది. సంయమనము కలిగి యుండవలెనని హిందువులను ఆదేశించినాడు తిలక్. ప్రభుత్వమే పైశాచిక ప్రవృత్తిని ప్రజ్వలింప జేయుచున్నప్పుడు ప్రజల మనస్సెట్లు కుదుటబడును ?

మనసు విరిగిన హిందువులు ముస్లిము పండుగలయెడ విముఖులైరి. దానితో, పదిమందియు నొకచో కలియు నవ కాశమే పోయినది. ఈ విషయమును గమనించిన బాలగంగా ధరుడు గణపతి యుత్సవము నేర్పాటు చేసినాడు. గణపతి యుత్సవములలో రాజకీయ విషయములే ముఖ్యస్థాన మాక్ర మించినవి. ఈ యుత్సవములలో ముస్లిములును పాల్గొన సాగిరి. నీటిలో కలిపివేయబడిన గణపతి సంవత్సరమైన తర్వాత మరలి వచ్చునట్లే, అణగారిన స్వాతంత్ర్యజ్యోతి మరల ప్రకా శింప గలదను నమ్మక మేర్పడినది. గజాసురు నంతమొందించి

నాడు గణపతి. అట్లే తామును పీడకజాతి నంత మొందింప వలె నను భావము ప్రజలలో గలిగినది. కుల మత భేదముల కతీత మైన జాతీయభావము తలయెత్తినది. గణపతి రాజకీయ గణపతి యైనాడు. పడెను, నైరోబీ పట్టణములలో గూడ నీ యుత్స వములు జరిగినవి. గణపతి యుత్సవముల మిషతో రాజకీయ సమ్మేళనములను గూర్చుటకంటె, ప్రత్యేకముగా రాజకీయపు టుత్సవములనే యేల జరుపుకొనరాదను నభిప్రాయము కలిగి నది.

శివాజీ యుత్సవ మారంభింపవలె ననుకొన్నారు. రాయ గడములోనున్న శివాజీ జీర్ణ దేవాలయోద్ధరణము చేయవలె నని తిలక్ ఉద్యమించినాడు. సర్కారువారు కూడ నిందుకు ధన మొసగినారు. ప్రతి సంవత్సరమును 5 రూపాయలు దీనికై ప్రభుత్వమీయ సంకల్పించినది. కేసరిపత్రిక ప్రారంభించిన శివాజీ నిధికి మొదటిచందా రెండణాలు. అది యిచ్చిన వ్యక్తి యొక విద్యార్థి. ఆ పేదవిద్యార్థి సమర్పించుకొన్న రెండణాలే ఛత్రపతి శివాజీయాత్మకు తుష్టి నొనగూర్పగలవు కాని మహారాజుల మాన్యములు కావుగదా! అసలు, మహారాజు లెవ్వరును చిన్న మెత్తు సహాయమును చేయలేదు. నిజమే! చనిపోయిన శివాజీ వారి కేమి యొరగబెట్ట గలడు? ఆంగ్లేయులన్న బిరుదము లిత్తురు. ప్రజల నోరుకొట్టి తిననిత్తురు. అట్టి ప్రభుత్వమువారితో విరోధ మేలయని యూరకుండిరేమో! కాని, తిల కూరకుండ నిచ్చునా? ప్రభుత్వమే దేవాలయోద్ధరణము చేయుచున్నపు డితరులు చేయుటలో తప్పేమియు లేదని యత డుద్ఘాటించినాడు.

పనితో, పెద్దలు కొందరు శివాజీ యుత్సవములలో పాల్గొన నంగీకరించిరి. అరణ్య ప్రదేశమైన రాయగడమునకు కొండలు దాటి వేనకువేల ప్రజలా యుత్సవములలో పాల్గొననేగిరి. కాల క్రమమున నీ శివాజీ యుత్సవము దేశ మెల్లెడల ప్రాకినది. బరోడా పట్టణమున నొక మహమ్మదీయుని యింట జరిగినది యీ యుత్సవము. అది జయప్రదము కావలెనని, యా ముస్లిము సోదరున కభినందన సందేశ మంపినాడు బాలగంగాధరుడు, ఈ యుద్యమమున కంతటికిని పూనా పట్టణమును, బాలగంగాధరుడును పట్టుగొమ్మలు.

రాజకీయ చైతన్య మిట్లభివృద్ధి యగుచుండ, సంస్కరణ వాదులు ప్రజోద్యమమును ప్రక్కకులాగ బ్రయత్నించుచుండిరి. ప్రజాశక్తులను ఏకోన్ముఖముగ నడపి, సంస్కరణవాదుల జాడ్యమును పోగొట్టి, స్వాతంత్ర్యమునకై ప్రయత్నింప వలెనని తిలకు ఉద్యమము. సంస్కరణలకును, స్వాతంత్ర్యోద్యమమునకును సంబంధ ముండరాదని పూనా కాంగ్రెసు తీర్మానించినది. సార్వజనిక సభలోకూడ తిలక్ పక్షము బలపడినది. బ్రిటిషు ప్రభుత్వము బాలగంగాధరుడు బాధింపదలచినచో దానికి రనడేలును, గోఖలేలును రక్షరేఖ కట్టగలరా!

అప్పుడు దేశమున క్షామదేవత కరాళనృత్యము చేయుచుండినది. జమీందారులు సిస్తును ఏడెనిమిదిరెట్లు పెంచివేసిరి. పెద్ద కల్లోలము రేగినది. దానితో క్షామనివారణ శాసనము వచ్చినది. క్షామ సమయములలో పన్నులు ముదరా యీవచ్చునని యధికారుల కనుజ్ఞ. భారతదేశ పరిస్థితులు తెలియరాగానే

ఆంగ్లదేశస్థులు సహాయము చేయబూనగా నా యుద్యమము నకు వైసురాయి అడ్డుతగిలినాడు. అమ్మ పెట్టదు; అడుక్కొని తిననీయదు. పన్ను ముదరాచట్టము నధికారులు అమలు పరుప లేదు. దేవుడు వరమిచ్చినను పూజారి యీయడుకదా!

తనప్రజ లాకటితో మరణింపరాదని విక్టోరియారాణి శాసనము చేసియుండ, ప్రజలేల చావవలయునని తిలకు ప్రశ్నించి నాడు. "ధనమున్న సిస్తు చెల్లింప వలసినదే; లేకున్న, చెల్లింప నవసరములేదని రాణియే చెప్పుచున్నది. ఇక పశువులను పాత్ర లను అమ్ముట యెందుకు? జిల్లా యధికారికడ కేగిన ఆయనయే మనకు తిండిపెట్టగలడు. అంగళ్ళు దోచుకొనుట యెందుకు?" అని తిలకు ప్రజల నుద్బోధించినాడు. క్షామనివారణ శాసనము నందలిముఖ్యభాగములను మరాటీ భాషలోని కనువదించి యంద రకు పంచిపెట్టినాడు. ప్రచారకులను గూడ నియమించినాడు. దీనితో, వైస్రాయి మరాటాదేశమునకు రాక తప్పలేదు. ధన వంతుల విందులు, ప్రముఖుల బహుపరాకులు నధికమైనవి. దేశము నాశనమైనను వారికి చీమకుట్టదుకదా! భారతదేశము నుండి ఇంగ్లాండుకు ప్రతిమాసమును తెచ్చుకొనుచున్న ధనమును కొంతకాలము నిలుపవలెనని హిండ్‌మన్ (Hyndman) అను నాంగ్లేయు డింగ్లాండులో నొక సభలో కోరగా నతనిని సభ నుండి వెలుపలికి గెంటివేసిరట. ఆకోరికను మన్నించియుండిన నిరువదికోట్ల రూపాయలు భారత ప్రజలకు దక్కెడివి. భారత ప్రభుత్వమునకు క్షామముకంటె సార్వజనిక సభ యునికి కంటకమైనది. సంస్కరణ వాదులెల్లరును ప్రభుత్వసహాయముతో

నెదురునిలిచినను బాలగంగాధరుడు రెండుమార్లు బొంబాయి కౌన్సిలు కెన్నికయినాడు. ప్రభాకరునిపై మూకుడు మూయ నగునా!

కలవుబాధ యిట్లుండ పూనాలో ప్లేగు విరుచుకొని పడినది. అధికారులు మాత్రము తమ కుటుంబములను సురక్షిత ప్రదేశములకు చేరవేసికొన్నారు. ప్రభుత్వపు వైద్యులు దయా శూన్యులైనందున వారి పేరెత్తిననే ప్రజలు భయపడసాగిరి. ఈ యభాగ్యజనమునకు రక్షణ కల్పింపవలసిన బాధ్యత తిలక్‌పై బడినది. చందాలు సేకరించి యాతడొక వైద్యశాలను స్థాపించి నాడు. ప్లేగు అంటుజాడ్యమైనందున రోగులను ప్రజలనుండి దూరముగ నుంచవలసి వచ్చినది. ఈ కార్యనిర్వహణము క్రూరు లగు నధికారులచేత బడినది. వారు ప్రజలను దోచుకొన్నారు. స్త్రీల నవమానించారు. ఈ సర్కారుద్యోగుల ప్రవర్తనకంటె ప్లేగు మెరుగనిపించినది.

ఈ క్షోభ యిట్లుండ, స్వదేశ ప్రభువు లాంగ్లరాజ్ఞి వజ్రో త్సవమున పాల్గొనుటకై యింగ్లాండుకు వేంచేసిరి. త్రుప్పుపట్టిన తుపాకు లుంచుకొనుటకు కూడ నర్హత లేని యీ మయూర వ్యంసకులు, ఈకలు తలలో చెక్కుకొని వస్తుప్రదర్శన శాలలోని విచిత్ర వస్తువులవలె ఇంగ్లాండుకు బోయి ఇకిలింతల పాలగుట మర్యాద కాదు. ఆంగ్ల యువరాజు మన దేశవాళీ రాజులను పర్యవేక్షించుట (Inspect) సర్కసువాడు తన జంతువులను పరి శీలించినట్లున్నదని మరాటా పత్రికలో వ్రాసినాడు బాలగంగా ధరుడు. రైలు రవాణా సౌకర్యము లాంగ్లేయులు కల్పింప

లేచాయని కొందరడుగ అది పరస్త్రీల నలంకరించుట వంటిదని తిలకు బదులు చెప్పినాడు.

దుష్టులను శిక్షించుటకే దేవుడుద్భవించుననియు, దుర్మార్గుల నెదురించుటలో దోష మేమియు లేదనియు, నదియే కర్తవ్యమనియు భగవద్గీత ఘోషించుచున్నదని తిలకుద్బోధించినాడు. "శివాజీ పలుకులు" - అను పేరుతో, నాటి పరిస్థితులలో శివాజీ తలపు లెట్లుండునోయని యూహించి యొకరు వ్రాసిన కొన్ని మరాటీ పద్యములు కేసరి పత్రికలో ప్రకటింపబడినవి. ఈ వ్రాతలు దేశములో నలజడి రేపినవి. ఆవేశపూరితులగు "చఫేకరు"లను నిరువురు సోదరులు రాణి వజ్రోత్సవ శుభదినమున ప్లేగధిపతియైన రాండ్ (Rand, Plague commissioner)ను మట్టుపెట్టినారు. ఆంగ్లేయుల పత్రిక లీ హత్యాబాధ్యత తిలకుదేయని దుష్ట ప్రలాపములు చేయసాగినవి. ఆ యసత్య ప్రచారము నరికట్టుటకై న్యాయబద్ధమగు చర్య గైకొనవలెనని బొంబాయి కేగిన బాలగంగాధరుని ఖైదు చేసినారు ప్రభుత్వమువారు. న్యాయబద్ధుడైన తిలకుపై రాజద్రోహపు నేర మారోపింపబడినది. బంధితుడైన తర్వాత నొకటి రెండు గంటలలోనే జైలులో నిశ్చింతగ నిద్రపోవు బాలగంగాధరునిజూచి, ఆశ్చర్యపడినాడతని మిత్రుడు ఖరే. బాలగంగాధరుడు కష్టసుఖముల కతీతుడు. భగవద్గీత నర్థము చేసికొన్న స్థితప్రజ్ఞుడు.

తిలకుమ జామీనుపై విడిపింపగోరినాడతని న్యాయవాది దావరు. ఆ విజ్ఞప్తి విఫలము కాగా హైకోర్టువారికి విన్నవించుకొన్నారు. అచ్చట న్యాయమూర్తి మహాదేవ గోవింద రనడే.

విన్నపము త్రోసివేయబడినది. మరల మనవి చేసికొన్నాడు న్యాయవాది దావరు. అప్పుడును రనడేగారు తిరస్కారభావమే చూపినారు. ఇంకొకమారు విజ్ఞప్తి చేయబడినది. అప్పుడు న్యాయమూర్తి బదురుద్దీన్ తయాబ్జీ. "ఒకవ్యక్తి దుర్మార్గుడను నభిప్రాయమును, విచారణ జరుగకముందే యేర్పరచుకొనుట తప్పు. తిలకువంటి బాధ్యతగల పెద్దమనుష్యుడు విచారణ దిన మున న్యాయస్థానమునకు రాడనుకొనుట కాధారములు లేవు. విచారణలో తిలకు నిర్దోషి యనియును తేలవచ్చునుగాన, అంత వరకు నాయనను చెరలో నుంచినచో నది యధర్మకార్య మగు నని" - యుదాత్త హృదయముతో నా పూజ్యమూర్తిని జామీ నుపై విడిచిపెట్టినాడు ధీరుడు బదురుద్దీన్ తయాబ్జీ. ఆ ధర్మ దేవత యనుగ్రహామునుగాంచి సంతోషముతో నుక్కిరిబిక్కిరి యైనారు భారతీయులు. కృతజ్ఞతతో, ఆనందముతో - చెమ్మ గిల్లని కన్నులు లేవానాడు.

"అడుగో, మహనీయమూర్తిని బాలగంగాధరుని విడిపింప గలిగిన ధర్మవీరుడు, బదురుద్దీన్ తయాబ్జీ," - అని యా ధర్మ ప్రభువును తన బిడ్డలకు చూపి హృదయములో నమస్కరించి నాడు భారతీయు డానాడు.

విచారణ ప్రారంభమైనది. "ఆంగ్లేయు డొక భారతీయ వనితను భల్లూకమని భ్రమించి చంపినాడు. అతడు మానవులను మృగము లనుకొనుట తప్పన్నాడు తిలక్. అనవచ్చునా ! స్వదేశ ప్రభువులను నర్కసుమృగములనుట ద్రోహము. రామాయణము

చదువుట ద్రోహము. మేము రావణులమా! శివాజీనిగూర్చి పలుకుట దోషము." - ఇది సర్కారువారి వాదన సారాంశము.

తిలక్ చేసిన వేవియును తప్పులు కావనియు, మరాఠీ భాష రానివారు మహారాష్ట్ర రచనలను విమర్శించుట యర్థ రహితమనియు, వ్యాసకర్తలను విడిచి తిలకునే దోషిగ నిర్ణయింపదలచుట యక్రమమనియు, తిలకు న్యాయవాదియగు నాంగ్లేయుడు వాదించినాడు.

రాణిపై అభిమానము చూపకుండుటయే యామెను ద్వేషించుట యని సర్కారువారు వాదించినారు. నాదగ్గర డబ్బు లేదన్న, నేను ఋణపడియున్నానని యర్థము కాదుకదా! కాని, ఆంగ్లేయ న్యాయమూర్తి యటులే యర్థము చెప్పి, దయతో పదునెనిమిది మాసములు కఠినశిక్ష విధించినాడు. ఇది దుర్మార్గమని దేశీయ పత్రికలు ఘోషించినవి. అభిమానము లేక పోవుటయే యగౌరవపరచుట యనిన యా బుద్ధిమంతుని, ఆంగ్లేయ పత్రికలును విమర్శించినవి. బాలగంగాధరుడు లోకమాన్యుడైనాడు.

ఈ యభియోగములో నవసర మగునని రెండువేల రూపాయ లప్పుదీసినాడు తిలక్. తిలక్ సహాయనిధికై దేశమున 53000 రూపాయలు సేకరింపబడునని యాయన యూహింపనైన లేదు. తనపై ప్రజలకంత గౌరవాభిమానము లున్నవని తెలిసి తబ్బిబ్బైనాడు లోకమాన్యుడు.

తిలక్‌వంటి మహా విద్వాంసునకు కారాగారము తగదని మాక్సుముల్లర్ మున్నగు పాశ్చాత్య విద్వాంసులు ఘోషించిరి.

'మార్గ శీర్షము'ను గురించి తిలక్ చేసిన పరిశోధనచే వారెల్లరు నతనివిద్వత్తు నెరుగుదురు. ఆ యొత్తిడితో తిలకు నెరవాడ జైలుకుమార్చిరి. ఈమార్పు రహస్యముగ జరిగినది. త్రోవలో కల్యాణ్ స్టేషనులో తిలకు బండిదిగినప్పుడు, తమ ప్రియతమ నాయకుని చూచు నవకాశ మచటి ప్రజలకు గలిగినది. ఊరిలోని వారందరు తండోపతండములుగ వచ్చిచెరసాల దుస్తులలో నుండిన యా యెముకల ప్రోగునుగాంచి ద్రవించిపోయిరి. గడువింకను ఆరు నెల లుండగనే తిలకు విడుదలయైనాడు. ఆనాడు దేశము పసుపు కుంకుమ లలంకరించు కొనినది.

ఏదో యమర్యాద కరమగు క్షమాపణ కోరుకొని తిలక్ జైలునుండి వెలికివచ్చెనని మితవాదులు ప్రచారము చేసినారు. తిలకు కోపింపక వారితో సంఘీభావమునే యపేక్షించినాడు. ఐనను, వారి దురుసుతనము మాత్రము తగ్గలేదు.

కష్టజీవులను కాపాడదలపనినాడు కాంగ్రెసు ప్రయోజనము శూన్యమన్నాడరవిందఘోషు. "బర్మాలో కులభేదములు మున్నగునవి లేవుగదా, సంస్కరింప నవసరములేని యాబర్మీయుల కేమి యొరగబెట్టినా రాంగ్లేయు"లని ప్రశ్నించి, సంస్కరణ ప్రసంగములతో ప్రజలను మభ్యపెట్టరాదన్నాడు లోకమాన్యుడు. హసరత్ మొహానీ వంటివారు తిలకు కనుచరులైరి. హిందూ ముస్లిము సంఘీభావమునెడ తిలకు చూపినశ్రద్ధ యింతింతన వీలులేనిది. మతము మతమని తందానాలాడువారే కాని, దయతో ప్రమేయములేని మతమేముండును ? కరువు కాటకములలో. దిక్కులేని ప్రజలు పిడికెడుకూటికి మొగము

వాచినప్పుడు మత ప్రచారకులు ఆ నిర్భాగ్యులను తమ మందలో గలుపుకొందురు. దీనిచే దేవుడు ప్రీతిజెందడన్నాడు తిలకు. పూర్వ గ్రంథములను ఏ మతావేశపరుడును చదువడు. పూర్వ గ్రంథములను తరచిచూచుటయందు లోకమాన్యునకు ఆసక్తి, ఆర్యు లుత్తరధ్రువ ప్రాంతములలో నుండినప్పుడు వేదములను రచించిరనియు, ఆ కాలము 4000 B. C. అనియు నితడు పరిశోధించి సిద్ధాంతీకరించినాడు. ఇతని విద్వత్తునుజూచి విదేశ విద్వాంసు లాశ్చర్యపడినారు.

స్వాతంత్ర్యోద్యమములో స్వదేశీ ప్రచారమే ముఖ్యభాగ ముగ నుండవలెనని గ్రహించినాడు తిలకు. దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించుటకై పైసానిధిని (Paisa Fund) ఒకదానిని ప్రారంభించినాడు. సాంకేతికవిద్య గడించుటకు భారతీయ విద్యార్థులను విదేశములకు బంప నిశ్చయించినారు. విదేశీ శర్కర యుపయోగించుట దోషమని సనాతనులకు బోధించి, వారిచే బెల్లమునే యుపయోగింపజేసినాడు తిలకు. దేవాలయములలో మసీదులలో స్వదేశీప్రచారము మారుమ్రోగినది. "వందే మాతరం, అల్లాహో అగ్బర్" నినాదములతో భూ నభోంతరము దద్దరిల్లిపోయినది. కాజీ సైఫుద్దీన్ వంటి హైదరాబాదు పెద్దలు హిందూ ముస్లిము లొకే జాతివారని యుద్ఘాటించినారు. బెంగాలులోను శివాజీ యుత్సవము లుజ్జ్వలముగ సాగుచుండినవి. లయాకత్ హుసేన్‌ఖాన్ వంటి మౌల్వీలు శివాజీ యెడ భక్తి ప్రపత్తులు గనబరచినారు. కొరాను గ్రంథము నవమానపరచెనా, మసీదులను 

చేసెనని శివాజీని ద్వేషింపవలెను ? శివాజీ యుదాత్త పురుషు డనియు, గౌరవార్హుడనియు,— చరిత్రకారుడగు అబ్దుల్ కరీంఖాన్ చాటినాడు. 1906 లో జపాను దేశములోను నీ యుత్సవములు జరిగినవి.

ప్రజలలో జరుగు నీ జాతీయోద్బోధనమునకు, జాతీయ విద్య లేకుండుట యొకలోటుగ నుండినది. మన దౌర్భాగ్యస్థితికి కారణములను తెలుపని యీ చదువులేల ? మనజాతి నీతి ధ్వంస ముకాగా ఆత్మవిశ్వాస శూన్యుల మగుచున్నాము. గుమాస్తా లమై పరుల యన్యాయములకు తోడగుచున్నాము. మతమన నేమియో తెలియనందున గొంతులు కోసికొనుచున్నాము. అమెరికాలో స్వాతంత్ర్యమును గూర్చి పసిపిల్లలకును బోధింతురు. మనదేశములో ప్రజల పేరెత్తిననే రాజద్రోహ మగు చున్నది. సర్కారువారి ధనసహాయము పాఠశాలలకు లభింపదు. కావున, సర్కారుదయపై నాధారపడని జాతీయ పాఠశాలల నేర్పరపవలసిన యవసర మేర్పడినది. ఆ పాఠశాలలో బోధన మాతృభాషలోనే జరుగవలెనని తిలకు. మాతృభాషలో విద్యా బోధన యన్నతోడనే బహుభాషలుగల యీ దేశమున రాష్ట్ర భాష యేదనుప్రశ్న యుదయించినది. మన జాతీయభాష హిందీ యని 1905 లోనే లోకమాన్యుడు స్పష్టపరచినాడు. దేశమున కంతటికిని దేవనాగరలిపియే ప్రమాణమైనదన్నాడు. ప్రాంతీయ సంకుచితత్వము తగదని మందలించినాడు. ధరించునది ధర్మము; సహనములేనిది ధర్మముకాదు,—అని వివరించి సహన భావ మును చాటినాడు లోకమాన్యుడు.

ఇట్లు ప్రజోద్యమము ప్రబలమగుచుండు సమయమున వంగదేశ విభజనము జరిగినది. తూర్పు బంగాళములోని ప్రజలు బీదవారు. చదువుసంధ్యల విషయమునను పశ్చిమబంగాళ ప్రజల కన్న తక్కువవారే. ఈస్థితికి పశ్చిమబంగాళ ప్రజలే కారకులను భావమును కలుగజేయ దలపెట్టినాడు వైస్రాయి. కోట్లకొలది రూపాయల నేచేట దోచుకొని పోవుచున్న హృదయశూన్య రాజప్రతినిధి, తూర్పు బంగాళమువారిని జూచి మొసలికన్నీరు కార్చినాడు. బంగాళము విభజింపక తప్పదన్నాడు. ఎందుకు? తూర్పువారిని ఆర్థికముగ బాగుపరచుటకు కాదు. వారి యాకలిమంటల నార్పుటకును కాదు. వారి బిడ్డలకు చదువు సంధ్యలు నేర్పుటకా ; కానేకాదు. వారి దేశమునుండి పాన పిశాచమును పారద్రోలి వారి యిల్లాండ్ర హృదయక్షోభను అణ చుట కంతకన్నను కాదు. వారి చుట్టును గోడకట్టినచో వారి కేమి యొకగును ? ముస్లిములందరు నొకచో నుండినంత నేమి వచ్చును ? అందరును కట్టగట్టుకొని, ఆంగ్లేయులు దయతో కల్పించెడి కరవులలో అన్నము అన్న మని యంతరించి పోవచ్చును. ప్రజల కర్థమయినది యీ కుట్ర. ఒకటి రెండుచోట్ల మతకలహములు పొడసూపినను, ప్రజలందరు ఒక కట్టుగనే నిలిచి సర్కారు నెదిరించి గెలిచినారు.

కాంగ్రెసులోని మితవాదుల యడ్డంకులను తొలగించు కొనుటకై తిలకు, పాలు, అరవిందు లతివాదపక్షమును స్థాపించి నారు. అహింసాయుత సత్యాగ్రహము చేయవలెనన్నాడు తిలకు. రాజకీయములలో సత్యాగ్రహ భావమును (Passive

resistance) చొప్పించిన దితడే. త్యాగము వినా మార్గము లేదను భావము కలిగినది. "మీ విప్లవము రక్తరహితముగ నుండవలెను; ఐన, మీరు నలుగుడు పడనక్కర లేదని కాని, చెరకేగ నవసరము లేదని కాని భావము కాదు," - అని బోధించినాడు లోక మాన్యుడు. ఈ యుద్యమ సన్నాహమును జూచి సర్కారు వారు బెదరి మింటో-మార్లీ సంస్కరణలను ప్రతిపాదించినారు. ఈ కన్నిటితుడుపులకు తిలకు మోసపోవునా! అతని ధోరణియే యతనిది. ఎన్నికల కోలాహలమునుమించి సాగినది ప్రజోద్యమము. తిలకును చెరలో పెట్టినచో ఉద్యమమింకను బలపడునని సర్కారువారు దొంగకు తేలుకుట్టిన ట్లూరకున్నారు.

సూరతులో జరిగిన కాంగ్రెసుసమావేశము స్వరాజ్య సమరమున ముఖ్య ఘట్టము. అంతకు ముందు జరిగిన సమావేశములో "స్వరాజ్యమే ధ్యేయ" మని దాదాభాయి నౌరోజీ యధ్యక్షతన తీర్మానము చేయబడియుండ, సూరతులో దానిని చెడగొట్ట దలచినారు మితవాదులు. మాటలాడుటకు తన కవకాశము కావలెనని ముందుగ కోరుకొన్నాడు తిలకు. మితవాది డాక్టరు రాసవిహారీఘోష్ అధ్యక్షత వహింపవలసినదిగ సురేంద్రనాథబెనర్జీ, మోతీలాలులు కోరి ప్రసంగించినారు. తిలకు కేల్కారుచే నిచ్చిపంపిన విజ్ఞప్తికి బదులురాలేదు. బలవంతముగ నిట్లు నోరుమూసినచో తిలకూరకుండునా! వేదికనెక్కి నిలిచినాడు. అధ్యక్షస్థానము నధిష్ఠించిన రాసవిహారిఘోషు తిలకుతో నేమో చెప్పబోయినాడు. అట్లు చెప్పు నధికారము ఘోషుకు లేదనియు, ఘోషు ఎన్నిక చెల్లదనియు తిరస్కరించినాడు

మహారాష్ట్రకేసరి బాలగంగాధరుడు. ఎవరో సురేంద్రనాథ బెనర్జీపై చెప్పు విసిరినారు. అది ఫిరోజిషామెహాతాను కూడ స్పృశించినది. కుర్చీలు, బల్లలు విచ్చలవిడిగ ఆకాశయానము చేసినవి. సూరతు కాంగ్రెసు అల్లరితో అంతమయినది. మితవాదుల మిడిసిపాటును చాలవరకు చల్లబడినది.

తిలక్‌ను దేశద్రోహి యన్నారు మితవాదులు. దీనితో అతివాదులు మరింత యతివాదులైనారు. దేశమెల్లెడ, జాతీయ పక్షము (Nationalist Party) అను పేరుతో నీయతివాదపక్షము బలపడినది.

"స్వరాజ్యము నా జన్మహక్కు; అది పొందితీరెదను"— అని చాటినాడు తిలకు. దేశమెల్లెడ నీనినాదము ప్రతిధ్వనించినది. కల్లుపాకలకడ సత్యాగ్రహము జరిగినది. సత్యాగ్రహులయెడ అధికారుల ప్రవర్తనగూర్చి, డాక్టరు భండార్కరువంటివా రసహ్యాము ప్రకటించిరి. ఆ విషయమై గవర్నరుతో మాటలాడ నెంచినాడు తిలక్. గవర్నరును అందుకు సమ్మతించినాడు. కాని, ఇంతలో, లోకమాన్యుడు బంధింపబడినాడు.

1908 వ సంవత్సరము ఏప్రెలు 30 వ తేదీని బెంగాలులో ముజఫర్‌పూర్ దగ్గర నొక యాంగ్లేయుల బండిమీద కుదీరామ్‌బోస్, ప్రఫుల్లచాకీ యను యువకులు బాంబువేసినారు. ఆ బండిలో జిల్లా యధికారి కింగ్స్‌ఫోర్డ్ (Kingsford) ఉన్నాడని వారనుకొన్నారు. దురదృష్టవశమున, ఆబండి భారతీయుల కనుకూలురగు ఆంగ్లేయులదైనది. చాకీ తన్నుతాను కాల్చుకొని మరణించినాడు. కుదీరామ్‌బోసును ప్రభుత్వ మురితీసినది.

ఈ బాంబు ప్రయోగమును లోకమాన్యుడు గర్హించి నాడు. ఆంగ్ల ప్రభుత్వ విధానమే యీ యరాజక చర్యలకు కారణమైనందున సర్కారువారి మనస్తత్వము మారవలె నన్నాడు. "ఊరక ప్రజల నురికంబముల కెక్కించినచో మరింత యలజడి రేగును. నిరాయుధులైన ప్రజలపై తుపాకులతో విరుచు కొనిపడు దొరలకు నొప్పియన నేమియో బాంబు మూలమున నర్థమయి యుండు"నని తిలకు వ్రాసినాడు. ఇది సర్కారువారికి సహింపరానిదైనది. తిలకు బంధింపబడినాడు.

మహమ్మదాలీ జిన్నా తిలకు న్యాయవాది. పూర్వము తిలకుకు న్యాయవాదిగ నుండిన దావరు న్యాయమూర్తి. జామీ నీయనన్నాడతడు. రాజునుమించిన రాజసేవాసక్తుడు, పాపము! తిలకుపై తెచ్చిన యభియోగములో తిలకు చేసిన తప్పేమియో సూచింపబడలేదు. లేనితప్పును గూర్చి తిలకెట్లు మాటాడగలడు? ఈ దుర్మార్గము తగదన్నాడు బాలగంగాధరుడు. నినెడి నాథు డెవడు? తానే వాదింపదలచినాడు. తనకును, దేశమునకును సంబంధించిన విషయము లెల్లను వివరించినాడు.

కుదీరామ్‌బోస్ నురి తీసినంత మాత్రాన నరాజకము చావదనుట లోక పరిస్థితిని సర్కారువారికి విన్నవించుటయే కాని, బోసును సమర్థించుటకాదు. బాంబుపడిన నాటి నుండి ప్రభుత్వపు టుత్తరువు ప్రకారము కిరసనాయిలుకూడ ప్రమాదకర వస్తువే యయినది. దీనిని విమర్శించుటకు బాంబును గూర్చిన విజ్ఞానము కొంత యవసరము. ఆ విషయమును తెలియదలచు టలో ద్రోహ మేమియు లేదు.

దేశనాయకులను "వీధులలో పాకీవారిచే కొరడాలతో కొట్టింపవలె" నని 'ఇంగ్లీషు మ్యాన్' (English man) అను పత్రికలో వ్రాసినారు.

"కింగ్స్‌ఫోర్డు (Kingsford) మంచి షికారీ. ఆతని 'సంచి' దండిగ నుండునట్లు చేసికొనగలడని యాశించుచున్నాము. మాకా యవకాశము లేదేయని యసూయ పడుచున్నాము"- అని భారతీయులను పిట్టలనువలెకాల్చివేయవలెనని ఏషియన్ (Asian) అను పత్రిక యుద్బోధించినది.

అవి వ్రాసినవా రెవ్వరును ద్రోహులుకారు; హంతకులు కారు! సత్యమునుపలికి, అహింస నుపదేశించిన లోకమాన్యుడు మాత్రము దుర్మార్గుడైనాడు!

వర్గకలహములు లేవదీసినవారిని శిక్షించుటకై యేర్పర చిన చట్టము ప్రకారము తిలకును బంధించిరట! ఏయే వర్గములకు పోరాటము? వర్గములే లేనినాడు వర్గకలహమేమి?

అయిదు రోజులలో, నిరువదియొక్క గంటలసేపు వాదించినాడు తిలకు. ప్రపంచ మాశ్చర్యపడినది. కాని యేమి లాభము? దయతో దావరుప్రభువులవారు ఆరేండ్లు ప్రవాస శిక్ష విధించినారు, లోకమాన్యునకు.

"ప్రాడ్వివాకు లేమిచెప్పినను, నేను నిర్దోషినేయని మాత్రము చెప్పదలచినాను. సకలవస్తు స్థితిగతులపై నాధిపత్యము వహించు ఉన్నతశక్తులు వేరే యున్నవి. నేను స్వతంత్రుడుగ నుండునప్పటికంటె, కష్టపడునప్పుడే నాయుద్యమ ధ్యేయము

ఈ బాంబు ప్రయోగమును లోకమాన్యుడు గర్హించినాడు. ఆంగ్ల ప్రభుత్వ విధానమే యీ యరాజక చర్యలకు కారణమైనందున సర్కారువారి మనస్తత్వము మారవలెనన్నాడు. "ఊరక ప్రజల నురికంబముల కెక్కించినచో మరింత యలజడిరేగును. నిరాయుధులైన ప్రజలపై తుపాకులతో విరుచుకొనిపడు దొరలకు నొప్పియన నేమియో బాంబు మూలమున నర్థమయి యుండు"నని తిలకు వ్రాసినాడు. ఇది సర్కారువారికి సహింపరానిదైనది. తిలకు బంధింపబడినాడు.

మహమ్మదాలీ జిన్నా తిలకు న్యాయవాది. పూర్వము తిలకుకు న్యాయవాదిగ నుండిన దావరు న్యాయమూర్తి. జామీనీయనన్నా డతడు. రాజునుమించిన రాజసేవాసక్తుడు, పాపము! తిలకుపై తెచ్చిన యభియోగములో తిలకు చేసిన తప్పేమియో సూచింపబడలేదు. లేనితప్పును గూర్చి తిలకెట్లు మాటాడగలడు? ఈ దుర్మార్గము తగదన్నాడు బాలగంగాధరుడు. నినెడి నాథుడెవడు? తానే వాదింపదలచినాడు. తనకును, దేశమునకును సంబంధించిన విషయము లెల్లను వివరించినాడు.

కుదీరామ్‌బోస్ నురి తీసినంత మాత్రాన నరాజకము చావదనుట లోక పరిస్థితిని సర్కారువారికి విన్నవించుటయే కాని, బోసును సమర్థించుటకాదు. బాంబుపడిన నాటి నుండి ప్రభుత్వపు టుత్తరువు ప్రకారము కిరసనాయిలుకూడ ప్రమాదకర వస్తువే యయినది. దీనిని విమర్శించుటకు బాంబును గూర్చిన విజ్ఞానము కొంత యవసరము. ఆ విషయమును తెలియదలచుటలో ద్రోహ మేమియు లేదు.

దేశనాయకులను "వీథులలో పాకీవారిచే కొరడాలతో కొట్టింపవలె" నని 'ఇంగ్లీషు మ్యాన్' (English man) అను పత్రికలో వ్రాసినారు.

"కింగ్స్‌ఫోర్డు (Kingsford) మంచి షికారీ. ఆతని 'సంచి' దండిగ నుండునట్లు చేసికొనగలడని యాశించుచున్నాము. మాకా యవకాశము లేదేయని యసూయ పడుచున్నాము"- అని భారతీయులను పిట్టలనువలె కాల్చివేయవలెనని ఏషియన్ (Asian) అను పత్రిక యుద్బోధించినది.

అవి వ్రాసినవారెవ్వరును ద్రోహులుకారు; హంతకులు కారు! సత్యమునుపలికి, అహింస నుపదేశించిన లోకమాన్యుడు మాత్రము దుర్మార్గుడైనాడు!

వర్గకలహములు లేవదీసినవారిని శిక్షించుటకై యేర్పరచిన చట్టము ప్రకారము తిలకును బంధించిరట! ఏయే వర్గములకు పోరాటము? వర్గములే లేనినాడు వర్గకలహమేమి?

అయిదు రోజులలో, నిరువదియొక్క గంటలసేపు వాదించినాడు తిలకు. ప్రపంచ మాశ్చర్యపడినది. కాని యేమి లాభము? దయతో దావరుప్రభువులవారు ఆరేండ్లు ప్రవాస శిక్ష విధించినారు, లోకమాన్యునకు.

"ప్రాడ్వివాకు లేమిచెప్పినను, నేను నిర్దోషినేయని మాత్రము చెప్పదలచినాను. సకలవస్తు స్థితిగతులపై నాధిపత్యము వహించు ఉన్నతశక్తులు వేరే యున్నవి. నేను స్వతంత్రుడుగ నుండునప్పటికంటె, కష్టపడునప్పుడే నాయుద్యమధ్యేయము

అనుకూలమగునట్లు దైవనిర్ణయమై యుండును," - అన్నాడు లోకమాన్యుడు.

తర్వాతి దినము తిలకు జన్మదినము.

"మోసముచేసి తిలకు స్వాతంత్ర్యము నరికట్టినా"రని మాంఛెస్టరు గార్డియను పత్రిక వ్రాసినది. "న్యాయస్థానము లన్యాయస్థానములైన"వని కలకత్తాలోని "ముసల్మాన్" పత్రిక యాక్రోశించినది. "మానవ చరిత్రయందెందును ఇట్టి నీచులు, ఘాతుకులు కానరారు,"(A viler set of ruffians never degraded the records of mankind,) అని లండనులోని "సమదర్శిని" (Justice) పత్రికలో హిండ్ మన్ (Hyndman) అను నాంగ్లేయుడు వ్రాసినాడు.

బొంబాయి నగరములో నల్లరులు రేగినవి. "ఛత్రపతి తిలక్ మహారాజ్ కీ జై" యను నినాదములు ప్రజాహృదయము లను బ్రద్దలు చేసినవి. పోలీసుల తుపాకులు ప్రజలను బలిగొన్నవి. మిల్లుకూలీలు సమ్మెచేసినారు. వారిని పనిలోనికి పంపవలెనని ఎడ్వర్డ్స (Edwards) అనునతడు ప్రయత్నింప, "తిలకు మహారాజేడీ" యని వారడిగినారు. తమ క్షేమముకుకోరి త్రాగుడు మాన్పుడని ప్రభుత్వమును కోరిన నాయకునకు ఆరేండ్లు ప్రవాస శిక్షయని తెలిసి విలవిల విలపించినారా దరిద్రనారాయణులు.

తిలకును మాండలే జైలు కంపినారు. అతని విడుదలకై కొందరు ప్రయత్నించిరి. రాజకీయ జీవితమునుండి విరమించు కొన్ననే యది సాధ్యమగునన్నది ప్రభుత్వము. ఎవరి దయా దాక్షిణ్యములును నవసరములేదు; ఆరేండ్లును పూర్తియయిన

తర్వాతనే వెలికి వచ్చేదనన్నాడు లోకమాన్యుడు. ఇంతలో తిలకు భార్య మరణించెనను విషాదవార్త వచ్చిపడినది. కష్టము లెన్నియైన నెదుర్కొనును స్థితప్రజ్ఞుడుకదా గంగాధరుడు! భగవద్గీతకు వివరణము వ్రాయ మొదలిడినాడు. సర్కారువారితో ప్రజలు కలియవలెనని, తిలకు జైలులో మగ్గునప్పు డన్నాడు గోపాలకృష్ణగోఖలే.

గడువు పూర్తియగుటకు కొన్ని వారములు ముందుగ, తిలకును రహస్యముగ గొనివచ్చి, పూనాలో నాతని యింటి ముందు విడిచి పోయినారు పోలీసులు. అది కాళరాత్రి. కావలివా డడ్డగించినాడు. తన యింటిముందరనే తనకీకష్టము. అప్పుడక్కడ అతనిని చూచి యెల్లరు నాశ్చర్యపడినారు. మరునా డూరిలో జరిగిన సంబరమునకు హద్దులులేవు.

హోం రూల్ లీగ్ (Home-rule League) స్థాపింపబడినది. బెసెంటు, తిలకు లందు ముఖ్యులు. అధికారము ముస్లిముల హస్తగతము చేసినను తనకు సమ్మతమేనన్నాడు లోకమాన్యుడు. ఆలీ సోదరులును, జిన్నాయును తోడైనారు. మతకలహములకు ప్రభుత్వపు కుట్రలే కారణమన్నాడు మహమ్మదాలీ జిన్నా. మదరాసులో నుండిన సర్ సుబ్రహ్మణ్య అయ్యర్ తన సర్ బిరుదమును త్యజించినాడు. ఇంతలో యుద్ధము వచ్చినది. తర్వాత మాంటేగు - చెమ్సుఫర్డు సంస్కరణలు ప్రకటింపబడినవి. సూర్యుడులేని యుషస్సువంటి సంస్కరణలు అన్నాడు తిలకు. ఎనిమిదణాల స్వరాజ్యమడుగ ఒకయణా బాధ్యతాయుత ప్రభుత్వ మిచ్చెద మన్నారు సర్కారువారు.

బాధ్యతాయుతమన్న నర్థ మెవ్వరికిని దెలియదు. స్వరాజ్యమును గూర్చి యేమైన ప్రస్తావనయున్నచో నంగీకరింపవచ్చునన్నాడు తిలకు. అయిదు సంవత్సరములలో ప్రభుత్వము స్వాధీనము కావలెనన్నాడు దేశబంధు చిత్తరంజనదాసు.

మాంటేగు - చెమ్సుఫర్డు సంస్కరణల నాంగ్లేయు లామోదింప వలెనని పిచ్చిపిచ్చిగ మాటాడజొచ్చినారు మితవాదులు. ఆంగ్లేయుల ప్రతిపాదన నాంగ్లేయు లామోదించుట యేమి? అట్లు బ్రిటిషువారిని కోరుటకై యా దేశమునకు తరలినారు మితవాదులు.

హోంరూల్ లీగ్ **(Home-rule League)** వారుకూడ నాంగ్లదేశమున ప్రచారము చేయదలపెట్టినారు. మూడువారములలో నొకటిన్నర లక్షరూపాయలు సేకరించినారు. ధనవంతునికడ రూపాయ తీసికొనుటకంటె అరువది నలుగురు దరిద్రులనుండి యరువదినాలుగు కానులు సేకరించుటయే తనకు సంతోషమన్నాడు దరిద్రనారాయణ సేవకుడు లోకమాన్య బాలగంగాధరుడు. ప్రయాణానుమతి పత్రము లొసగబడినవి. మదరాసులో, దివ్యజ్ఞానసమాజ ప్రాంగణమందలి వటవృక్షము క్రింద బ్రహ్మాండమైన విందు పర్వాటైనది. ఆంధ్రప్రజా సంఘము **(Andhra People's Union)** మహాజనసభ - మున్నగు సంఘము లెన్నియో తిలకుకు సమ్మానపత్రము లొసగినవి.

ఈ దేశమునకు స్వరాజ్య మొసగనిచో, ఇంగ్లీషువారి సామ్రాజ్యమే కూలిపోగలదని గర్జించినాడు లోకమాన్యుడు.

అక్కడనుండి సింహళద్వీపమున కరిగినారు. అక్కడి

ప్రజల కోలాహలము పట్టశక్యముగా లేదు. ఇంతలో, ఆంగ్లదేశమునకు తిలకును రానీయజాలమను వార్త ఇంగ్లండునుండి వచ్చినది. రవి యస్తమింపని యాంగ్ల సామ్రాజ్య రక్షణశాఖకు భారత దేశమునుండి వచ్చు అయిదుగురు నిరాయుధుల యాత్మశక్తి, అహింసాత్మకశక్తి - భరింపరానిదైనది. అట్టి ఓటి ప్రభుత్వమెన్నినాళ్ళు సాగును ?

దేశములో జరిగిన హత్యలకు తిలకే కారకుడని 'చిరోలు' అను నాంగ్లేయు డొకపుస్తకములో వ్రాసియుండ, ఆతనిపై లండను న్యాయస్థానమున చర్య గైకొనవలెనని తిలకు ప్రయత్నించి యుండినాడు. ఆ 'చిరోలు' వ్యవహారమునకైనను తాను లండను పోకతప్పదన్నాడు తిలకు. వీలు కాదన్నారు దొరలు.

మహమ్మదాలీజిన్నా యధ్యక్షతన జరిగిన బ్రహ్మాండమైన సభలో నీ యన్యాయము ఖండింపబడినది. చెప్పుడుమాటలు విను వారేకాని సర్కారువారు నిజమారయువారు కారని ప్రభుత్వ చర్యను గర్హించినాడు జిన్నా. ఏమైనను, తిలకు వెనుదిరగక తప్పినదికాదు.

అప్పుడే, జస్టిసుపార్టీ ప్రముఖుడగు డాక్టరు నాయరు ఆంగ్లదేశమున కేగుట కంగీకరించినారు సర్కారువారు. కనుక తిలకుపై నిర్బంధమును కూడ తొలగింపక తప్పినదికాదు. తిలకు లండను చేరినాడు. విదేశములలో భారతదేశ స్థితినిగూర్చి వివరములు తెలుపబూనినాడు. కార్మిక పక్షమువారు పార్లమెంటులో ప్రభుత్వ వ్యతిరేక పక్షము స్థాపించినారు. అది యానందకర విషయమేకదా! లండనులోని మితవాదులతోక

క_త్తిరింపబడినది. ఆంగ్లేయులు తిలకుని వేనోళ్ళ శ్లాఘించినారు. నిపుణులగు భారతీయ శిల్పుల చేతివ్రేళ్ళ నాంగ్లప్రభువులు తెగ గొట్టిరనువార్త వారికి ఆఘాతమైనది. నీతిగలవారెవరైనను రాక్షసచర్యల నసహ్యించుకొందురుగదా !

బొంబాయిసర్కారువారి మద్దతుతోనే చిరోలు గ్రంథము రూపుదిద్దుకొన్నది. ప్రభుత్వ కార్యదర్శి (Secretary of State) అయిన మార్లీదొరగారు కృతిభర్తలు. ఆ ఘనకృతికి బహూకృతిగ చిరోలుకు బిరుదమును గూడ నొసగినా డాంగ్లచక్రవర్తి. అట్టి చిరోలుపై చర్యయనగనే దొరతనమువారికి గంగవెర్రు లెత్తినవి. మేయబోయి మెడకు దగిలించుకొనినట్లయినది.

చిరోలుకిచ్చిన సర్కారుపత్రములు తనకును చూపింపవలె నని యభియోగసమయమున తిలకు కోరినాడు. అది న్యాయ సమ్మతమైన కోర్కె. కాని, తిలకుచేతిలో నా కాగితములు పడినచో సర్కారుగతి యేమగును ? సూది పోయినదని సోదెకు పోగా ప్రాతతప్పులన్నియు బయటపడిన ట్లగునుకదా !

ఉద్యోగమునుండి విరమించిన యాంగ్లేయు లందరు తిలకుకు వ్యతిరేకముగ సాక్ష్య మీవలెనని బొంబాయి ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శి రహస్యముగ సందేశమంపినాడు.

దొంగసాక్ష్య మిచ్చుటయే జీవికగాపెట్టుకొన్న గణు వైద్యుడను వానిచే తిలకుకు విరుద్ధముగ సాక్ష్య మిప్పింపదలచి నారు. సాక్షిగా బోనులో నిలిచిన యా దుర్మార్గునకు కన్నుల వెంట నీరు తిరిగినది. గుండె దడదడ కొట్టుకొన్నది. విషసర్ప మైనను పడగవంచి ప్రక్కకు జారిపోవలసినదే. సాధుపుంగవు

నకు, అజాతశత్రునకు, లోకమాన్యునకు, - ద్రోహము చేయుట కే హృదయ మంగీకరించును ? గణువైద్యుని శరీర ముడికెత్తి పోయినది. తిలకుమహారాజు ధర్మమూర్తి, ఏపాపమును చేయ జాలని పసిబిడ్డ, ఆయన నిర్దోషి,- యని ఘోషించినాడు సర్కారు వారి సాక్షి గణువైద్యుడు.

న్యాయమూర్తి డార్లింగు. బెంగాలు హత్యలకు తిలకు కారకుడని చిరోలు (సర్కారువారి) ఆరోపణ. మరాటీభాష తెలి యని వంగదేశీయులను, కేసరిపత్రికలోని మరాటీవ్యాసము లుద్రేకపరచినవనుట యర్థరహితమని తిలకు. హత్యలకు కారణ మచ్చటి పరిస్థితులేకాని, తన వ్రాతలుకావని స్పష్టపరచినాడు. కాని చిరోలుపక్షమే గెలిచినదనియు, ఖర్చులుకట్టి యీవలె ననియు ప్రకటించినాడు న్యాయమూర్తి. ఎక్కడనుండి తెచ్చి యీయగల డా దరిద్రనారాయణుడు !

భారతదేశ మాక్రోశించినది. తిలకు సహాయనిధి యేర్పా టైనది. నిధి నేర్పాటుచేయుట బిచ్చమిచ్చుట గాదనియు, ప్రతి భారతీయునకు నది విధి యనియు నుద్ఘోషించినాడు మహాత్మా గాంధీ. సరోజినీనాయుడు మున్నగువారు నిధిసేకరణలో నిమ గ్నులైనారు. తిలకు ఋణవిముక్తుడై, స్వదేశమునకు మరలి నాడు.

ఆంగ్ల న్యాయమూర్తి యసమర్థతయే బయటపడినది కాని, తమ దోషముకాదని మిత్రుల నోదార్చినాడు తిలకు. చిరోలు పుస్తకమును ప్రభుత్వమువారు తమ యుద్యోగు లందరకు పంచిపెట్టి తృప్తిపడినారు.

తిలకు ఆంగ్లదేశములో నుండినప్పు డిక్కడ జరిగిన ఘోర కార్యములకు మితిలేదు. జలియన్‌వాలాబాగ్ అను తోటలో, దారులు అడ్డగించివైచి యచ్చటిప్రజలను, గోడలపై నిలుచుకొని పటపటకాల్చి చంపినవి పశుస్వభావులైన ప్రభువుల పటాలములు. దేశము ఘూర్ణిల్లినది. క్రూరశాసనములను ధిక్కరించినాడు మహాత్ముడు.

ఆ కష్టసమయములో తాను విదేశములో నుండవలసి వచ్చెనేయని బాధపడినాడు లోకమాన్యుడు. తనకు దక్కనీయకుండ, కష్టమంతటిని అనుభవించిన మహాత్ముడు స్వార్థపరుడని కలుషించినాడు తిలకు.

జాత్యైక్యమునకు శ్రమించిన మహానాయకుడు గంగాధరుడని, ఆ వృద్ధకేసరికి, శ్రద్ధానందస్వామి అమృతసర కాంగ్రెసు ఆహ్వానసంఘాధ్యక్షస్థానముననుండి శ్రద్ధాంజలి సమర్పించినాడు.

ఖిలాఫతు విషయమై ముస్లిము లోక నిర్ణయమునకు వచ్చినచో, ఆ నిర్ణయము నెల్లరు నాచరణలో పెట్టగలరన్నాడు తిలకు.

ఖిలాఫతు విషయమును గురించియు, జలియన్‌వాలాబాగ్ దురంతములను గురించియు, దేశవ్యాప్తమగు ఉద్యమము లేవదీయుటకు మహాత్ముడు బద్ధకంకణుడైనాడు. ప్రజాక్రోధాగ్నిపర్వతము లేక్షణమున బ్రద్దలగునో తెలియని ప్రమాదస్థితి యది. ఆగస్టు 1 వ తేదీన సత్యాగ్రహము ప్రారంభించెదనని విప్లవశంఖమును పూరించినాడు వీరకేసరి గాంధీ. విజయావేశముతో దేశ ముత్తూతలూగిపోయినది.

సమరసన్నాహము లిట్లత్యుద్ధృతగతిలోనుండ, తనశక్తిని గూడ మహాత్మున కొసంగదలచినట్లు, లోకమాన్యుడు 1920 సంవత్సరము జూలై ముప్పదియొకటవతేదీన కన్నుమూసినాడు.

నలుబది సంవత్సరములు దేశము మూలమూలల ప్రజ్వలించిన విప్లవజ్యోతి యారిపోకుండ నందుకొన్నాడు మహాత్ముడు మోహనదాసు కరమ్‌చంద్ గాంధీ. లోకమాన్యుని యుద్యమము సఫలముచేయు మహాదృష్టము ఆ మహాత్మునకు దక్కినది.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానమ్ సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అని యవసానమునకు మూడురోజులముందు భగవద్గీతను చేతబుచ్చుకొని పలికినాడట తిలక్ మహారాజు.

"ప్రజలు - కాంగ్రెసు - సమావేశము - ఖర్చులు - ప్రభుత్వపు గులాములు"- అనుచు నేమేమో కలవరించినాడట.

"స్వరాజ్యము లేనిచో భారతదేశము బాగుపడదు. స్వరాజ్యము మన జీవితమున కాధారము" - అనునవి మన మహానాయకుని కడపటి పలుకులు.

తర్వాత రెండుదినములు స్మారకమే లేదు. ముప్పదియొకటవ తేదీ రాత్రి 12-30 గంటలకు "లోకమాన్యు డికలే" దని వైద్యులు ప్రకటించినారు.

కన్నీరు కాలువలు కట్టినది. ఆకాశము అవురుమన్నట్లు కుండపోతగ వర్షము కురిసినది. తెల్లవారులోగా ఇంతపని యగు

నని యెవరనుకొన్నారు! బొంబాయినగరము భోరుమన్నది. లక్షలప్రజ లా మహనీయమూర్తి మాన్యశరీరమును దర్శింపవలె నని గుమికూడినారు.

లోకమాన్యుని శరీరమును వహించుటకై మహాత్ముడు కేలొగ్గినాడు. ఆయన బ్రాహ్మణుడు కాడని యెవరో యాటంక పరచినారు. జాతిపితకా యీ యాటంకములు! లోకమాన్యుడు బ్రాహ్మణ మాత్రుడేనా! మరల నందుకొన్నాడు మహాత్ముడు. డాక్టరు సైఫుద్దీన్ కిచ్లూ, మౌలానా షౌకతాలీలుకూడ ఆ యదృష్టమునకు నోచుకున్నారు.

చౌపత్తీ సైకతములలో చందనపు కట్టెలలో లోకమాన్యుని భౌతికశరీరము భస్మీభూతమై పోవుచుండ "తిలక్ మహారాజ్ కీజై, తిలక్ మహారాజు అమరుడు"- అన్న నినాదము లాకసమును బ్రద్దలుచేసి స్వర్గమునకు మార్గము కల్పించినవి.

తిలక్ వెలిగించిన సేవాజ్యోతి నీవు బ్రతికియున్నంత వరకును నేను బ్రతికియున్నంతవరకు నారిపోనీయరాదు.

నవయుగ నిర్మాత

# కందుకూరి వీరేశలింగము

## 1

సుమారు నూరేండ్లకు ముందటిసంగతి. రాజమహేంద్ర వరమున ఉన్నత పాఠశాలావిద్యార్థులు నలుగురైదుగు రొక జట్టుగా కలిసి తిరుగు చుండెడివారు. వారు కంటబడినపుడెల్ల నా పట్టణపు పెద్దలు కొందరు "మీటింగువాళ్ళు వీళ్ళేనట్లో" యని వ్రేలెత్తి చూపి పరిహసించుచుండిరి. ఆ బాలురు దుర్మార్గులందమా! కాదు. మరి వారిది రౌడీలముఠా యందమా? అదియు కాదు. ఉత్తమగ్రంథ పఠనము, విజ్ఞానవిషయ చర్చ, ఆధ్యాత్మికజిజ్ఞాస, భగవదుపాసన మొదలగు నుదాత్తాశయములతో నా విద్యార్థులు, సాయంసమయములం దొకచోట సమావేశమగు చుండుటయే వారి దోషము. ఈ మాత్రమునకే ఆ కాలమున రాజమహేంద్రవర పురప్రముఖులు వారిని చురచుర చూచి దుమ్మెత్తి పోయుచుండిరి.

ఆ బాలబృందమునకు ముఖ్యు డొక విశిష్టవ్యక్తి. బలహీనుడు, బక్కచిక్కినవాడు, పీనసరోగ పీడితుడునైన యా బాలనాయకుడు గాలికి వెల్లకిల పడున ట్లుండెడివాడు. ఐనను, అతడెంతటి బలహీనుడో అంతటి బుద్ధిమంతుడు. ఎంతటి రోగపీడి

తుడో అంతటి ధృఢమనస్కుడు. ఎంతటి శుష్కాంగుడో అంతటి కార్యశూరుడు. ఆ బాలగోష్ఠి కతడే వెలుగు. పేరు కందుకూరి వీరేశలింగము. ఆ పట్టణమునందే 1848 వ సంవత్సరము ఏప్రెల్ 16 వ తారీఖున జన్మించినాడతడు. పున్నమ, సుబ్బరాయడు-అను పుణ్యాదంపతు లతని మాతాపితలు. తాతల పేర్లు మనుమలకు బెట్టుట మన దేశమున సంప్రదాయముకదా! ఏకైక పుత్రుడైన ఇతనికి, వీరేశలింగమను పితామహుని నామధేయమే ప్రాపించినది. తాతయగు కందుకూరి వీరేశలింగము మనుమని పుట్టుకకు పూర్వమే పరలోకగతుడైనాడు. తాత గొప్పగా జీవించిన వ్యక్తి. అతడు గడించిన ఆస్తిపాస్తులు, చేసిన దానధర్మములు, కట్టించిన మేడ మున్నగునవి ఆ ప్రాంతమున ప్రఖ్యాతి నంది యుండినవి.

పాతికేండ్ల ప్రాయమపుడు, మన వీరేశలింగము పడవలో ధవళేశ్వరమునకు పోవుచుండ ప్రయాణ మాలస్యమైనది. మండు వేసవి, మిట్టమధ్యాహ్నము నగుటచే నతడు పడవను గట్టునకు చేర్పించి, సమీపమున నున్న కుగ్రామము చేరి, భోజన సౌకర్యము కొరకు వాకబు చేసెను. ఆ గ్రామమున కరణము గారి యిల్లు తప్ప వేరొక బ్రాహ్మణ గృహము లేదు. రామాయణ పారాయణమున మునిగియుండిన ఆ గృహస్థుని దర్శించి, "భోజనార్థము వచ్చితి"నని వీరేశలింగము చెప్పెను. అందులకా గృహస్థుడు, ఎదుటనున్న అతిథిని ఆపాదమస్తకము వీక్షించి, గొంతు సవరించుకొని, తమయింట వంటయింకను కాలేదనియు, ఐయుండినను తాము డబ్బు పుచ్చుకొని అన్నము పెట్టువారు

కారనియు, ఊరక పెట్టుటకు తమయిల్లు సత్రముకాదనియు, ధనము గైకొని అన్నముపెట్టు పూటకూటిల్లు ఆయూర లేద నియు, అందుచే వేళ మించకముందే మరొక గ్రామము చేరుట మంచిదనియు, గుక్కవిడువకుండ హితోపదేశము చేసెను. ఆ మాట విని తిరిగిపోనున్న వీరేశలింగమును చూచి, రామాయ ణార్థము చెప్పుచుండిన వృద్ధబ్రాహ్మణుడు "మీ యింటిపేరే" మని ప్రశ్నించెను. 'కందుకూరివా'రని యతడు చెప్పగా, "కీర్తి శేషులైన కందుకూరి వీరేశలింగముగారు మీకు బంధువులా ?" అని అతడు మరల ప్రశ్నించెను. "వారు మా తాతగారే" యని వీరేశలింగము చెప్పగనే వారిద్దరును తమ పీటలనుండి లేచి, వీరేశ లింగమునకు పీటవైచి, అతనితాతగారు తమకెంతో సహాయము చేసినవారని కీర్తించి, తామెరుగకచూపిన యనాదరణకు క్షమాప ణలు చెప్పుకొనిరి. అనతి కాలముననే అతిథికి షడ్రసోపేతమగు విందు జరిగినది. పితామహుడగు కందుకూరి వీరేశలింగము గారి కీర్తిప్రతిష్ఠ లట్టివి. అట్టి సద్వంశమున బుట్టిన యదృష్టవంతుడు మన వీరేశలింగము.

పుట్టుకతోడనే అనారోగ్యమును వెంటబెట్టుకొని వచ్చిన వాడు వీరేశలింగము. బ్రతుకగలడన్న నమ్మకము తల్లికిని మొదట నుండినదికాదట. పురిటిలో నొకదినమంతయు కాలు సేతులు కదలింపక నిర్జీవ ప్రతిమవలెనున్న కొడుకుపై కన్నతల్లి ఆశలు వదలుకొని కన్నీరు కార్చినది. ఆరునెలల ప్రాయమపుడు మశూచి వచ్చియు, ఏ దైవ బలముననో కాని, మరణదేవత ఆతనిని మన్నించిపోయినది. ఐదేండ్ల ప్రాయమునాడు తల్లితో

కూడ పొరుగూరికి పల్లకిలో పోవుచుండ, బాలుడు గోదావరి కాలువలో జారిపడెనట. పల్లకి మోయుచుండిన బోయీలలో నొకడు బాల వీరేశలింగమును గంగపాలు గాకుండ రక్షించి నాడు. ఇన్ని గండములు గడచి బ్రతుకుట దైవసంకల్పము కాక మరేమి? లోకోపకారార్థ మవతరించిన యీ మహ నీయునకు సంపూర్ణాయువు దైవప్రసాదము.

వీరేశలింగమునకు నాలుగేండ్లు నిండకమునుపే తండ్రి మరణించినాడు. అనపత్యుడైన పెదతండ్రి వేంకటరత్నము కందుకూరి వంశమునకు వెలుగైన యీ ఏకైక పుత్రుని అల్లారు ముద్దుగ పెంచుచుండెను. వీరేశలింగమునకు చిన్ననాటి గురువు పులిపాక అమ్మిరాజుగారు, తొట్టి నోటివాడగుటచే నతడు ముక్కుతో మాటలాడెడివాడు. బాల్యచాపల్యముచే గురువు గారి మాటలను వెక్కిరించుచుండుటవలన వీరేశలింగమునకు ముక్కుమాటలే మొదట పట్టుబడినవి. ఇదిచూచిన పెదతండ్రి గారు పెక్కుమారు లితనిని ముక్కుపట్టి నలిపి ముక్కుమాట లను మాన్పించినారు. ఆ రోజులలో ఇంగ్లీషు చదువుకొనుట ఒక గొప్ప. తమబిడ్డ లాంగ్లభాష నభ్యసించి ప్రభుత్వము చేయ వలెనని తలిదండ్రు లువ్విళ్ళూరు చుండెడివారు. ఇంగ్లీషు కొంత నేర్చిన పెదతండ్రియు నట్లే వీరేశలింగమున కతి శ్రద్ధతో నాంగ్లము, గణితము, మున్నగువానిని స్వయముగ బోధింప మొదలిడెను. ఇంటియొద్దనే సంస్కృతాంధ్రములను కూడ ప్రత్యేకముగ చెప్పించెను. సంస్కృతాంధ్ర కావ్యములను చదివి స్వయముగా నవగాహన చేసికొను శక్తి వీరేశలింగమునకు

పుట్టుకతోడనే వచ్చినదనవచ్చును. చిన్ననాడే సహజ పాండిత్య సూచకములగు పద్యములను కూడ అల్లెడివాడు. పండ్రెండవ యేట నాంగ్లపాఠశాలలో ప్రవేశించెను. అన్ని పాఠములందును నితడే ప్రథముడు. ఏకసంథాగ్రాహులకుండు ప్రజ్ఞా విశేషము వీరేశలింగమున కుండుటచే నింటియొద్ద పాఠములు చదువకయే బడికి వెళ్ళినను నతడే తరగతులలో మేలుగ నుండెడివాడు.

ఇంటియొద్ద భారత రామాయణాది పురాణములను, కావ్యములను, స్వయముగ చదువుచుండుట వీరేశలింగమున కలవాటు. పురాణములందలి మహాపురుషులవలె తానును ఒక మహావ్యక్తియై జీవింప వలయునని యితని సంకల్పము. వారి వలె తానును ఘనకార్యము లొనర్పవలెనని కుతూహల పడెడి వాడు. చరిత్రలో ప్రసిద్ధ పురుషుల వృత్తాంతములను చదివినపు డెల్ల నతనికి పులకలు కలిగెడివట. సామాన్య జీవితము గడపి మరణించుట వ్యర్థమని యితని నిశ్చిత భావము. అట్టి యుదాత్తాశయములకు తగిన పట్టుదల చిన్ననాడే యతనిలో ప్రబల మైనది. బడిలోని యుపాధ్యాయులందరు నితని ధీశక్తిని, సాధు వర్తనమును, దైవభక్తిని, పాపభీతిని గురించి తమలోతాము ప్రస్తావించుకొనుచు, నితనిని గౌరవభావముతో చూచెడివారు.

ఒకరోజు, జిల్లా జడ్జియగు హెన్రీ మారిస్ దొరగారు పాఠశాలను సందర్శించుటకు విచ్చేసిరి. అన్ని తరగతులను సందర్శించిన పిమ్మట, వారు విద్యార్థుల నందరిని ఒక్కచో సమావేశ పరచినారు. ఒక్కొక్క విద్యార్థికి నొక్కొక్క కాగితపు ముక్క నిచ్చి, అందు, వారి ఆదర్శవిద్యార్థి నామమును వ్రాయవలసిన

దని యాదేశించిరి. పై తరగతి విద్యార్థులు కూడ వీరేశలింగము పేరునే వ్రాసియిచ్చినారు. మారిస్ దొరగారు మిక్కిలి సంత సించి ఆదర్శ విద్యార్థిగా ఎన్నుకొనబడిన వీరేశలింగమునకు ఒక నిఘంటువును బహూకరించి, అతనిని అభినందించిరి.

ప్రాచీనకావ్య పఠనాభిలాష వీరేశలింగమునకు పుట్టుక తోడనే సిద్ధించిన గుణమని తెలిసికొంటిమి కదా. వసుచరిత్ర కావ్యమును చదువవలెననెడి యభిలాషయు బాల్యముననే పొడ మినది. ఆ పుస్తకము ధర నాలుగున్నర రూప్యములు. దానిని కొనియిమ్మని తల్లిని కోరినాడు కాని, అది పాఠ్యగ్రంథము కాకపోవుటచే తల్లి నిరాకరించినది. కుమారు డెల్లపుడును ఆంగ్ల గ్రంథములనే చదువుచుండ వలెనని ఆ తల్లి యుబలాట. ఏదై నను చేయదలచుకొన్నచో చేసితీరువరకు నిద్రపోవని స్వభావము కుమారునిది. నెల కెనిమిదణాల చొప్పున చెల్లించెదననియు, దయతో తనకు వసుచరిత్రప్రతి నియ్యవలసినదనియు పుస్తక ముల వర్తకుని బతిమాలినాడు వీరేశలింగము. ఆ వర్తకుడీ యేర్పాటుకు సమ్మతించెను కాని, పూర్తిమొత్తము తీరువరకు పొత్తము నింటికి గొనిపోరాదనియు, అంగడియందే యుండి చదువవచ్చుననియు షరతులు పెట్టెను. బడి జీతమునకై నెల కొకమారు తల్లి తనచేతికిచ్చు నెనిమిదణాల నీ విధమున పుస్తక మునకు చెల్లించుచు, వీరేశలింగము, పుస్తకముల అంగడిలో,వసు చరిత్రతో కాలక్షేపము చేయుచుండినాడు. ఎన్నాళ్ళీరహస్యము దాగియుండును! కుమారుడు బడికి గైరుహాజరగుచుండుట తల్లి తెలిసికొని మందలింపగా, వీరేశలింగము నిజము చెప్పినాడు.

జీతమునకిచ్చిన డబ్బును చిరుతిండికిని, చీట్లాటకును వ్యర్థపరుపక పుస్తకమునకై వెచ్చించినందులకు తల్లి మిక్కిలి సంతోషించి, వెంటనే వసుచరిత్రను కొనిపెట్టినది.

సాహసకార్యముల నాచరింపవలయు ననెడి ఆసక్తి వీరేశలింగమునకు చిన్ననాటినుండియు కలదు. దయ్యము లున్న వనెడి నమ్మకము ఆ కాలపు ప్రజలలో నధికముగ నుండినది. చచ్చినవారు దయ్యము లగుదురనియు, ఆ దయ్యములు స్త్రీల నావేశించుననియు, మంత్ర తంత్రముల నేర్చిన భూత వైద్యులకు మాత్రమే యవి భయపడుననియు లోకుల నమ్మకము. ఆ దయ్యములకు సంబంధించిన విచిత్రగాథలును, భయోత్పాదకములగు కథలును ప్రజలు చెప్పుకొనుచుండుట వీరేశలింగము వినుచుండినాడు. భూతములను కనులార చూడవలెనను కోరిక యితనికి కలిగినది. ఒక భూతవైద్యునందులకై బతిమాలినాడు. అతడొక అర్ధరాత్రి సమయమున ఊరి వెలుపలి వటవృక్షము వరకు వీరేశలింగమును వెంట నిడుకొని పోయినాడు. జంకుగొంకు లేక నిర్భయముగా వెంబడి వచ్చుచున్న వీరేశలింగమునకు మాంత్రికుడు మాత్రము లేని దయ్యము నెట్లు చూపగలడు ! భూతమును చూచినచో బాలుడగు నతడు భయపడునని కల్లమాటలాడి, తప్పించుకొని పోయినాడు. పెక్కుమారులు వీరేశలింగ మొంటరిగా శ్మశానమునకు సైతము వెళ్ళెను. కాని దయ్యములుమాత్ర మగుపడలేదు. అంతటితో దయ్యముల పైనను, లోకవంచకులగు మాంత్రికుల పైనను విశ్వాస మతనికి పూర్తిగ నశించినది. లోకు లనేకులు పిచ్చి

నమ్మకములు గలవారనెడి అభిప్రాయ మతనిలో కలిగినది. వింతయగు విషయమును విన్నచో, శోధించి దాని నిజము తెలిసికొనవలయుననియు, వినిన ప్రతి విషయమును వెంటనే విశ్వసింపరాదనియు, విశ్వసించిన దాని ననుసరించి ప్రవర్తింప వలయుననియు వీరేశలింగము సంకల్పించుకొనినాడు. పిచ్చి నమ్మకములని నిరూపింపబడిన వానిని త్రోసిపుచ్చిననే తప్ప మానసిక వికాసము కలుగజాలదని యితని భావము. ఆనాటి హిందూసంఘ మనేక మూఢ విశ్వాసములకును, దురాచార ములకును నాకరమై యుండినది. ప్రజలలో ప్రబోధము కలు గనిచో దేశాభ్యుదయము కలుగుట కల్లయని గ్రహించినవాడు వీరేశలింగము.

తాను నమ్మిన విషయముల నాచరణలోబెట్టు కార్య శూరు డితడంటిమి. వారి పెరటిలో అరటిచెట్టొకటి యున్నది. దానిపువ్వు విచిత్రముగా చెట్టునడుమనుండి చీల్చుకొనివచ్చి గెలవేసినది. ఇరుగుపొరుగు వారును, బంధువులును, ఇంటికద యరిష్ట సూచకమనియు, వెంటనే యాచెట్టును మూలచ్ఛేదము చేయుట శ్రేయస్కరమనియు బహువిధముల చెప్పిరి. ఎవరి మాటలను లక్ష్యపెట్టక, అరిష్టములకును అరటికాయలకునుగల కార్యకారణ సంబంధమెట్టిదో పరీక్షింప బూనుకొన్నాడు వీరేశ లింగము. పువ్వు గెలయై, కాయలు పెద్దవైనవి. వానిని కోయించి, వండించి, భుజించినాడు వీరేశలింగము. ఏ యరిష్ట మును సంభవింపలేదు. మూఢాభిప్రాయముల నిట్లు వీరేశ లింగము ప్రత్యక్షానుభవ పూర్వకముగ ఖండింప మొదలిడెను.

ఆ కాలముననే ఇంటిలో దూలమునకు తేనెపట్టు పట్టినది. అది అశుభసూచకమనియు, దానిని తీసివేయించి దోష పరిహారార్థము బ్రాహ్మణులచేత శాంతికర్మలు చేయింపవలయు ననియు, దైవజ్ఞులందరు చెవినిల్లు కట్టుకొని పోరిరి. తల్లి కొంత చెప్పిచూచియు, ఈ బండవానితో లాభములేదని విసిగి విడిచి పెట్టినది. తేనెపట్టువలన నెవరికిని నెట్టి హానియు కలుగలేదు.

వీరేశలింగము విద్యార్థి దశలోనే సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథముల ననేకములను చదివి విజ్ఞానమును వృద్ధిపరచుకొనెను. వంగదేశ ప్రముఖులగు రాజా రామ్‌మోహనరాయ్, కేశవ చంద్రసేన్ మున్నగు మహనీయుల రచనలును, వారి యుపన్యాసములును, వీరేశలింగము నధికముగ నాకర్షించినవి. వంగదేశమున బుట్టిన బ్రహ్మసమాజోద్యమ మాంధ్రదేశమున మెల్లగా వ్యాప్తి నొందుచుండిన కాలమది. ఏకేశ్వరోపాసన, నైతిక జీవనము, సంఘ దురాచార నిర్మూలనము, విద్యావ్యాప్తి, సత్యము, అహింస మున్నగు బ్రహ్మసమాజ సిదాంతములు వీరేశలింగము హృదయమున దృఢముగ నాటుకొనినవి. బాల్యముననే ఇట్టి సద్భావముల నలవరచుకొని, తోటివిద్యార్థులకు బోధించుచు ఒక చిన్న సమాజమును స్థాపించినాడు. ఆ సమాజపు విద్యార్థులనే రాజమహేంద్రవర నివాసులు "మీటింగువాళ్ళు వీళ్ళేనట్రో" అని పరిహసించుచుండినది. లోకుల యీసడింపులకును, మూతిముడుపులకును, జంకక, చంచలుడై తాను విశ్వసించిన భావములను, సిద్ధాంతములను, దేశవ్యాప్తము గావింప నడుముకట్టినాడు వీరేశలింగము.

ఆ లక్ష్యమును సాధించి లోకోపకారము చేయుట తన జీవిత పరమావధియని కార్యరంగమున కురికినాడు.

## 2

ఆ కాలమున బాలబాలికలకు మిక్కిలి చిన్నతనముననే వివాహములు జరిగెడివి. అట్లే వీరేశలింగమునకును విద్యార్థి దశలోనే వివాహమైనది. అపుడీ బాలుని వయస్సు పదమూడు వత్సరములు. వధువు ప్రాయము తొమ్మిదేండ్లు. పెండ్లి వైభవముగ జరిగినది. వధువు పేరు రాజ్యలక్ష్మమ్మ.

అనురాగముతో పెంచుచుండిన పెదతండ్రియైన వేంకటరత్నము మరణించునప్పటికి వీరేశలింగమునకు పందొమ్మిదేండ్లు. ఉన్నత విద్యాభ్యాసమునకీ విపత్తు ఆటంకము కాగా కుటుంబ పోషణార్థము ఉద్యోగాన్వేషణ మవసరమైనది. తన కిదివరకు బడిలో బహుమతి నిచ్చిన మారిస్ దొరగారిపుడు 'శిరస్తాదార్' పదవి నిత్తుమని చెప్పినారు. ఏ తాలూకాఫీసులోనో యుద్యోగియై పడియుండుట తన జీవిత పరమావధిని సాధించుట కాటంకమని భావించినాడు వీరేశలింగము. స్వతంత్ర వృత్తిని, న్యాయప్రవృత్తికిని సన్నిహితముగనుండు ఉపాధ్యాయ వృత్తిని, స్వీకరించి, భావిపౌరులగు విద్యార్థులలో జ్ఞానజ్యోతిని వెలిగించి, తన్మూలమున దేశాభ్యుదయమునకు పాటుపడుటకు నిశ్చయించినాడు.

తన ఇరువది నాలుగవయేట, కోరంగి అను గ్రామములోని ఇంగ్లీషు పాఠశాలలో నెలకు ముప్పది రూపాయల

ప్రధానోపాధ్యాయ పదవిని స్వీకరించినాడు. ఉద్యోగమునకు బయలు దేరునప్పుడైనను సుముహూర్తమును పాటింపవలసినదని బంధువు లతనికి బోధించిరి. "ఈశ్వరుడు చేసిన దినములన్నియు మంచివే. ఏరోజైననేమి" అని సమాధానము చెప్పి, యామావాస్యయైనను బయలుదేరిపోయి, ఆరోజే యుద్యోగమును స్వీకరించినాడు. సుముహూర్తములందును, శకునములందును వీరేశలింగమునకు నమ్మకము బాల్యమునుండియు లేదు.

ఆ కాలమున, "గోదావరీ విద్యాప్రబోధిని" అను పత్రిక యొకటియు, బందరునుండి "పురుషార్థ ప్రదాయిని" అను నొక పత్రికయు వెలువడుచుండినవి. 1870 నాటినుండియే వీరేశలింగ మనేక వ్యాసములు, పద్యములు రచించి ప్రకటించుచుండెడివాడు. 'ఆంధ్రభాషా సంజీవని' యను పత్రికను చెన్నపురిలో మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు నడపుచుండిరి. వీరు ప్రాచీన పండితులు. అతి సనాతనాచార పరాయణులు. "ఓ గృహిణీ! మార్జాలంబొండు క్షీరంబునుం గ్రోలుచున్న యది, వేవేగ వచ్చి దానిం దొలంగం ద్రోలుము" అనెడి ఫక్కిలో నిస్సహాయయైన యిల్లాలిపైకూడ గ్రాంథికాంధ్రమును ప్రయోగించెడివారట. స్త్రీలకు విద్య కూడదనియు, అది లోకవినాశహేతువనియు ఆ పండితుని దృఢవిశ్వాసము. ఇట్టి ఆ మహామహోపాధ్యాయుని అభిప్రాయములను ఖండించుచు, 'పురషార్థ ప్రదాయిని'లో వీరేశలింగము వ్యాసములు వ్రాయుచుండెను. 1874 లో వీరేశలింగము పంతులు కోరంగిని విడిచి, ధవళేశ్వరమున ప్రధానోపాధ్యాయ

పదవిని స్వీకరించెను. ఆ పట్టణమున ప్రతి ఆదివారమును విజ్ఞానోపన్యాసము లొసగ నారంభించినాడు. చందాలు వేయించి, భగీరథ ప్రయత్న మొనర్చి ఒక బాలికా పాఠశాలను గూడ స్థాపించెను. అట్టి పాఠశాల నా రోజులలో స్థాపించుట లోక ప్రవాహమున కెదురీత. సంఘ దురాచార నిర్మూలనమునకును, స్త్రీ విద్యావ్యాప్తికిని, అనుకూలముగ తన యధీనముననే యొక పత్రిక యుండిన బాగుండునని వీరేశలింగమునకు తోచినది. 1874 లోనే "వివేకవర్ధని" అను మాసపత్రికను, కొక్కొండ పండితుని పత్రికకు ప్రతిస్పర్థిగా స్థాపించినాడు. ఆ పత్రికా ముఖమునకు తిలకముగను, పత్రికా నిర్వహణమునకు మూలసూత్రముగను-

క॥ ఒరు లే యవి యొనరించిన,
నరవర, యప్రియము తన మనంబున కగు, దా
నొరులకు నది సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్"

అను భారత పద్యమును గ్రహించెను. విజ్ఞాన వినోదములకు "వివేకవర్ధని" ఆ కాలమున పెట్టిన పేరైనది.

ఆంధ్ర దేశమునం దానాడు దుష్ప్రవర్తనకు, దుర్నీతికి ప్రాబల్య మెక్కువ. ఉద్యోగస్థులు లంచములు పుచ్చుకొనుట సర్వసాధారణ విషయము. లంచములిచ్చుట, పుచ్చుకొనుట - ఈ రెండును నుద్యోగ సాధారణ ధర్మములనియే ప్రజల నమ్మకము. ఈ దురాచారమును నశింపచేసి, ప్రజలలో నీతిని, ఆత్మగౌరవమును, ఉద్యోగులలో సత్ప్రవర్తనను, వర్ధిలజేయుట మిక్కిలి

అవసరమై యుండెను. అట్లే వేశ్యాగమనముకూడ సాధారణ విషయముగ పరిగణింపబడిన రోజు లవి. ఏకపత్నీవ్రతులు పురుషులే కారనెడి లోకువయు, వారకాంతా పోషకులు మాత్రమే పురుషోత్తములనెడి యభిప్రాయమును ఆ కాలమున ప్రబలి యుండెను. ప్రముఖులు తమ పేరులతో బోగము మేళముల పోషించుట పరిపాటి. వారి గౌరవాధిక్యమున కది సూచకము. వివాహాది శుభకార్యములందు బోగము మేళము లుండుట తప్పనిసరి. అట్టి మేళములలో "వసూళ్ళు వేయుట" అను ఆచారమొకటి పాటింపబడు చుండినది. శుభకార్యములకు వచ్చిన పెద్దలు బోగము మేళమునకు డబ్బు నొసగుట తప్పనిసరి. దానినే "వసూళ్ళు వేయుట" అందురు. వేశ్యాల కట్టి 'ఒసగులు వేయకుండుట' 'ఘరానా మనుష్యులకు' అవమానకరమగు విషయముగ గణించుచుండిరి. అధికారులు కొందరు చీటికిమాటికి తమ యిండ్లలో శుభకార్యముల నేర్పాటు చేసి 'వసూళ్ళు వేయగా', వచ్చిన ధనములో కొంత భాగము నా బోగము వారికిచ్చి, మిగిలిన దానిని తామే సంగ్రహించు చుండిరి. తమ యాహ్వానమును గౌరవింపనివారిని, వచ్చియు వసూళ్ళువేయని వారిని, ఏదో సాకుపై పీడించుట యీ యుద్యోగులకు పరిపాటిగా నుండినది. ఇంటిముందు పెంటకుప్ప యున్నదనియు, మురికినీరు వీథిలోనికి వచ్చిన దనియు - ఇట్లేవో నెపములు పెట్టి, ఆ యధికారులు ఒసగులు వేయనివారిపై అభియోగములను దెచ్చి, ధనదండన విధించెడివారు. అతిబాల్య వివాహములు, అతివృద్ధ వివాహములు, కన్యాశుల్కము, సంఘమున ముమ్మర

ముగా నుండినవి. ముక్కుపచ్చలారని బాలికలను, కాటికి కాళ్ళు చాచుకొనియుండు తాతల కిచ్చి జరుపు వివాహములు నిరాటంకముగా జరుగు చుండినవి. అందువలన పాప మా బాలికలు యుక్త వయస్కులు కాక పూర్వమే వితంతువులగుట జరుగు చుండినది. అనాథలై, అనన్య గతికలై, పుట్టినిల్లు చేరిన అట్టి బాల వితంతువులకు శిరోజములు దీయించి, వారి ఆభరణములు అలంకారములు ఆహరించి, భగ్నజీవులుగ చేయుట నాటి పరస్థితి. ఆ బాలికల కట్టి గతి కల్గుట విధిచోదితమనియే మూఢప్రజల నమ్మకము. ఆనాటి సంఘ మిటువంటి దుర్దశకు, దుర్నీతికి, దురాచారములకు, మూఢ విశ్వాసములకు లోనై మరుగుచుండినది. పత్రికాముఖమున నీ దురాచారము లన్నింటిని తీవ్రముగ ఖండించుచు, బహుముఖ సంస్కార సాధనకు వీరేశలింగము కంకణము కట్టుకొనెను. విజ్ఞాన వికాసము, స్త్రీ విద్యావ్యాప్తి, స్త్రీ జనోద్ధరణ, భాషాభివృద్ధి, దేశాభివృద్ధి, - ఇత్యాదులకై తన "వివేకవర్ధిని" పత్రికను సాధనముగ చేసికొన్నాడు. "వివేకవర్ధిని" కనుబంధముగ "హాస్యసంజీవని" యను పత్రికను కూడ నడువసాగెను. ఆక్షేప గర్భితములైన ప్రహసనములు, హాస్య పూరితములైన వ్యాసములు రచించి, ప్రకటించి, సంఘాభ్యుదయ నిరోధకులగు సనాతనుల మూఢాభిప్రాయములను నవ్వులపాలు గావింప మొదలిడెను. సనాతనులందరు వీరేశలింగముపై మండిపడి, అతని ఉద్యమమునకు ఎదురు నిలిచిరి. లంచములు కూడవని వ్రాసినచో ప్రభుత్వోద్యోగులకు కోపము. వేశ్యాంగనా సంగమము అవినీతి యని

బోధించినచో శృంగార ప్రియులకు ఒళ్ళు మండెడిది. త్రికరణశుద్ధి లేక తులసిమాలలు, విభూతిరేఖలు ధరించుట మత విరుద్ధములని రచించిన సనాతనులు శాపనార్థములు పఠించెడివారు. పిచ్చి నమ్మకములు, కులభేదములు కూడదని చెప్పినచో లోకుల కందరికిని వెగటు. అయినను తన పత్రికలోని అట్టి రచనలను, ప్రహసనములను, అక్షరాస్యు లందరును చదివెడివారే. కాని వీరేశలింగము మాత్రము అందరికిని శత్రువయ్యెను. యథార్థవాది లోక విరోధి యగుట తప్పదు కదా! ప్రతిపక్షాభిప్రాయము ఝంఝా మారుత తుల్యమై యున్నను, తాను సత్యమని, శ్రేయమని నమ్మిన దానిని చాటుటలో ఏకాకిగ నైనను నిలబడి నిగ్రహించుకొనగల మనోదార్ఢ్యము, పట్టుదల వీరేశలింగమునకు గలవు. బక్క చిక్కిన యొక బడిపంతులు లాకాలమున నంతటి విప్లవాత్మకమగు సంఘ సంస్కారోద్యమమునకు సాహసించుట అద్భుతావహమే.

వీరేశలింగము 1876 లో రాజమండ్రి కళాశాలలో ఆంధ్రోపాధ్యాయుడై నాడు. అప్పటికే అతని పత్రిక దేశమున కొంత యలజడిని కల్గించినది. స్త్రీ విద్యాద్వేషియగు కొక్కొండ మహోపాధ్యాయుడు వాదమున నిర్బలుడై "శేషం కోపేన పూరయేత్" అన్నాడు. వీరేశలింగముయొక్క రచనలో తప్పులున్నవనియు, భాషాజ్ఞాన మతనికి తక్కువ యనియు, చాట ప్రయత్నించినా డీ పండితుడు. అంత వీరేశలింగము ద్విగుణీకృతోత్సాహముతో, కొక్కొండవారి రచనలో నట్టి తప్పులు కొల్లలని యెత్తిచూపి, ఆ మహాపండితునికి లోకజ్ఞానముతోపాటు

పాండిత్యముకూడ పెద్ద సున్నయే యని నిరూపించినాడు. దీనితో నాకాలపు పండితుల గుండెలు దడదడ లాడినవి.

1878 లో పోలూరి శ్రీరాములు అను జిల్లా మునసబు రాజమహేంద్రవరమునకు బదిలీయై వచ్చెను. లంచములు మ్రింగుటలో దిట్ట యతడు. అప్పుడు రాజమహేంద్రవరమున ప్రభుత్వ న్యాయవాదిగా నుండిన చిత్రపు కామరాజతనికి దగ్గరి చుట్టము. "ఉత్కోచ స్వీకరణ" విద్యలో నితడును అందెవేసిన చేయియే. అగ్నికి వాయువు తోడైనది. వీరిద్దరొక్కటియై అభియోగముల తీర్పులను న్యాయాన్యాయముల బట్టిగాక, వాది ప్రతివాదు లిచ్చు లంచములనుబట్టి నిర్ణయించుచుండిరి. న్యాయ విక్రయమునకై ఆ న్యాయస్థానమున వ్యావహారిక పరిభాష యొకటికూడ నేర్పడెనట. "ఏలినవారు 100 వ ప్రకరణము చిత్తగించి న్యాయము దయచేయవలె"నని వాదిపక్షపు న్యాయవాది వేడగా, ప్రతివాది పక్షపు న్యాయవాది "ఆ ప్రకరణము పనికిరాదు, 150 వ ప్రకరణము చిత్తగించి తీర్పు చెప్పవలె"నని మనవి చేసికొనును. ఇట్లు ఒకరి తర్వాత ఒకరు 160, 170, 180, 190, 200 అను ప్రకరణములను పేర్కొనిన కడపట నేదో యొక సంఖ్యకడ ప్రకరణోదాహరణ మాగిపోవును. "ఆ ప్రకరణార్థమును ఈరాత్రి సావధానముగ చిత్తగించి రేపు సభలో తీర్పుచెప్పెద"మని మునసబు శ్రీరాములుగారు కోర్టులో నాటి విచారణ ముగింతురు. ఎక్కువ ప్రకరణ సంఖ్యను బేర్కొని వాదించిన న్యాయవాది, ఆరాత్రి ఆ న్యాయ పరిపాలకుని యింటికిపోయి, తత్ప్రకరణార్థ మతని యెదుట

ప్రసన్నము గావించిన మరునాడు మునసబుగారు న్యాయసభలో ఆ పక్షమున కనుకూలముగ తీర్పు చెప్పెడివారు. మునసబుగారిచ్చు తీర్పులన్నియు కామరాజుగారే రాత్రులం దింటియొద్ద వ్రాసియిచ్చెడివారు. ఇట్లు వీరిర్వురును రెండు చేతుల ధనమార్జించుచుండిరి.

ఈ దుర్నయమును రూపు బాపుటకు వీరేశలింగము నిశ్చయించుకొన్నాడు. మునసబు లంచగొండి యను మాట బట్టబయలైన రహస్యమే. ఐనను లంచములిచ్చినవారు తాము లంచము లిచ్చినట్లు బహిరంగము చేయ సాహసించెడివారు కారు. మునసబుగారి నిమిత్తము కామరాజుగారు వ్రాసిన తీర్పు కాగితముల చిత్తుప్రతిని ముక్కలుగా చింపి పెంటకుప్పలో పారవేయుచుండెడివారు. వీరేశలింగ మీ రహస్యమును పసిగట్టి వీథులూడ్చువానికి డబ్బులిచ్చి ఆ ముక్కలను సేకరించెను. అతి ప్రయాసతో వానినన్నింటినతికింపగా, కామరాజుగారి వ్రాతతో నున్న తీర్పు చిత్తుప్రతి సిద్ధమైనది. వీరేశలింగముగా రీ ప్రతి నాధారముగా చేసికొని, జిల్లా మునసబుగారి లంచగొండితనమును పత్రికలలో ప్రకటించి బాహాటమొనర్చిరి. దానిపై వీరేశలింగము మానసష్టపు దావాకు గురియైనాడు. అభియోగ గ్రంథ మధికముగ పెరిగినది. అన్యాయమునకు పాల్పడిన అధికారు లందరు ఒక్కటై, యతనికి కారాగార శిక్ష విధింపచేసి అణగద్రొక్కవలెనని పూనుకొన్నారు. అయినను న్యాయ పక్షమవలంబించి పోరాడిన వీరేశలింగమే చివరకు విజయము నొందెను. తనకు కలిగిన పరాభవమును భరింపలేక చిత్రపు

కామరాజు ఆత్మహత్య గావించుకొన్నాడు. మునసబు శ్రీరాములు వ్యాజ్యము జరుగుచుండిన కాలములోనే మరణించుటచే నిహాలోక శిక్షను తప్పించుకొనెను. వీరిద్దరికి తోడుగ నుండిన శిరస్తాదారునకు మతిభ్రమణము కలిగినది. దీనితో వారి బంధుమిత్రు లనేకులు వీరేశలింగమునకు శత్రువులైరి. ఇట్లు ఎందరితోనో వైరము సంభవించినను జంకక, సత్యమును, ధర్మమును, న్యాయమును రక్షించుటకై వీరేశలింగము ఎడతెగక పాటుపడినాడు. ఆ రోజులలో వివేకవర్ధిని పేరే దుష్టాధికారులకు సింహస్వప్నమైనది.

ఒక వైపు కళాశాలలో ఉపాధ్యాయవృత్తిని నిర్వహించుచు, పత్రిక నడుపుచు, వ్యాజ్యములలో వ్యవహరించుచు, గ్రంథ రచన సాగించుచు, మరియొకవైపు తాను స్థాపించిన ప్రార్థన సమాజమున భగవత్ప్రార్థనలచేతను, ధర్మోపన్యాసాదుల చేతను సంస్కరణోద్యమమును నిర్విఘ్నముగా సాగించుచుండెను. ఆప్రార్థన మందిరమున వీరేశలింగం పంతులుగారి మహోపన్యాసములను వినుచుండుట అనేకులకు నిత్యకృత్యమైనది. క్రమక్రమముగా పురజనులు కొందరు వీరేశలింగముగారి అభిప్రాయములతో నేకీభవింప మొదలిడిరి.

## 3

బాలవితంతువుల దురవస్థలను వర్ణించుచు, జాలి పుట్టునట్లుగ నొక వ్యాసమును రచించి, వీరేశలింగము 1879 సంవత్సరమున "వివేకవర్ధిని" పత్రికలో ప్రకటించెను. స్త్రీ

పునర్వివాహము ధర్మశాస్త్ర సమ్మతమనియు, న్యాయ్యమనియు, శాస్త్రముల యాధారమున నిరూపించెను. ఆ వ్రాతతో పూర్వాచార పరాయణులందరు తోకత్రొక్కిన త్రాచులైరి; వీరేశలింగముపై ధ్వజమెత్తి వాగ్యుద్ధమునకు బూనుకొనిరి. అతనిని బహిరంగ సభల కీడ్చి, వాదోపవాదముల నతనిపై కురిపించినచో నతనినోరు కట్టుపడునని వారి యూహ. ఇట్లు సనాతన పండితులంద రొక పక్షమునను, తానొక్కడే యొక పక్షమునను నిలిచి వాదించు సన్నివేశము లేర్పడినవి. సమయస్ఫూర్తియు, ప్రతిభయు గల్గిన వీరేశలింగమునకు, సత్యబలమును దైవబలమును కలసిరాగా, నతడు వాగ్యుద్ధమునం దాయుద్దండ పండితులు చూపెడి దృష్టాంతములతోనే వారినోటికి తాళములు వేసెడివాడు. బహిరంగసభలలో పరాజితులైన సనాతనులు, సభలకు వాదములకు స్వస్తిచెప్పి, చాటుగా వీధి అరుగులమీద చేరి, తమ ప్రగల్భములను మూఢజనుల యెదుట ప్రదర్శించి తృప్తినందుచుండిరి.

1881 లో వీరేశలింగము రాజమహేంద్రవరమున బాలికా పాఠశాల నొక దానిని స్థాపించెను. స్త్రీ విద్యాద్వేషులైన ఛాందసు లందరు దానిని భగ్న మొనర్ప వ్యూహములు పన్నిరి. వారి వ్యూహముల నన్నిటిని వీరేశలింగము సునాయాసముగ ఛేదించి విజయ మొందెను. ఈ యుద్యమము లన్నింటను పంతులుగారికి బాసటయై నిలిచిన వారు విద్యార్థులు.

కందుకూరి వారి యాధ్వర్యమున కాలేజి విద్యార్థులు కొందరు ప్రార్థన సమాజమును, సంఘ సంస్కరణ సమాజమును

ఏర్పరచుకొనిరి. ఆదర్శజీవనము ననుసరించుట, కులభేదములు పాటింపకుండుట, రాత్రి పాఠశాలలు నడపుట, బీదల కన్న వస్త్రములు దానము చేయుట, - ఇట్టి సత్కార్యాచరణము వారి కార్యక్రమము. పొగ, పొడుము, పేకాట మొదలగు దుర భ్యాసములకు దూరముగ నుండుట, భోగము మేళము లుండు శుభ కార్యముల యాహ్వానముల నాదరింప కుండుట, దురా చార నిర్మూలనాది సంస్కరణములందు సాయపడుట - ఇవి తమ జీవిత నియమములుగా ఆ విద్యార్థులు వీరేశలింగము సమక్షమున ప్రతిజ్ఞలు గైకొనిరి. అట్టి ఆదర్శయువక విద్యార్థుల సహకార బలముననే వీరేశలింగము మహా సంఘసంస్కర్త యయ్యె ననిన అతిశయోక్తి కాదు. లోకోపకారార్థము అగ్నిహోత్రమున దూకుటకును వెనుదీయని విద్యార్థులు వారు. విద్యార్థి హృదయ ములలో మొదట విజ్ఞానజ్యోతిని వెలిగించి, తన్మూలమున సంఘ మందలి యజ్ఞానమును, అవినీతిని, పటాపంచలు గావింప గలిగినాడు వీరేశలింగము.

సంఘ సంస్కరణ విషయములను నాటక ప్రదర్శన రూపమున ప్రచారము చేసినచో, ప్రజలకు వినోదముతోపాటు విజ్ఞానమును కలుగునని యూహించి, వీరేశలింగము 1881లో నాటకసమాజము నొకదానిని రాజమహేంద్రవరమున స్థాపిం చెను. చక్కని నాటకముల నొకటి రెండు స్వయముగా రచించి, విద్యార్థులచే ప్రదర్శింప జేసెను. కాని, ఆ విద్యార్థులు నాటకములందలి యత్యాసక్తిచే, పాఠములం దశ్రద్ధ వహించు చుండుట గమనించిన పంతులుగారు, ఆనాటక సమాజమును

వెంటనే కట్టిపెట్టి, విద్యార్థుల దృష్టిని మరల విజ్ఞానార్జన యందును, సంఘ సంస్కరణ కార్యములందును కేంద్రీకరింప జేసి నారు. వీరు విద్యార్థుల విషయమున వహించిన బాధ్యత యిట్టిది.

ఇతడు స్థాపించిన స్త్రీ పునర్వివాహసమాజమును, కావించిన వితంతు వివాహ ప్రచారమును కాలక్రమమున ప్రజామోదమును పొందగలిగినవి. హైందవ ధర్మ సంరక్షణ తమ భుజములపై నున్నదను భ్రమలో పడియుండిన పూర్వాచార పరాయణులు మాత్రము బద్ధ విరోధులు. వారందరు సమావేశమై వితంతువివాహములు చేసితీరవలెననెడి సంకల్పముతో నుండిన వీరేశలింగముగారిని, అతని అనుయాయులను, కులము నుండి వెలివేయవలెనని సభలో తీర్మానించిరి. కులమే కూడదన్న వానికి వెలియేమి ?

ధర్మమని తలచిన కార్యమును చేయుటలో ప్రాణముల నైతము లక్ష్యపెట్టనివాడు వీరేశలింగము. నెలకు నలుబది రూకలు గడించు తెలుగు పండితుడేమి ! ప్రతికూలమైన సంఘమున సంస్కారముల గావింప ప్రయత్నించుటేమి ? అతనికి అధికారబల మున్నదందమా ? ధనబలమైన నున్నదందమా ? పోనీ దేహబలమైన నున్నదందమా ? ఏదియు లేదు. తన బలమంతయు కుఱ్ఱకుంకలని తృణీకరింపబడు విద్యార్థులు మాత్రమే. ఐనను అచంచలమగు కార్యదీక్ష, పట్టుదల, ఆత్మవిశ్వాసము, ఇవిమాత్ర మఖండముగ నున్నవి. ఇంతవరకు ప్రచారరూపమున సాగించిన వితంతు వివాహోద్యమమునకు కార్యరూపము కలిగింపవలెనని

వీరేశలింగము సంకల్పము. కాని వృద్ధబ్రాహ్మణుల 'శాపనార్థ ములను' బెదిరింపులను రాజ్యలక్ష్మమ్మ భరింపలేకపోయినది. ఇట్టి యుద్యమమునుండి విరమింపుడని ఒకరోజు ఆ సాధ్వి భర్తను ప్రార్థించినది. "నీవు కలిసిరానిచో విధవావివాహమున నేనే మొదటి పెండ్లికుమారుడను కావలసి వచ్చు"నని సూటిగ నతడు సమాధాన మిచ్చెను. భర్త ఆశయములను, స్వభావమును చక్కగా నెరింగిన ఆ యర్ధాంగి, మారుమాటాడక తన జీవి తాంతమువరకు భర్త యుద్యమమున తోడ్పడి, ఉత్తమ సహ ధర్మచారిణియైనది.

అతివృద్ధులకు బాలికలనిచ్చి వివాహము చేయుచుండుట వలన ప్రతి గ్రామముననుబాలవితంతువుల సంఖ్య అధికముగ నుండినది. వారికి జీవితమన నేమియో తెలియని బాల్యావస్థలో జరిగిన సంఘటన లీ వివాహ వైధవ్యములు. అట్టి బిడ్డల దుస్థితి విషయమున తలిదండ్రులును, బంధువులును నుదాసీనులై యది వారి కర్మమని, నిర్లక్ష్యభావముతో నుండెడివారు. ఇంతియకాక బాలవితంతువులు భూమికి భారముగా జన్మించిన పాపులని లోకుల కంటగింపు. అట్టి పరిస్థితులలో కృష్ణామండలమునందొక బ్రాహ్మణునకు వితంతువగు పండ్రెండేండ్ల కుమార్తె యుండినది. ఆమె దుస్థితికి మాతృహృదయము మాత్రము కుమిలిపోవు చుండినది. కుమార్తె పునర్వివాహితయై, సుఖపడిన బాగుండునని తనలో భావించుకొనుచుండిన దీ యిల్లాలు. వీరేశలింగము చేయుచుండిన ప్రచారము విని యామె తనబిడ్డకు వివాహము చేసెడి పక్షమున నామెను తాను రహస్యముగా వీరేశలింగము

గారి యింటి కంపగల నని వార్త నంపినది. వెంటనే వీరేశ లింగము తగిన వారిని రహస్యముగ పిలిచి, కర్తవ్యమును బోధించి పంపినాడు. వారెంతో కష్టపడి, ఆ వితంతు బాలికను వీరేశలింగము నింటికి సురక్షితముగ చేర్చిరి. వివాహమాడనున్న యా పూర్వసువాసినిని రాజమహేంద్ర వాసులు వింతగా గుంపులుగట్టి వచ్చి చూచిరట. ఇక వరాన్వేషణమే తరువాయి. అంతవరకు వితంతువులను వివాహమాడుదుమని చెప్పుచుండిన సాహస బ్రహ్మచారులు, తలిదండ్రుల యొత్తిడికి మెలమెల్లగ జారుకొనిరి. వీరేశలింగము యొక్క శిష్యుడును, అనుచరుడును నయిన గోగులపాటి శ్రీరాములను యువకుడు, విశాఖపట్టణ మున జిల్లా పోలీసు ఆఫీసులో నుద్యోగి. అప్పటి కతని భార్య పురిటిలో మరణించినది. వీరేశలింగముపై భక్తి గౌరవములు గలిగిన యీ యువకుడు ప్రథమ వితంతు వివాహమున వరు డగుటకు ముందంజ వేసినాడు. 1851 వ సంవత్సరము డిసెంబరు 11 వ తేది వివాహము జరుపుటకు నిశ్చయమైనది. బంధువులందరు నేకమై వరుని వారింపచూచిరి. కాని లాభము లేక పోయినది. బంధుజన ప్రేరితులైన యధికారులు వివాహ మునకై రాజమహేంద్రవరము పోనున్న పెండ్లికొడుకునకు సెలవు నీయ నిరాకరించిరి. వీరేశలింగ మీ విషయమును మద్రాసులోని 'ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు'కు తెలియ జేసెను. వెంటనే కోరినన్ని దినములు శ్రీరామునకు సెలవు నియ్యవలసినదని విశాఖమండల పోలీ సధికారికిని, రాజమండ్రిలో జరుగబోవు నతని వివాహమునకు సర్వవిధములగు సంరక్షణ

నియ్యవలసినదని గోదావరిమండలపోలీసధికారికిని, తంత్రీవార్తల మూలమున ఉత్తరువులు జారీచేయబడినవి. కాని ఈ యపూర్వ వివాహము నెట్లయినను భగ్నమొనర్పవలెనని రాజమహేంద్ర వరపు సనాతనులు బద్ధకంకణులై యుండిరి. ఈ వివాహమున పాల్గొనువారినందరిని వెలివేయ తీర్మానించిరి. వివాహమునకు వంట బ్రాహ్మణుడు, పురోహితుడు రాకుండ చేసిరి. చాకలి మంగలి, మున్నగు పనివారిని ఆపిరి. పండ్రెండేండ్ల పసిబిడ్డ పసుపుకుంకుమ లాశించుట పాపకార్యమని పరవళ్ళు త్రొక్కినారీ పరమబ్రాహ్మణులు. ప్రతిపక్షమువారి కుత్సిత ప్రయత్నముల కన్నిటికిని ప్రతిక్రియ గావించుచు రాగా చేయునది లేక ప్రతిపక్షులు దౌర్జన్యములకు బూనుకొనిరి. 'ఇన్స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు' ఉత్తరువు మేరకు జిల్లాపోలీసు అధికారి వివాహము‌ను రక్షించుచుండ, విరోధిపక్షమువారి కుట్రలు సాగలేదు. ఆదర్శవివాహము నాల్గురోజులు అతి వైభవమున జరిగినది. వధూవరుల పల్లకి యూరేగింపులో వీరేశలింగముగారి యను యాయులతో పాటు కొందరుద్యోగులును, యూరోపియను లును పాల్గొనిరి. అట్టి వైభవము జమీందారుల యిండ్లలో కూడ జరుగలేదట.

వీరేశలింగము నిర్విఘ్నముగా నిర్వహించిన ప్రథమ వితంతు వివాహమును ప్రశంసించుచు, భారతదేశమందలి పత్రికలు, అభ్యుదయ సంస్థలు అతని అభినందించి ప్రోత్సహించినవి. ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు కలకత్తా నుండి తన అభినందనముల పంపెను. వెంటనే, రాజమహేంద్రవరమున వరుసగా

నాలుగైదు వితంతు వివాహములను జయప్రదముగా జరిపి నారు పంతులుగారు. హైందవ ధర్మము మంట గలియు చున్న దని పూర్వాచార పరాయణులు మండిపడిరి. శంకరాచార్య స్వాముల వారిని సపరివారముగ రప్పించి వారిచేత వీరేశలింగ మునకును, నతని యనుయాయులకును, ముప్పది మందికి శ్రీముఖముల బంపిరి. ఆ బహిష్కార పత్రములకు భయపడి, కొందరు ప్రాయశ్చిత్తము చేసికొని, వీరేశలింగముగారి మైత్రికి స్వస్తి చెప్పి, తమ్ముతాము రక్షించుకొనిరి. హిందూధర్మోద్ధరణకై శంకరాచార్యుల వారికి పురజనులు భిక్షలు సేయుచు, వారిని కొన్ని నెలలపాటు రాజమహేంద్రవరమున నిలుపుకొనిరి. అచ్చు వేసిన ఆబోతుల వలె నిశ్చింత జీవితము గడుపుచుండిన ఘోటక బ్రహ్మచారులగు స్వాములవారి శిష్యులు, రాత్రులందు పట్టణ మున రహస్య సంచారముల సాగింప మొదలిడిరి. స్వాములవారి మిథ్యా మాహాత్మ్యమును, శిష్యుల గూఢ ప్రవర్తనను, ఈ గుడ్డి లోకము నెదుట బట్టబయలు చేయ వీరేశలింగము నిశ్చయించు కొన్నాడు. పాపము పండి, బ్రాహ్మణ వితంతువుతో సరసస్సల్లా పములు జరుపుచుండిన ఆచార్యులవారి శిష్యశిఖామణి నొక రాత్రి కాలేజీ విద్యార్థులు కొందరు నడువీథి కీడ్చి, రసాభాస గావించిరి. దీనితో స్వాములవారి శిష్యబృందమునకు శివ మెత్తి నది. మరునాడు గోదావరీ తీరమున ఒంటరిగా పోవుచుండిన యొక విద్యార్థిపై స్వాములవారి శిష్యులు చేయిచేసికొన్నారు. ఇది తెలిసిన కాలేజీ విద్యార్థు లుద్రిక్తులై, గుంపు గట్టుకొని పోయి, గోదావరిలో జలక్రీడా సక్తులై యుండిన స్వాములవారి

శిష్యులను నీళ్ళలో ముంచియు, వారి బోడితలలను మద్దెలుగా చేసి వినోదించియు, తోడి బాలుని కొట్టిన ఋణమును వడ్డితో తీర్చిరి. తన శిష్యులకు జరిగిన యీ పరాభవమునకు ఖిన్నులైన స్వాములవారు, రాజమహేంద్రపుర జనులు వచ్చి క్షమాపణల నైన చెప్పుకొందురని ఎదురుచూచినారు. కాని, కాలేజీ విద్యార్థులు చాల విజృంభించి యున్నారనియు, స్వాములవారు శీఘ్రము ఊరు విడిచిపోవుట వారికిని నూరికిని శ్రేయస్కరమనియు, ఊరి పెద్దలు సందేశము పంపిరి. స్వాములవారు ఆగ్రహించి విద్యార్థులపై న్యాయస్థానమున అభియోగము తెచ్చినారు. కాని, స్వాములవారి శిష్యులదే తప్పని విచారణలో నిర్ణయమై, వారికి జరిమానా విధింపబడుటచే, స్వాములవా రా నాటి రాత్రి పరివారముతో నిశ్శబ్దముగా ఊరు విడిచి వెడలిపోవలసివచ్చినది. వీరేశలింగము యొక్క సంస్కరణోద్యమమునకిది విజయభేరి. క్రమక్రమముగ ప్రజలు వీరేశలింగము యొక్క సదుద్దేశములను గ్రహించి, అతనియెడ భక్తిగౌరవముల చూపమొదలిడిరి. అటు తర్వాత పది పండ్రెం డేండ్లలో, ముప్పదికి పైగా వితంతు వివాహములను పంతులుగారు పట్టుపట్టి జరిపినారు. తమ సమస్తాదాయమును, అనుయాయు లిచ్చు చందాలను, ఆ వివాహములకై వినియోగించెడివారు. సంతానము లేని వీరేశలింగ దంపతులకు అనాథలైన వితంతువులే బిడ్డలు. తమ్మాశ్రయించిన వితంతువుల విషయమున కులభేదములు పాటింపక విద్యాబుద్ధులు చెప్పించి, వివాహములు చేయించి, వారి భర్తల కన్ని విధములగు సహాయమును చేయుచు,

తమ జీవితమును సఫలము గావించు కొన్నారీ పుణ్య దంపతులు.

ప్రతిదినమును, పగలు పదిగంటలకు కళాశాలకు పోయి సాయంకాల మయిదు గంటలవరకు పాఠముల బోధించుట, అటు పిమ్మట నందందు ఉపన్యాసము లిచ్చుట, సెలవు దినము లలో పొరుగూళ్ళకుపోయి విజ్ఞానవ్యాప్తి గావించుట, మునిసి పాలిటిలో సభ్యుడుగను ఉపాధ్యక్షుడుగను నుండి, అనేక ప్రజా హిత కార్యములు చేయుట, ప్రాచీన కావ్యముల పరిష్కరించి ప్రచురించుట, నూతనముగ గ్రంథములు వ్రాయుట, 'వివేక వర్ధని'ని నడపుట, ప్రతిపక్షమువారు తనపై తెచ్చు నభియోగ ములలో ఎదురొడ్డి నిలుచుట,- ఇట్టి బహుకార్యములందు సత తము నిమగ్నుడై యుండిన మహోవ్యక్తి వీరేశలింగము. తీవ్ర మైన శ్వాసరోగముచే బాధపడుచుండియు, లోకోపకారము లగు ఇన్ని ఘనకార్యములను తనపై నిడికొని, నిరంతర దీక్షతో వానిని సాధించుట మహాశ్చర్యము కదా! అంతవరకు నిద్రాణమై యుండిన తెనుగుజాతిని తన ఉపన్యాసముల వలనను, వ్యాస ప్రహసన నాటకాది రచనల వలనను మేల్కొలిపి, చైతన్యవంత మొనరించినాడు వీరేశలింగము. అతడు దేశమున వెదజల్లిన విజ్ఞానబీజములు మొలకెత్తినవి. దీనితో ఆంధ్రజాతి అభ్యుదయ పథమున అడుగిడినది.

వీరేశలింగముయొక్క ఘనత చెన్నపురి మహాజనులను కూడ నాకర్షించినది. సంఘసంస్కారోపన్యాసములను, వితంతు వివాహములను, తమ పట్టణమునకూడ జరుపవలసినదని వీరేశ

లింగమును చెన్నపురి పౌరులు ప్రార్థించిరి. ఉద్యోగమునకు రెండేండ్లు సెలవు పెట్టి, సతీసమేతుడై మద్రాసు చేరుకున్నారు పంతులుగారు. మద్రాసులో వారి కఖండ సన్మానము జరిగినది. అనేక సంస్థ లతనిని గౌరవించినవి. గౌరవపదవు లనేకములు అతనిని వలచి వచ్చినవి. అచిరకాలముననే పురప్రముఖులలో నొకడయినాడు వీరేశలింగము. ముద్రణాలయమొకదాని నేర్పరచుకొని, తన గ్రంథముల నచ్చువేయుటయు, పత్రికను ప్రకటించుటయు మొదలిడినాడు. వితంతు శరణాలయము, సంఘసంస్కార సమాజమందిరముకూడ స్థాపితమైనవి. బెంగుళూరుకు పోయి, అచ్చటగూడ నొక ప్రార్థన సమాజమును స్థాపించి, దానికొక మందిరమును నిర్మించి యిచ్చెను.

మద్రాసులో జరిగిన అఖిలభారత జాతీయ మహాసభలో సాంఘిక సంస్కరణ సభకు, వీరేశలింగము పంతులు అగ్రాసనాధిపతి. మహాదేవగోవిందరనడేగారు, ఆ సభలో వీరేశలింగమునకు "దక్షిణ హిందూదేశ విద్యాసాగరు"డను బిరుదనామము నిచ్చి గౌరవించిరి.

రెండేండ్ల సెలవు పూర్తియైనది. కాని మద్రాసు పురప్రముఖు లతని నందే నిలుప నిశ్చయించిరి. తన యుద్యోగము రాజమండ్రి కళాశాలలో నగుటచే పంతులుగారు ప్రయాణమునకు సిద్ధపడినారు. కాని యింతలో, చెన్నపురి రాజధానీ కళాశాల యందు ఆంధ్రోపన్యాసకుడుగ నతనిని నియమించినట్లుత్తరువు వచ్చినది. వీరేశలింగమునకు తెలియకయే పురప్రముఖులును అధికారులును కలిసి చేసిన పనియిది. దీనితో నింత

వరకు రాజధాని కళాశాలలో నుండిన కొక్కొండ వేంకట రత్నము పంతులుగారికి స్థాన సంచలనము కలిగినది. కొక్కొండ వారికి వీరేశలింగమునకును బద్ధవైరము కదా! విరోధియైన వీరేశలింగము తన స్థానమున నియమితుడైనందుల కోర్వక కొక్కొండ పండితు డుగ్రుడైనాడు. రాజధానీ కళాశాలలో పండితపదవిని వీరేశలింగము పంతులు స్వీకరింప బోయినాడు. వేంకటరత్నము పంతులుగా రతని మొగమును చూడనొల్లక, బీరువా తాళములు సేవకునిచేతి కిచ్చి పోయిరట.

ఇంటినుండి కళాశాలకు పోయి వచ్చుటకు వీరేశలింగ ముగా రొక గుఱ్ఱపు బండిని కొన్నారు. అంతకుపూర్వ మా గుఱ్ఱము వారి మిత్రులలో నొకనిది. దానికి సుళ్ళు బాగులేవ నియు, దానిని కొన్న తర్వాత తన భార్య గతించినదనియు, ఆ మిత్రుడు చెప్ప, అట్టి పిచ్చి నమ్మకములను లక్ష్యపెట్టని వీరేశ లింగము ఎట్టి యనర్థములు వాటిల్లునో చూతమని, ఆ గుఱ్ఱ మునే కొనెను. నాలుగేండ్ల కాల మా గుఱ్ఱ మతనియొద్ద నుండినది. ఏ యనర్థమును వాటిల్లలేదు. పైగా, బండితోలువా డొకనాడు తప్పత్రాగి స్మృతి తప్పియుండినను, బండిలోని వీరేశలింగ దంపతులను సురక్షితముగ గుఱ్ఱ మిలు చేర్చినది.

వీరేశలింగమునకు 1910 లో సతీ వియోగము కలిగి నది. ప్రతి దినమును సూర్యోదయమునకు పూర్వమే మేల్కొని, ఈశ్వర ప్రార్థన చేసికొనుట ఆమె యలవాటు. ఒకరో జామె ఆరు గంటలకు కూడ లేవకుండుటచే, భర్త చూడబోయినాడు. ఆమె నిదురపోవుచున్నట్లే యుండినది. స్పృశించినతర్వాత కాని

ఆమె జీవయాత్ర చాలించినట్లు తెలియలేదు. భర్తయుద్యమ ములలో నన్ని విధముల తోడుపడిన సాధ్వి యామె. ఇరుగు పొరుగు స్త్రీలను తన యింట చేర్చి, ఈశ్వరప్రార్థనలను జరిపించె డిది. ఆస్తిక భావము నుద్బోధించు కీర్తన లనేకముల నామె రచియించినది. వితంతు శరణాలయములో చేరిన అనాథబాలిక లను అన్ని విధముల రక్షించి పోషించు చుండిన దా యిల్లాలు. అర్ధాంగి వియోగము - వీరేశలింగమునకు భరింపరాని దైనది. చిన్నపిల్లవానివలె నేడ్చినారట పంతులుగారు.

# 4

బహుళప్రజ్ఞాన్వితుడై, సాంఘిక సంస్కరణోద్యమమున 'రావుబహాదూ' రనిపించుకొనిన వీరేశలింగముపంతులు సారస్వత రంగమున కూడ సంస్కర్తయు, యుగకర్తయునై, ఆంధ్ర వాఙ్మయ చరిత్రయందు ప్రముఖ స్థానమును సంపాదించు కొన్నాడు. నూతన సారస్వత ప్రక్రియ లనేకముల నాంధ్రమున నారంభించి, నవ్య వాఙ్మయ సృష్టికి మార్గదర్శకు డైనాడు. పాండిత్య ప్రకర్షతో నితండు రచించిన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము, అచ్చ తెనుగు కావ్యములు, సంధి విగ్రహ ములు ఇత్యాదులు - పండితుల మెప్పు బొందినవి. ఉత్తమకావ్య ప్రచారమునకై, ఆంగ్లమునుండి షేక్స్పియరు నాటకములను, సంస్కృతమునుండి శాకుంతల ప్రబోధచంద్రోదయాది నాటక

ములను గ్రహించి, సరసమగు శైలిలో నాంధ్రమున కనుపదించి నాడు. వీరి రాజశేఖరచరిత్రయను నవల ఆంగ్లమున కనువదింప బడుటయే వీరి రచనాశక్తిని చాటుచున్నది. తర్కము, జ్యోతిషము, వ్యాకరణము ఇత్యాది ప్రాచీన శాస్త్రగ్రంథ ములను కూడ సరళమగు వచనమున రచించి తెలుగు-సారస్వత మున కంగ సౌష్ఠమును కలిగించినారు. బాల బాలికలకును, స్త్రీలకును నుపయుక్తములగు కథల ననేకములను సులభ శైలిలో రచించి విజ్ఞానవ్యాప్తికి మార్గమును వేసినారు. సత్యవతీ చరిత్రను చదివినవారిలో కొందరు తమ బిడ్డలకు సత్యవతి అని పేరు పెట్టుకొనిరట. వీరి "సత్యరాజు పూర్వదేశయాత్ర" ఆ కాలమున పలువుర నాకర్షించినది. కథానాయకుడగు సత్య రాజు చిరునామాకొరకై పంతులుగారికి పలువు రుత్తరములు వ్రాసిరట. పాఠశాలల యుపయోగార్థము చక్కని వాచక ములను కూడ రచించి విద్యావ్యాప్తి కెంతో తోడ్పడినారు పంతులుగారు. శరీరశాస్త్రము, 'జంతుస్వభావ చరిత్ర' ఇత్యాది ఆధునికశాస్త్ర గ్రంథములను తెలుగున రచించుటకు మొదలిడిన వారును పంతులుగారే. ఈగ్రంథములను రచించుటలో శ్రమకును ధనవ్యయమునకును నేమాత్రమును లెక్కింపక, కంకాళాది పరికరములను, చిత్రపటములను, విదేశముల నుండి కూడ తెప్పించి, స్వయముగ విషయము నధ్యయనము చేసిన పిమ్మటనే గ్రంథరచన కారంభించినారు. పరిశోధనపూర్వకమగు ఆంధ్ర సార స్వత చరిత్ర రచనకు వీరి "ఆంధ్ర కవుల చరిత్ర"యే శ్రీకారము. ఈ గ్రంథరచనకు గావలసిన విషయసేకరణకై పంతులుగారు

కొన్ని నెలలకాలము తంజావూరు సరస్వతీమహాలు పుస్తక భాండాగారమునను, చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండా గారమునను, నిరంతర దీక్షతో ప్రాచీన తాళపత్ర గ్రంథముల పరిశీలన గావించినారు. వీరి జిజ్ఞాస యిట్టిది.

ఉత్తర హరివంశము, మొల్ల రామాయణము, ప్రభావతీ ప్రద్యుమ్నము, ప్రబోధ చంద్రోదయము, మున్నగు ప్రాచీన కావ్యము లనేకములు పంతులుగారి సంస్కరణలతో ప్రచురితము లైనవి. వీరు రచించిన నూతన గ్రంథముల సంఖ్యయే ఎనుబదికి మించినది.

ఇట్టి సారస్వతోపాసన, పంతులుగారు తమ జీవితాంతము వరకును నుత్సాహముతో సాగించినారు. అదియే వారి వినో దము. అవసాన దినమున కూడ, అప్పుడు ముద్రిత మగుచుండిన కవుల చరిత్ర యందలి పత్రములను సవరించినారు. సాయంకాల మునకు జబ్బు ఎక్కువైనది. కాశీనాథుని నాగేశ్వరరావుగా రీయన యొద్ద కూర్చొని "మీ కేమైన కోర్కె లున్నవా" యని యడిగినారు. ఏమియు లేవన్నారట - నిశ్చింతులు, పూర్ణజీవులు నైన వీరేశలింగముగారు. మరునాడు [1919 వ సంవత్సరము మే నెల 27 వ తేదీ] ఈ మహనీయుడు పంచ భూతములలో కలిసిపోయినాడు.

రాజమహేంద్రవరములో నీ జీవన్ముక్తుని దివ్యస్మృతిచిహ్న ముగ నితని విగ్రహము స్థాపితమై యున్నది. ఆ విగ్రహ పీఠముపై—

" తన దేహము, తన గేహము,
తన కాలము, తన ధనంబు, తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుఁ డీ వీరేశలింగ కవి జనులారా! "

అను పద్యము లిఖితమై యున్నది. ఆయన కారణ జన్ముఁడు. ధన్యజీవి.



వి ప్లవ యో గి

# అరవింద ఘోషు

" దేశార్థమున కుపయోగింపని ఆత్మోద్ధరణము ఉద్ధరణమే కాదు. "

— అరవిందయోగి.

## " వందేమాతరమ్ "

దాస్యమున గ్రమ్గుచుండిన మన దేశమాతకు ప్రజలొనర్ప వలసిన సేవ నుద్బోధించుచు మహర్షి బంకించంద్రుడు తన 'ఆనంద మఠ' మను నవలలో ఒక పాటయందు ఈమాటల నే సుము హూర్తమున నుపయోగించెనో కాని ఇవి భారతీయులకు నిత్య మనన యోగ్యములైనవి. జాతికి జీవము పోసి యెంతటి త్యాగ మున కైనను ఉత్సాహము కల్పించినవి.

ఎట్టి విషయమునందైనను భారత దేశమున ముందంజ వేయునది వంగభూమియే. తక్కినవారికంటె ముందుగా వంగీ యులే పాశ్చాత్య వ్యామోహమున బడిరి. తాము పడుటయే కాదు, దేశమునంతను ఆ వ్యామోహమున ముంచిరి. మరల వారే అందరకంటె ముందుగా మేల్కొనిరి. బంకించంద్రుని 'వందేమాతర'మను శంఖారావము జాతికంతకును స్వాతంత్ర్య సాధక మంత్రమైనది. భారతీయుల ఆధ్యాత్మిక విజ్ఞానము ఆచరణయోగ్యమని భగవత్సాక్షాత్కారము నందిన శ్రీరామ కృష్ణ పరమహంస నిరూపించెను. ఆ పరమయోగి శిష్యుడు

శ్రీ వివేకానందస్వామి భారతీయ సంస్కృతి ప్రాశస్త్యమును దేశదేశముల ప్రకటించి, దాని విలువ నెరుగక యున్న జనుల కనులు విప్పినాడు. దానితో భారతీయుల కాత్మప్రత్యయము కలిగినది. అన్ని రంగములలో భారతీయుల ప్రతిభ వ్యక్తము కాసాగినది.

వంగభూమి యిట్టి నూతన వికాసము నందుచుండిన దినములలో జాతిలో అంతర్నిహితమైయున్న సర్వశక్తుల సమ్మేళనమో అన్నట్లు, 1872 వ సంవత్సరము ఆగస్టు 15వ తేదీన అరవిందు డుద్భవించెను. ఆగస్టు 15 భారతీయులకే కాదు, సర్వప్రపంచమునకు పర్వదినము. కలియుగమునగూడ భగవంతుని ప్రత్యక్షము చేసికొను మహానుభావు లున్నారని లోకమునకు విదిత మొనర్చిన శ్రీ రామకృష్ణ పరమహంస మహాసమాధిగతుడైన దా దినముననే. ఏసుక్రీస్తు కన్నతల్లి యగు మేరీ కన్యను దేవతలు స్వర్గమునకు గొంపోయినది ఆ దినముననే యని క్రైస్తవులు విశ్వసింతురు. అరవిందు డవతరించిన ఆ పుణ్యదినముననే కదా భారతదేశము స్వాతంత్ర్యము నందినది! ఇది యొక్కటి చాలు, అరవిందుడు కారణజన్ముడని నిరూపించుటకు.

జాతీయాభిమానము మహోద్వేగముతో వెల్లి విరియుచున్న దినములలో, అరవిందుని తండ్రియైన కృష్ణధనఘోషు పాశ్చాత్యమైన దంతయు సర్వోత్కృష్టమైనదని విశ్వసించెడివాడు. ఆయనకు మాతృదేశముపై భక్తి లేకపోలేదు. తన దేశమభివృద్ధి నందుటకు పాశ్చాత్యులతో [illegible]

శరణ్యమని హృదయ పూర్వకముగ నమ్మినవాడు. ఇతడు ఇంగ్లండు పోయి వైద్య విద్య నభ్యసించి నాస్తికుడై స్వదేశము నకు వచ్చెను. అధమస్థితిలో నున్న భారతీయ సంఘములోని దురాచారములు తన కుమారులకు పట్టువడరాదని వారి నంద రను ఆంగ్లేయులు నడపు పాఠశాలల యందే చదివించెను. ఇంటి యందు కూడ వంగభాష వినపడరాదను దృష్టితో నతడు, ఆంగ్లముననో హిందీలోనో మాటలాడు పరిచారకులనే నియ మించెను. ఇంతటి పాశ్చాత్య వ్యామోహముగల ఈయన సతీమణి స్వర్ణలతాదేవి, బ్రహ్మసమాజ నాయకులలో నగ్ర గణ్యుడై, ఋషి యని ప్రసిద్ధికెక్కిన రాజనారాయణ బోసుగారి పెద్ద కుమార్తె. ఆమె విద్యావతి, తండ్రివలె మతాభిమానము కలది. తన విశ్వాసముల కనుగుణముగా కథలు, నాటకములు వ్రాయుచుండిన రచయిత్రి. భర్త అభీష్టము ననుసరించి వేష భాషలు మార్చుకొన్నను, తండ్రి నుండి సంక్రమించిన మతాభి మానము నామె తుదివరకు వీడలేదు. సహజముగా దయార్ద్ర హృదయు డగుటచే ఆర్జించిన ధన మంతయు తన కుమారులకు గూడ లేకుండ పేదసాదలకు వినియోగించి, వారి కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. కృష్ణధనుడు పాశ్చాత్య సభ్యతపై మోహ మును, ప్రాచ్య సభ్యతపై నసహ్యమును ఏ మాత్రము సడలించు కొనలేదు. ఈ దాంపత్యమే చాల చిత్రమైనది. వీరి మూడవ కుమారుడగు అరవిందుడు సర్వ ప్రపంచమును భారతీయాధ్యా త్మిక విజ్ఞానాభిముఖముగా నాకర్షించు మహాయోగి యగుట మరింత విచిత్రము.

అరవిందు డన్నలవలెనే ఆంగ్లేయ బాలురమధ్య ఆరేండ్ల ప్రాయము వరకు డార్జిలింగులోని కాన్వెంటు పాఠశాలలో చదివెను. అంతవరకు మాతృభూమియందే యున్నను, ఇంటను బయటను ఆంగ్లవాతావరణమే యగుటచే, అతనికి మాతృభాష వినిపించెడిది కూడ కాదేమో! ఏడేండ్లు వచ్చునప్పటికి తండ్రి అతనిని చదువునకై ఇంగ్లండునకు తీసికొని పోయెను. పెద్ద వారగు వినయభూషణ, మనోమోహనులను మాంచెస్టరు వ్యాకరణ పాఠశాలలో చేర్పించి, అరవిందుడు చిన్నవాడగు టచే నతనిని డ్రూయట్ దంపతుల అధీనములో నుంచెను. డ్రూయట్ దొర లాటిన్ భాషలో మంచి పండితుడు. ఇంట నుండి చదువు కొనుటయే కావున అరవిందునకు చాల విరామము లభించినది. ఆ చిన్న వయస్సుననే అతడు క్షణమైనను వృథాపోనీయక కనిపించిన పుస్తకమెల్ల చదివెడివాడు. అక్కడ నుండగనే అతడు బైబిలు చదివెను. షేక్స్పియరు, షెల్లీ, కీట్సు మున్నగు మహాకవుల గ్రంథములు పఠించెను. చదువు, చదువు, చదువు - ఇది తప్ప అతనికి మరొక చింత యుండెడిది కాదు. తత్త్వ శాస్త్రముపైగాని, మతవిషయములపై గాని అతని కప్పటికి అభిమానమే లేదు. భారతీయులను చూడనీయ వలదనియు, భారతీయ వ్యవహారము లాతనికి తెలుపవలదనియు కృష్ణధనుడు డ్రూయట్ దంపతులకు మరిమరి చెప్పిపోయెను. ఆ దంపతు లింగ్లాండులో నున్నంతకాల మట్లు చేసిరి. అరవిందుడు డ్రూయట్ దొరకడ లాటిన్ భాష నమితవేగముగా నేర్చుకొనియెను. దానిలో మంచి అభివృద్ధిని కూడ సాధించెను.

అంతలో డ్రూయట్ ఆస్ట్రేలియా పోవలసివచ్చుటచే అరవిందుడు సెయింట్‌పాల్ పాఠశాలలో చేరెను. అరవిందుని ధీశక్తికి మెచ్చి అచటి ప్రధానోపాధ్యాయుడు అతనికి ప్రత్యేకముగ గ్రీకుభాష నేర్ప నారంభించెను. కొలది కాలములో నా భాషగూడ అతనికి ప్రత్యేకముగ కొట్టినపిండి యైనది. ప్రపంచములో నర్థముకాని యే విషయము నైనను ఆంగ్లేయులు గ్రీకు లాటినులవలె నున్న దందురు. అనగా ఆ భాష లంత కష్టమైనవని వారి యభిప్రాయము. పరభాషయగు నాంగ్లముతోపాటు, దానికి మూలము లైన గ్రీకు లాటిను భాషలను అంత అవలీలగా, అంత బాల్యమున నే, విధేయము చేసికొనిన అరవిందుని ధీ విశేష మెంతటిదో కదా! అతడా వయసున సాధించిన విజ్ఞానమునకు భగవంతు డిచ్చిన ప్రతిభా సామర్థ్యము లెంతటి హేతువులో అతడు చూపిన శ్రద్ధయు నంతయే హేతువు. బడిలో చెప్పు పాఠములతో నాత డెప్పుడును తృప్తిపడి యుండలేదు. చెప్పినదియెల్ల శ్రద్ధాభక్తులతో నేర్చుకొనుచు, ఆతురతతో, అందిన వన్నియు గ్రహించెడివాడు. ఇట్టి జ్ఞానతృష్ణయే జీవితమంతయు నిలిచియున్న యలవాటయి, అతని నంతటి యోగిగ చేసినది.

పదునేడవయేడు వచ్చుసరికి కేంబ్రిడ్జి కింగ్సు కళాశాల వారి పోటీ పరీక్షలో పాల్గొని, మహాకవులగు షేక్స్పియను - మిల్టనుల తారతమ్యమును తెలుపు ఉత్తమ వ్యాసమును వ్రాసి, ఎనుబది పౌండ్ల విద్యార్థి వేతనము నందుటయే కాక, కాబోవు నాస్థానకవియగు ఆస్కారు బ్రౌనింగు కవివర్యుని ప్రశంసకు కూడ పాత్రుడైన విద్యార్థి అరవిందుడు! అప్పు డరవిందుడు

రచించినట్టి యుత్తమ వ్యాసమును పదుమూడేండ్లుగా తానెరిగిన విద్యార్థులలో నెవ్వరును రచించి యుండలేదని ఆ కవివర్యుడే ప్రకటించెను. ఆంగ్లేయులను కూడ మించి ఆంగ్లమున వ్రాయగలుగుటయు, ఆంగ్ల కవివర్యుని మన్ననలకు పాత్రుడగుటయు, సామాన్య విషయములు కావుగదా! అరవిందుని విద్యార్థిదశలోని ప్రతిభా ప్రాగల్భ్యమట్టిది.

పరిస్థితు లనుకూలించినచో నెట్టి విజయములనైన సాధింపవచ్చునని సామాన్యు లనుకొనుచుందురు. ప్రాతికూల్యము నతిక్రమించి పట్టుదలతో విజయమును సాధించుచే మహాత్ముల లక్షణము. భారతదేశమున కృష్ణధను డెంత డబ్బు సంపాదించినను, అవసరమైనప్పుడు కుమారులకు ద్రవ్యము పంపలేకపోయెడివాడు. అరవిందు డీ అసాధారణ విద్యా విజయమును సాధించినప్పుడు దారిద్ర్యమునే అనుభవించుచుండెను. అప్పుడప్పుడు తినుట కేమియు లేక పాలు పంచదారయు లేని తేనీటితో తృప్తినందెడివాడట. ధరించుటకు తగిన దుస్తులు లేక తన గదిలోనే కాలము గడిపిన దినములును గలవట. వినయభూషణుడు చదువుకొనుచు నుద్యోగము చేయవలసివచ్చెను. ఈ స్థితిలో నుండినను అరవిందుడు చదువునందు శ్రద్ధను సడలింపలేదు. నేర్చిన భాషలు చాలక జర్మన్, ఇటాలియన్ భాషలనుకూడ నభ్యసించెను. ఫ్రెంచి సాహిత్యము నాపోశనము పట్టెను. ఐరోపా చరిత్రయంతయు నర్థము చేసికొనెను. అవియివి నేర్చుకొను చున్నానుగదా యని కళాశాలచదువులో వెనుకబడలేదు. అక్కడ ప్రథమ బహుమానములన్నియు నత

నివే. ఇంత ఇబ్బందిపడుచు, ఇన్నిపనులు చేయుచున్నను, ఎంతయో కాలము కవితా రచనకై వినియోగించెడివాడట! అత డాకాలమున రచించిన 'హెగ్యుబా' అను గేయము లారెన్సు బన్యాన్ కవివర్యుని ప్రశంసకు పాత్రమైనది. ఆంగ్ల కవితాకన్య అతనిని పదునాలుగేండ్ల వయసుననే వరించినది.

కింగ్సు కళాశాలలో చేరిన రెండేండ్లకే అరవిందుడు "ట్రైపాసు"పరీక్షలో మొదటిభాగమున ప్రథమశ్రేణిలో నుత్తీర్ణుడయ్యెను. మూడేండ్లు చదువవలసిన పరీక్ష యిది. అట్లు చదివిన వారికి వెంటనే "బి. ఏ." డిగ్రీ యిత్తురు. రెండేండ్లు మాత్రమే చదివినవాడు గాన అతనికది రాలేదు. ఇట్టివారు, డిగ్రీ కావలె నన్న నాలుగవ యేట రెండవ భాగమునకు కూర్చుండవలెను. లేదా డిగ్రీకి గల అర్హతను తెలుపుకొనుచు అభ్యర్థనము చేయవలెను. ఒక్క విశ్వ విద్యాలయములో తప్ప తక్కినచోట్ల డిగ్రీల కింగ్లాండులో విలువలేకుండుటచే అరవిందు డీవిషయము నందు శ్రద్ధ చేయలేదు. కాని తండ్రి అభీష్టము ననుసరించి ఐ. సి. యస్. పరీక్షకు స్వయంకృషితో హాజరయి, అందులో చాల నుత్తమశ్రేణిలో నుత్తీర్ణుడయ్యెను. అయినను ఆంగ్లేయుల బంటుగా భారతీయులపై నధికారము చెలాయించుట కిష్టము లేకయే కాబోలు, గుఱ్ఱపు స్వారిలో విజయమందుటకు ప్రయత్నముగూడ చేయలేదు. తలచినచో నిది అరవిందుని వంటివాని కసాధ్య మెన్నడును కాదు. అనుభవము లేకున్నను తుపాకి పట్టిన మొదటి పర్యాయమే అగ్గిపుల్ల మొనను గురి చూచి కొట్టగలిగిన ప్రజ్ఞానిధికి గుఱ్ఱపుస్వారి యొక లెక్క

లోనిదా ? దానిపై నిష్టములేకయే మానివేసినాడు. ఇట్టి నిర్ణయములలోననే పరమేశ్వరుని లీలావిలాసము ప్రస్ఫుటమగును. తండ్రియభీష్టము ప్రకారము అరవిందుడా పరీక్షయందు పూర్తిగా నుత్తీర్ణుడైయుండినచో అతడు మహాయోగి అయ్యెడివాడు కాడేమో !

చిన్నప్పుడు మనసున నాటిన విషయములు జీవితాంతము నిలుచును. ఇది సాధారణముగా మానవస్వభావము. అరవిందుని బాల్యము, విద్యాభ్యాసము, అన్నియు ఆంగ్ల వాతావరణముననేసాగినవి. ఇంగ్లాండునం దున్నంతవరకు అతడు భారతీయ విజ్ఞానమునకు దూరముగనే యుండెను. నేర్చినవన్నియు పాశ్చాత్యభాషలు ; భారతీయ భాషలలో నొక్కదానితోనైన అతనికి పరిచయములేదు. ఐ. సి. యస్. పరీక్షకు ఆంగ్లేయులెట్లు భారతీయ భాషలలో నొకదాని నభ్యసింతురో అట్లే అరవిందుడును మాతృభాష నభ్యసించెను. అదియును పదునెనిమిదవ యేట, ఆభాష మాటలాడుటగూడ నంతగా దెలియని యొకానొక దొరయొద్ద ! జాతీయ సభ్యత నెంతమాత్రము ప్రేమింపని తండ్రికి తనయుడై, విజాతీయ సభ్యతలో చిన్నతనమునుండి పెరిగి పెద్దవాడైన అరవిందునకు, పాశ్చాత్య సభ్యతపై నభిమాన మేల జనింపలేదు ? భారతదేశమున నడుగు పెట్టుటయే తడవుగా స్వదేశసంస్కృతిని పటిష్ఠముగా సమర్థించు జాతీయాభిమానము కలవా డెట్లయ్యెను ?

అరవిందుడును నతని నామమే యీ ప్రశ్నములకు సమాధాన మీయగలదు. కృష్ణధనున కీ పే రెట్లు తోచెనో కాని, అర

విందుని జీవిత పరమార్థ మిందులోననే యున్నది. భారతీయుల దృష్టిలో అరవిందము వికాసమునకు చిహ్నము. అది పంకజము. అయినను పంకము నతిక్రమించి, ఊర్ధ్వముఖమై, దివ్యతేజస్సుచే వికాసము నందును. అరవిందుని పూర్ణయోగమునకు లక్ష్యము, భౌమమును దివ్యమొనర్చుటయే కదా ! అదియే పరమేశ్వరుని లీల !

అరవిందమువలెనే అరవిందుడును తాను పెరిగిన వాతావరణమును ద్వేషింపలేదు. దాని సారమునంతను గ్రహించి తత్త్వమునే మార్చి వికసించెను. తండ్రినుండి అతనికి సంక్రమించినది అచంచల దీక్షమాత్రమే. అది మహాయోగమునందిన అమరారవిందమునకు నాళము వంటిది. అరవిందునిలో నాతని తల్లి కోవనుండి వచ్చిన ఆధ్యాత్మికత ప్రఫుల్లత నందినది. అది వేరూనుటకు ముందు ఆంగ్లదేశవాసమున నతనికి కలిగిన ప్రధాన ప్రయోజనములలో మొదటిది స్వాతంత్ర్య కాంక్ష. పాశ్చాత్య సంస్కృతి కేవలము భౌతికమైనది, అనెడి వివేకము రెండవది.

అన్నిటికంటె విచిత్రమేదియన, ఈ రెంటికి నతని తండ్రియే హేతువగుట. అత డరవిందు నింగ్లాండునకు పంపక పోయినచో నివి యింత గాఢము లయ్యెడివి కావేమో ! కృష్ణధనునకు జాతీయ సంస్కృతియం దిష్టము లేకున్నను మాతృదేశము నుద్ధరింపవలెనను కాంక్ష యున్నది. విజాతీయ సంస్కృతిపై నతనికెంత యభిమానమున్నను తన దేశమున నాంగ్లేయ పాలకులు చేయుచున్న దౌర్జన్యములను ఖండించుట కతడు వెనుదీయలేదు. ఇంగ్లాండున నున్న కుమారులకు వ్రాయు

నుత్తరములలో బ్రిటిషు ప్రభుత్వ నిరసనమే అధికముగా ఉండె డిది. అప్పుడప్పుడు 'బెంగాలీ'యను పత్రికలో తాను పరప్రభుత్వ మును విమర్శించుచు వ్రాసిన వ్యాసభాగములను పంపుచుండెడి వాడు. తండ్రిచేసిన యీ పరోక్షబోధయే ఆతని కుమారులలో దేశభక్తి బీజములు నాటినది.

అరవిందుడు పధునైదేండ్ల ప్రాయముననే మాతృదేశ సేవకై జీవితము నంకిత మొనర్పవలెనను నిశ్చయమునకు వచ్చెను. కేంబ్రిడ్జి కళాశాలలో నుండగా, 'ఇండియన్ మజ్లిస్' అను సంస్థకు కార్యదర్శి యయ్యెను. అందలి చర్చలలో తరచు పాల్గొని బ్రిటిషు సామ్రాజ్య తత్త్వమును తీవ్రధోరణిలో విమ ర్శించెడివాడు. ఈ ఉపన్యాసముల మూలముననే, గుఱ్ఱపుస్వారి నేర్వలేదను నెపమున ఐ. సి. యస్. పరీక్షలో నితనిని తప్పించి రని కొందరందురు. అది నిజము కూడ కావచ్చును. ఆంతర్య మున అపజయ మపేక్షించిన వాడుగాన అరవిందు డెన్నడును దానికై విచారింపలేదు. ఇంగ్లాండున నున్న భారతీయులు ఆంగ్లేయులవలె స్వాతంత్ర్యము ననుభవించు చున్నను వారి చర్యల నన్నిటిని గూఢచారులు గమనించుచునే యుండెడి వారు. అన్నలతోగూడి అతడును, మితవాదుల అభిప్రాయము లతో నేకీభవింపక, తీవ్రవాదులైన యువకులతో సంచరించెడి వాడు. ఆ దినములలో నింగ్లాండున నున్న భారతీయులు లండ నులో సమావేశమై ఒక రహస్య విప్లవ సంస్థను స్థాపించిరి. అరవిందు డా సంస్థలో సభ్యుడై మాతృదాస్య విముక్తికై ఏ సాహసమునైన చేసి తీరవలెనని ప్రతిజ్ఞ గైకొనెను.

తల్లియొడినుండి దూరముగా త్రోసివేయబడిన బిడ్డ మరింత యుద్వేగముతో మాతృ వక్షమున తలదాచు కొనబోవునట్లు, అరవిందుడు ఆంగ్లదేశమునం దుండియు మాతృదేశ మహో దయమునకై తహతహలాడెను. అక్కడనుండుటచే వారి భాషా సాహిత్యములపై ప్రేమ కలిగినదేకాని, ఆ దేశమన్నను వారి రాజకీయ విధానము లన్నను అతనికి గౌరవము కలుగలేదు. పైగా, అతనికి స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న ఐరిషువారి యెడల మహాభిమాన మేర్పడినది. ఐరిషు వీరుడగు పార్నెలును గురించి అతడొక గేయమును గూడ వ్రాసెను. ఐరోపా ఖండ మందలి దేశము లన్నిటిలో ఫ్రాన్సన్నచో నతని కభిమాన మెక్కువ. పదునాల్గేం డ్లింగ్లాండులో నున్నను ఫ్రాన్సు కొక్క మారైన పోవు నవకాశము లభింపలేదు. అయినను ఆ దేశముపై అతని కభిమానము కలుగుటకు ఫ్రెంచివారి విప్లవమే హేతువు. తుద కతడు జీవితమున నధిక భాగము, అందునను విశిష్టభాగము ఫ్రెంచిపాలిత ప్రాంతమున గడపుట దైవ నిర్దేశముననే కాక కా యభిమానమువలవ కూడ కావచ్చును. స్వాతంత్ర్యమునకై ఐరిషు ప్రజలును, ఫ్రెంచి వారును. ఇటలీ దేశస్థులును నవలం బించిన మార్గములు గ్రహించి, భారత స్వాతంత్ర్యమును సాధించి తీరవలెనను తీవ్రకాంక్షతో అరవిందు డాంగ్ల దేశము నుండి స్వదేశమునకు మరలెను.

ఐ. సి. యస్. పరీక్ష తప్పుటచే అరవిందున కొక విధముగా స్వాతంత్ర్యము లభించినది. ఆంగ్లేయుల బంటుగా నుండవలసినగతి తప్పినందుల కత డంతరంగములో సంతసించి

యుండును. ఆసమయమున నింగ్లాండు నందున్న బరోడా మహారాజు అరవిందుని ప్రతిభాసామర్థ్యములను ఆంగ్లేయ మిత్రుల మూలమున విని ఆతనికి తన సంస్థానములో నుద్యోగ మిచ్చెను.

కృష్ణధనుడు తన కుమారులు చాల గొప్పవారగుదురని గర్వించుచుండెడివాడు. అందరలో నతని కరవిందుడన్న బహిః ప్రాణమే. అట్టికుమారుడు పయనించుచుండిన యోడ, దారిలో ప్రమాదవశమున మునిగిపోయినదను తప్పువార్త అతనికందినది. దానితో నా తండ్రి క్షోభపడి, ప్రియపుత్రుని నామము స్మరించుచునే మరణించినాడు. నిజమున కరవిందు డే ప్రమాదమునను చిక్కుకొనలేదు. మునిగినదన్న యోడ అతడున్నది కానేకాదు. పాపమా తండ్రికి కుమారుని అభ్యుదయము చూచు నదృష్టము లేకపోయినది.

★ ★ ★ ★

స్వదేశమున నడుగుపెట్టునాటి కరవిందునకు ఇరువది యొక్క వత్సరములు. అంతవర కతనికి భారతీయ విజ్ఞాన మాహాత్మ్యముగాని, ఆధ్యాత్మికౌన్నత్యముగాని, శాస్త్ర సంప్రదాయములుగాని, ఏమియు తెలియవు. నీటి తుంపురులచే చల్లబడని తప్తలోహమువలె పాశ్చాత్య విజ్ఞానముచే నతని జ్ఞానతృష్ణ శాంతించినది కాదు. ధారావాహినిగా నీరు పడిన గాని తప్తలోహము చల్లారదు. సర్వజ్ఞత్వము సిద్ధించిన గాని జ్ఞానతృష్ణ అణగదు. బరోడాలో నున్న కాలమునంతను అరవిందుడు జ్ఞానసంపాదనకే ఉపయోగించెను.

అప్పటి బరోడా మహారాజు తక్కిన సంస్థానాధీశులవలె పాశ్చాత్య పాలకుల అడుగులకు మడుగులొత్తువాడు కాడు. స్వతంత్ర బుద్ధియై సానురాగ హృదయముతో ప్రజల నుద్ధరింప నెంచినవాడు. కావుననే ఆయన, సమర్థులైనవారి నుద్యోగులుగా నెన్నుకొని వారికి స్వేచ్ఛ నిచ్చెడివాడు. అరవిందుడు మహారాజున కాంతరంగిక కార్యదర్శిగా కొన్నాళ్ళుండి, తన యిష్టము ననుసరించియే వేరువేరు శాఖలలో పని చేసి, విద్యాశాఖలో కుదురుకొని, తుదకు సంస్థాన కళాశాలకు ఉపాధ్యాయుడయ్యెను. మహారాజున కరవిందుడన్న చాల గౌరవము. అరవిందు డంగీకరించినచో దివానుపదవి నిచ్చి యతనిచే ప్రజాసేవ చేయింపవలెనని తలపోసెడివాడు. జ్ఞానసంచయ దీక్షతోనున్న అరవిందుడు దాని కాశింపలేదు. స్వీయ లక్ష్యసిద్ధి కెక్కువ అవకాశమిచ్చు అధ్యాపక వృత్తినే వరించెను. ఏ పదవిలో నైనను సరియే, ఆయన తమ సంస్థానముననుండుటే భాగ్యమని మహారాజు సంతోషించినాడు. నెలకు రెండు వందల రూప్యములతో మొదలిడిన అరవిందుని వేతనము ఉపాధ్యాయుడగు నాటికి తొమ్మిదివంద లయినది. ఏలికవాని యాదరమును, అధిక వేతనమునుకూడ ఆకారణజన్ముని, సంస్థానమునకు కట్టివేయ లేకపోయినవి. అంతర్వాణి ఆదేశము వినిపించినతోడనే అన్నిటి నతడు తృణప్రాయముగా త్యజించి, మాతృదేశ సేవకై కార్యరంగమున కురికెను. తల్లి పిలుపును విన్న తనయుని తహతహ యట్టిది!

జాతీయ విజ్ఞానముతో పరిచయము లేకున్నను, స్వదేశమునకు వచ్చునాటికే, అతనికి దేశమాత దాస్యబంధములను విడ

గొట్ట వలెనను గాఢకాంతు కలిగినది. భారతీయ విజ్ఞానము దానిని బలీయమొనర్చినది. గరుడుడు దేహబలముచే దేవతల జయించి, అమృతముతెచ్చి తల్లిదాస్యము తొలగించినాడు. కాని అరవిందు డందుల కవలంబించిన మార్గము వేరు. పాలకుల కే కాదు. మానవలోకమున కంతకును, - తనివిదీర గ్రోలునట్లు దివ్యజీవనామృతమును వెల్లివిరియజేసినా డరవిందుడు. కర్మ యోగియై జాతికి ఉత్తేజము కలిగించినాడు.

అరవిందున కారంభమున దేశదాస్య మోచనమే లక్ష్యము. దానినిగూర్చి యత్నించుటకుముందు దేశము నెరుంగ వలె ననుకొనెను. అతని కప్పటికి మాతృభాషయందు, గణింప దగిన పరిచయమునులేదు. కావున మొదట నా భాష నేర్చి అందలి సాహిత్యములో మునిగితేలెను. మధుసూదనదత్తు, బంకిం చంద్రుల రచనలు అతనిని మిక్కిలిగా నాకర్షించినవి. వారిపై నాత డాంగ్లమున ప్రశంసాగేయములను గూడ రచించెను. కొలది కాలములోనే దినేంద్రకుమార రాయిగారి సహాయ ముతో వంగభాషా పాండిత్యము కూడ సంపాదించెను. ఇంత చేసియు, మాతృభాషలో ప్రసంగించుటకు మాత్ర మెన్నడును సాహసింపలేదు. బాల్యము నుండియు నాంగ్లభాషతో వ్యవహ రించి యుండుటయే దానికి హేతువు. కాని రచనాపాటవమున తుల్య సామర్థ్యమునే ప్రదర్శించెను.

వంగభాషాసాహిత్య మెంత గొప్పదైనను భారతాత్మను సాక్షాత్కరింపజేయుట కది సమర్థముకాదు. దానికేకాదు. ఏ దేశభాషకును నా సామర్థ్యములేదు. సరిగదా, అన్నింటి సాహి

త్యములు కలిసియు దానిని సాధించుటకు సమర్థములు కాజా లవు. దేశభాషల వెలుగులన్నియు స్వయంప్రకాశమైన దేవభాష నుండి సంక్రమించినవే కదా! ఆ దేవభాష అందుబాటులో నుండ అద్దములోని నీడనుచూచి తృప్తిపడుటెందులకు? కావు ననే అరవిందుడు గీర్వాణవాణిని నేర్చి మూల గ్రంథములనే చదువసాగెను. సహజముగా కవియైన అరవిందునకు కాళిదాస భవభూతులును, వాల్మీకివ్యాసులును, స్వస్వరూపములతో సాక్షా త్కరించుటయే కాక భారతీయసంస్కృతి యెంత యున్న తమో, ఎంత విశాలమో, ఎంత గంభీరమో స్పష్టముగా ప్రక టించిరి. అరవిందున కందలి యుపాఖ్యానములెన్నియో అత్యద్భు తము లనిపించుటచే వాని నాంగ్లమున కనువదించెను. అతని మహాకావ్యమగు "సావిత్రి" కాధారమైనది ఇందలి సావిత్ర్యు పాఖ్యానమే. యముడు కొనిపోవుచున్న సత్యవంతుని జీవము లను పతివ్రతయైన సావిత్రి నిర్విరామసాధనచే సంపాదించి భర్తను బ్రతికించుకొన్నట్లు, తానును తన యోగముచే దివ్య జీవనము నవతరింపజేయుట, ఇతివృత్తముగా అతని మహా కావ్యము సాగినది. అది ఆ మహాయోగి ఆత్మనుండి ఆవిష్కృత మైన యమృతము.

సాహిత్యము హృదయమును సంస్కరించునేకాని సాధన మార్గముల నుపదేశింపదు. జిజ్ఞాసువగు నరవిందుడు సాహిత్య ముతో తృప్తిపడక శాస్త్ర గ్రంథములను కూడ చదివెను. నిరంతర మననముచే ఉపనిషత్తుల ఆంతర్యము గ్రహించెను. భగవద్గీత యతనికి నిత్యపారాయణ గ్రంథమగుట మాత్రమే

కాక జీవితలక్ష్యసిద్ధికై ప్రయాణము చేయవలసిన దుర్గమ మార్గమున ఆంతరంగిక మిత్రమైనది.

కొండనెక్కువాని లక్ష్యము శిఖరాగ్రమును చేరుటయే. అయినను దారిలో నచటనచట దృష్టి నాకర్షించు వింతలకు కనులు మూసికొనడు. అట్లని లక్ష్యమును మరచి వానినే చూచుచు నూరకుండడు. అట్లే అరవిందుడును భారతాత్మ సాక్షాత్కారమునకు కృషి యొనర్చుచునే, ఎప్పటి కప్పుడు దేశ విదేశముల వెలువడుచున్న నూత్న గ్రంథములు పఠించుచునే యుండెను. బొంబాయిలో నున్న రెండు ప్రధాన పుస్తక విక్రయశాలలు క్రొత్తపుస్తకములను నెలనెలకు నతనికి పంపు చుండెడివట! వేతనములో నధికభాగము వీనికే వినియోగించి మాసాంతమునకు చేబదుళ్ళతో నితడు కాలక్షేపము చేయవలసి వచ్చుచున్నను అరవిందుని జ్ఞాన సంచయ దీక్ష ఇంచుకంతయు సడలెడిదికాదు. దీనికి తోడు పరిస్థితులను బట్టి యతడు మరి కొన్ని భాషలు నేర్వవలసి వచ్చెను. బరోడా సంస్థాన పాలకులు మహారాష్ట్రులు. ప్రజలు గుజరాతీయులు. అందుచే అరవిందుడు ఆ రెండుభాషలలో కూడ పరిచయము సంపాదించెను.

రాజకీయముగా స్వాతంత్ర్య మందినగాని భారతీయ విజ్ఞాన వికాసమున కవకాశము లేదు. స్వాతంత్ర్యము సర్వా భ్యుదయములకు ప్రథమ సోపానము. దానిని సాధించుట కేసాహసమునైన చేయవలెనని ప్రతిజ్ఞగైకొని స్వదేశమునకు వచ్చిన అరవిందునకు భారతీయ విజ్ఞాన సంపర్కముచే ఆ కాంక్ష బలీయమైనది. తా నందులకే అవతరించెనని యతని కనిపించెను.

అది యథార్థమని ఆతని జీవితము నిరూపించినది. అట్లే దేశమును గూర్చిన యతని యూహాలును ఎప్పటికైన నిజము కాగలవు.

చాలమందికి దేశము నాలుగెల్లల నడుమ నున్న భూమి భాగమనియే తోచును. అది మట్టికాదనియు అందలిజనులే దేశ మనియు, వారి యుద్ధరణమే ప్రధానమనియు, కొందరకు తోప వచ్చును. అరవిందునకు, పెంచి పెద్దచేసి పరమోపదేశము చేయు తల్లియే దేశ మనిపించినది. ఆ తల్లి రక్తమును రాక్షసులు పానము చేయుచుండ ఏ కుమారుడును చేతులు కట్టుకొని కూర్చుండలేడు గదా! మాతృదాస్య విమోచనకై అవతరించిన అరవిందు డెట్లూరకుండ గలడు?

అతడు దేశమునకు వచ్చునాటికి కాంగ్రెసు సంస్థ యుద్భవించి తొమ్మిదేండ్లైనది. అప్పటి కాసంస్థలోని వ్యక్తులందరును మితవాదులే. తమవాంఛను ప్రభువులకు విన్నవించుచుండుటయే వారు చేయుచుండిన పని. వారు కోరినదియైనను సంపూర్ణ స్వాతంత్ర్యము కాదు. అధినివేశప్రతిపత్తి మాత్రమే వారి ధ్యేయము. ఒకప్పు డంతమాత్రముగూడ లేదు. పాలనలో భాగ స్వామ్యము లభించినను చాలుననుకొనిరి. ఈ ధోరణి అరవిందున కేమాత్రమును నచ్చలేదు. సంస్థానోద్యోగిగా నుండుటచే, బాహాటముగ వ్రాయుటకు వీలులేక "జీరో" యను మారు పేరుతో చాల తీవ్రముగా నాటి పరిస్థితిని విమర్శించెను. ఆ వ్యాసములు కాంగ్రెసును తూర్పారబట్టుటయే కాదు, అప్పటి నాయకుల బండారమునుకూడ బైట పెట్టినవి. వ్రాయుచున్న

దెవరో యెవరికిని తెలిసినదికాదు. అటు ప్రభుత్వోద్యోగులు, ఇటు నాయకప్రముఖులు - ఉభయులు నాందోళన చెందిరి. రచయిత యితడని తుదకెట్లో గ్రహించి, మహాదేవ గోవింద రానడేగారు బతిమాలగా తాను చేయు విమర్శ సరియైనదే యను నాత్మ విశ్వాసమున్నను, అప్రియము పలికి పెద్దల నొప్పించుట యెందులకని మానివేసెను.

కాంగ్రెసును విమర్శించినాడే కాని అప్పటి కతనికింకను కర్తవ్యమేమియో తోపలేదు. అయినను సంపూర్ణ స్వాతంత్ర్యము వచ్చితీరుననియు దానిని సాధించుశక్తి తనకడ నున్నదనియు విశ్వసించెడివాడు. 'పాశ్చాత్య దేశములవలె రహస్య విప్లవ సంస్థలు దేశమంతటను ప్రధానస్థానములలో నేర్పడవలెను. అవియన్నియు నొక్కకాలమున ప్రవర్తించి పరప్రభుత్వమును పడగొట్టి జాతీయప్రభుత్వమును స్థాపింపవలెను. స్వాతంత్ర్యసిద్ధికి మార్గమిది' యని అతడు చాలకాల మనుకొనుచుండినాడు. బరోడాలో నుండినప్పుడును, ఈ దృష్టితో వంగదేశమున ప్రబలమగుచుండిన విప్లవసంఘముతో సంబంధ మేర్పరచుకొనెను. అవసరమైనచో ప్రాణత్యాగమునకైన వెనుదీయనను ప్రతిజ్ఞగైకొనెను. అరవిందుని తమ్ముడు వారీంద్రుడు అన్నను మించిన తీవ్రవాది. బాంబులు తయారుచేసి, వాని నుపయోగింపవలెనని యెంచెడివాడు. వేచియుండలేక యుద్రిక్తులగుచున్న ఇట్టి తీవ్రవాదులతో అరవిందునకు సానుభూతియున్నదేకాని సమైక్యము లేదు. వారు పాలకులను భయపెట్టి స్వాతంత్ర్యము పొందవలెననుకొనెడివారు. దొరికిన ఆంగ్లేయులను పట్టి రహస్య ప్రదేశ

ముల దాచియుంచుటయు, దుర్మార్గులను చంపుటయు తప్పు కాదని వారి యుద్దేశ్యము. పాలకులు రెచ్చగొట్టినపుడెల్ల వంగ దేశమున నట్టి యపహరణములు, హత్యలు కొల్లలుగా సాగినవి. అరవిందు డూహించిన రహస్యసంస్థల ఆదర్శమిది కానేకాదు. శక్తియందలి విశ్వాసముతో విప్లవము తెచ్చుటయే యతని లక్ష్యము. కాలము గడచినకొలది, భారతీయు లాత్మశక్తిచేతనే, సత్యబలము నాధారముననే, పారతంత్ర్యవిముక్తి నందుదురను గాఢవిశ్వాస మతని కేర్పడినది. తల్లి యాహ్వానము వినిపించి నపుడు ఈవిశ్వాసముతోడనే అతడు కార్యరంగమున కురికెను.

అరవిందుని రాజకీయములకు ఆధ్యాత్మికశక్తియే ప్రాతి పదిక. అతడు సాధించిన ఆధ్యాత్మికౌన్నత్యమునకు మాతృ దేశోద్ధరణకాంక్షయే మూలము. అనగా దాని కిదియు, దీని కదియు కారణములైనవి.

★ ★ ★ ★

ఆర్యఋషుల దృష్టిలో, వివాహము ఆధ్యాత్మికసాధనకు ప్రతిబంధకముకాదు. పైగా నది, ఇంద్రియోన్మాదముచే పతన మందకుండుటకు సహాయకారి. కావుననే వారు, సామాన్యులు గృహస్థులై కర్మయోగులు కావలెననిరి. భర్తకు స్త్రీ సహ ధర్మచారిణి కావలెననియే వారి ఆశయము. పురుషునకు స్త్రీ బానిసగా నుండవలెనని ఎచ్చటను వారనలేదు. అనుకూలవతి యగు భార్య భర్తకు శక్తి ప్రదాయిని. ఆమె సహాయముచే, ఆమె ఆలోచనలచే, ఆమె యొసగు నుత్సాహముచే గృహస్థుడు భగవత్సాక్షాత్కారమునే పొందగలడన్నచో నిక లోకమున సాధింపరాని దేముండును!

ఈ విషయములు గ్రహించిన అరవిందుడు తన ఇరువది తొమ్మిదవయేట, గొప్పయింటి బిడ్డయగు మృణాళినీ దేవిని వివాహమాడి గార్హస్థ్యమును స్వీకరించెను. ఆ పుణ్యదంపతులు కాపురమొనర్చినకాల మత్యల్పము. అదియు నడుమనడుమ దీర్ఘ విరామములతోఁగూడినది. సామాన్య లోకదృష్టిలో అత డామెను సుఖపెట్టలేదు. అయినను ఆమెపై అతనికిగల ప్రేమ అపారము. తన లక్ష్యమును తెలుపుచు, ధర్మపత్ని కర్తవ్యము నుపదేశించుచు, తన ఆశయమును ఫలించుటకై సర్వదా కృషి చేయుమని విన్నవించుచు అతడామెకు వ్రాసిన లేఖలు, అతని హృదయమున నామెకుగల స్థానమును స్పష్టముగా తెలుపు చున్నవి. ఆ యిల్లాలును, నిరహంకారిణియై, నిస్స్వార్థయై ఓర్పుతో విరహమునననుభవించి, అతనికి అనంతశక్తి ప్రదాత్రి యైనది. అరవింద వికాసమునకు మృణాళిని సహకరించుట సహజమేకదా !

వివాహమైన నాలుగేండ్ల కరవిందుడు సంస్థాన కళా శాల కుపాధ్యాయుడయ్యెను. శ్రీరామకృష్ణ పరమహంస వివేకా నందుల వాగమృతమును గ్రోలుటచే నితనికి భగవదనుభూతి నందవలెనను సంకల్ప మేర్పడినది. సంసారమందుండియు, గాఢ విశ్వాసముతో శక్త్యుపాసన చేయుచుండెడివాడు. భగవంతు డిచ్చిన శక్తులను భగవంతుని కొరకే వినియోగింపవలెనను ఆప్త వాక్యము అప్పటికే అతనికి ప్రమాణమైనది. కావుననే అర విందుడు తనకు దైవమిచ్చిన సర్వశక్తులను లోకోపకారమునకే వినియోగించెను.

అది 1905 వ సంవత్సరము అక్టోబరు 16 వ తేదీ. నాడు వంగ దేశ విభజనము శాసనమై అమలులోనికి వచ్చెను. దానితో తల్లి యెద చీల్చినట్లు కాగా వంగవాసు లందరు ప్రతీకారము చేసి తీరవలెనని రక్షాబంధనలు దాల్చిరి. ఇదివర కెన్నడు కని విని యెరుంగని ఏకీభావము వారిలో నేర్పడగా బహిష్కారోద్యమము సాగించిరి. ప్రజల యుద్రేకము నణచుటకై పాలకులు క్రూరముగా దండింపసాగిరి. స్వయముగా పోయి మాతృభూమి దుర్దశను గమనించిన అరవిందునకు ఆమె చేయు నాక్రందనములు హృదయ విదారకము లయ్యెను. అప్పుడే అంతర్వాణి ఆదేశము నాలకించి, నెలకు తొమ్మిది వందల రూప్యముల వేతనము వచ్చు సంస్థానోద్యోగమును తృణప్రాయముగా త్యజించి, అరవిందుడు కర్మయోగియై, మాతృ పాదారవిందముల తన్ను తా నర్పించుకొనియెను.

★ ★ ★ ★

రాష్ట్రవిభజనమును ప్రతిఘటించు దీక్షతో ఏకీభవించిన వంగీయుల నణచుటకై, పాలకు లవలంబించిన దమననీతి రాక్షస చర్యల మరపించెను. ఎవ్వరను 'వందేమాతరం' మన రాదు. రాజకీయసభ లేర్పాటు చేయరాదు. తనయుడు తల్లిని స్మరించుటయే దండనార్హమగు నేరమైపోయెను. నిర్బంధమెంత తీవ్రమైనను తలయొగ్గి తల్లినే స్మరింపని తనయులుందురా? పాలకులు బాధించినకొలది వంగీయ యువకులలో ఆవేశ మెక్కువైనది. విద్యార్థులనేకులు పాఠశాలలనుండి బహిష్కరింప

బడిరి. ఉద్దేశపూర్వకముగా ప్రభుత్వ సంస్థలను బహిష్కరింప వలెనని తీవ్రోద్యమము సాగించుచున్న వంగవాసులకు ఇది కష్టమనిపింపలేదు. కాని పెరిగి పెద్దవారుకావలసిన యువకులు చదువు సంధ్యలు లేకుండ నుండు టెట్లాయని యాందోళన మందిరి. తత్ఫలితమే కలకత్తాలో వెలసిన జాతీయ కళాశాల. సంస్థాపకుల ఆహ్వానమే వంగమాత ఆదేశముగా గ్రహించి అరవిందు డా కళాశాలకు ప్రధానాచార్యు డయ్యెను.

"భావిపౌరులగు బాలురు నిజమైన జాతీయవిద్య నభ్యసించి, విజ్ఞానవంతులై, శక్తిమంతులై, దేశభక్తులై మాతృదేశము నుద్ధరింపవలెను. కాకున్న తన ఆచార్యత్వమున కర్థము లేదు; తానుచేయు మాతృసేవయు లేదు." అరవిందు డీ దృష్టితో జాతీయ విద్యావిధానము నిర్ణయించి తోడి అధ్యాపకులకు, విద్యార్థులకు అనతికాలములోనే ఆరాధ్యుడయ్యెను. అయినను ప్రారంభమున జాతీయవాదుల యాజమాన్యమున నుద్భవించిన ఆ కళాశాల, దురదృష్టవశమున మితవాదుల అధీనమై అరవిందుని ఆదర్శము అమలుపరచుట కవకాశ మీయలేదు. బరోడా కళాశాలలోవలెనే ఆంగ్లము, చరిత్రము బోధించు ఉపాధ్యాయమాత్రుడుగా నుండుట కతని కిష్టముకాదు. అందుచే నతడు కాళాశాలను విడువవలసి వచ్చెను. అపుడు విద్యార్థులును తక్కిన అధ్యాపకులును పర్పాటు చేసిన వీడ్కోలుసభలో అరవిందుడిచ్చిన సందేశము విద్యార్థులేకాదు, అన్నిదశలలోని భారతీయులు నేటికిని శిరసావహింపదగినది. "ప వ్యక్తి ఎప్పుడేమిచేసినను దేశోపకారమగునా కాదాయని విచారించిచియే చేయ

వలెను. దేశార్థ ముపయోగింపని ఆత్మోద్ధరణము ఉద్ధరణమే కాదు." ఇదియే దాని సారాంశము.

అరవిందుడు కళాశాలను విడిచెనేకాని, ఆచార్యత్వమును విడువలేదు. జాతీయవాదుల ఆహ్వానమున "వందేమాతర"మను పత్రికకు ప్రధాన సంపాదకుడై వంగవాసులకేకాదు. యావద్భారతమున కాచార్యుడయ్యెను. భారతీయు లిప్పటికిని మననము చేయుచుండు "వందేమాతర"మను మంత్రము నుపదేశించినది బంకిం చంద్రుడు. తదర్థమును వ్యాఖ్యానించి, 'భారతమాత కేవలము నదీ పర్వతారణ్యామయమైన జడముకాదు. ప్రపంచమునకే పరమోపదేశముచేయు పరాశక్తి'యని నిరూపించి, జాతీయతా స్వరూపమును సాక్షాత్కరింప జేసిన మహాభాగ్యము అరవిందునిది. అతని వ్యాఖ్యానమే లేకున్న ఆ మంత్రమున కింతశక్తియు, ఇంత వ్యాప్తియు కలిగెడివి కావు.

ఆ పత్రికలో అరవిందుని లేఖిని వర్షించిన అమృతబిందువులు బీడువారిన పాఠకుల హృదయక్షేత్రములను సస్యానుకూల మొనర్చెను. అతని కృషిచేతనే ఆ హృదయక్షేత్రములు నందనోద్యానముల కాలవాలములైనవి. అతని సంపాదకీయ వ్యాసములను, మన దేశములోని పత్రికలేకాదు, ప్రభుత్వములను తలక్రిందులు చేయగల లండను పత్రికలుకూడ మరల ప్రకటించినవి. సంపూర్ణ స్వాతంత్ర్యమను లక్ష్యమును నిర్భయముగా లోకమునకు చాటి దాని ఆవశ్యకమును నిరూపించిన అతని రచనావిధాన మట్టిది! అతని భావములన్నియు సహేతుకములు, సమంజసములు, సరసములు నగుటచే నందర కాదరణయోగ్యము

లయ్యెను. ఆంగ్లేయ న్యాయాధిపతులే వానియందు దోషము లేదని యంగీకరించినారు. పరాధీనత తొలగించుకొననిదే ఏజాతి కిని అభ్యుదయము లేదు. భారతదేశము స్వాతంత్ర్యమునుకోరుట ఒకరిపై శత్రుత్వమువలన కాదు. భారతాభ్యుదయము ప్రపం చాభ్యుదయమునకే. స్వాతంత్ర్యసిద్ధికి రెండే రెండు సూత్రము లవ లంబింపవలెను. పరిపాలనాధికారము లభింపనంతవరకు ప్రభుత్వ ముతో సహకరింపకపోవుట మొదటిది. ఇతర సహాయము నపే క్షింపక స్వశక్తిపై నాధారపడుట రెండవది. అహింసామార్గమున స్వాతంత్ర్యమును సాధించుకొన్న ఖ్యాతి భారతదేశమునకు వచ్చు టకు, ప్రప్రథమమున అరవిందాదులు అనుగ్రహించిన ఈ సూత్ర ద్వయమే మూలము. పదేండ్ల తరువాత, రాజకీయ స్వాతంత్ర్య సాధనారంగమున ప్రవేశించిన గాంధీమహాత్ముడు, అరవిందుడు నిర్దేశించిన ఈ సూత్రములకే సత్యాగ్రహమనియు, నిర్మాణ కార్యక్రమమనియు పేర్లుపెట్టి, వివరములు తెలిపి, అంద రాచ రింపగల అవకాశమును, విస్తృతవ్యాప్తిని కల్పించెను.

అరవిందుని ప్రబోధముచే వంగభూమి, పాలకుల నొక మూలకు నెట్టి, స్వతంత్రించి కొన్నాళ్ళు వ్యవహరించినది. ఆహార విహారముల మొదలు ఆదర్శములవరకు, అన్నింటను స్వదే శీయ తత్త్వమే ప్రబలినది. ప్రజలు విదేశవస్తువులను కంటితో చూచుటకైన నోర్చెడివారు కారు. ఉద్యోగుల బిడ్డలు తప్ప ప్రభుత్వ విద్యాలయములలో నెవ్వరును చదివెడివారు కారు. జాతీయ పాఠశాల లేర్పడి, యువజనుల మనస్సులలో స్వదే శౌన్నత్యము హత్తుకొనునట్లు చేయుచుండినవి. ప్రభుత్వన్యాయ

స్థానములు బహిష్కృతములైనవి. ఆయా మండలములలో పంచాయితీ లేర్పడి, లక్షలకొలది విలువగల వ్యవహారములను గూడ తేలికగా, ఉభయ పక్షములకు తృప్తికరముగా పరిష్కరింప నారంభించినవి. పల్లెలలో స్వచ్ఛంద సేవక బృందము లేర్పడి ప్రజా సేవ చేయుచుండుటచే, పాలకుల ఆజ్ఞ ననుసరించి మాత్రమే ప్రవర్తించుచుండిన నాటి పోలీసువారికి పనియే లేక పోయినది. ఇంత చైతన్యమును కలిగించి పోషించుచున్న పత్రిక ను చూచుచు నూరకున్నచో తమ ప్రభుత్వము కూలునను భీతి అధికారులకు గలిగినది. కొన్ని వ్యాసములు రాజద్రోహ ప్రబోధకములని, అరవిందునిపైనను, పత్రికతో సంబంధముగల మరి కొందరపైనను దోషారోపణ గావించిరి. అయినను వారి ప్రయత్నమునకు వారి న్యాయాధికారులే తోడ్పడలేదు. అరవిందుని రచనలు నిర్దోషము లను విషయముమాత్రమే కాక, వానికి ప్రతిఫలముగా నెనిమిది మాసములలో నతడు పొందిన గౌరవభృతి ఏబది రూప్యములు మాత్రమే యనియు నిరూపితమైనది. ఈ విచారణచే అతని రచనల ప్రాశస్త్యముతోపాటు, అతని ఔదార్యమును ప్రపంచమునకు వ్యక్తమైనది.

పత్రికమూలమున తన రచనలు దేశమంతట వ్యాపించుచున్నను ఇంతవర కరవిందుని సేవ వంగభూమికిమాత్రమే పరిమితమైనది. ఈశ్వరాదేశమును పరిపూర్ణముగా పాలింపవలెనన్నచో యావద్భారతము నుద్ధరింపవలెను. అప్పటికిని మితవాదుల ప్రాబల్యములోనే యున్న దేశీయమహాసభను సంస్కరించి దానిని సంపూర్ణ స్వాతంత్ర్యమును గోరు జాతీయ వాదుల అధీనము

చేయవలెను. ఈ లక్ష్యముతోడనే అరవిందుడు జాతీయ పక్ష నాయకుడుగా సూరత్ సమావేశములో పాల్గొనెను. అచట మితవాదులకును, జాతీయవాదులకును తీవ్ర వాగ్వాదములు జరిగినవి. మితవాదులును దేశభక్తులే. కాని సంపూర్ణ స్వాతంత్ర్యము తమ ఆదర్శమన్నచో పాలకులు సంస్థనే బ్రతుకనీయరనియు, అపుడేమి చేయుటకును వీలు కాదనియు, వారి భయము. వేడుకొను ధోరణి మాని కార్యాచరణమునకు గడంగిన గాని సంస్థ వలన ప్రయోజనమే లేదని జాతీయవాదుల విశ్వాసము. ఉభయ పక్షములకును సమాధానము కుదుర్చుటకు అరవిందుని సహాయముతో లోకమాన్య బాల గంగాధరతిలక్ మహాశయుని వంటి వాడు ప్రయత్నించెను. అది సాధ్యము కాలేదు. దానితో నుభయపక్షములు ఘర్షణ పడుటచే సమావేశము ధ్వంసమయ్యెను. మరునాడు మితవాదులు సమావేశమై, ప్రత్యేక నియమములు పెట్టి జాతీయవాదులను రానీయక, అధికారుల అడుగులకు మడుగులొత్తు తమ తీర్మానములనే ఆమోదించుకొనిరి. ఆ దినముననే జాతీయవాదులు అరవిందుని అధ్యక్షతను ప్రత్యేకముగా సమావేశమయి తమ ఆశయములు వెల్లడించి, తదనుగుణముగా తీర్మానములు గావించిరి. ఈ విధముగా దేశీయమహాసభలో విభేదము కల్పించినాడని అప్పటి నాయకులు కొందరు అరవిందును నిందించిరి. ఆ నిందయే యతని కాశీర్వాదమైనది. నిజముగా నితడు కల్పించినది విభేదము కాదు, వివేకము. నాటినుండి అరవిందుడు యావద్భారత జాతీయ పక్షనాయకుడుగా దేశసంచార మొనర్చి, కర్తవ్య

ప్రబోధము గావించి, మరికొన్ని వత్సరములకు కాంగ్రెస్ సంస్థలో మితవాదుల కవకాశము లేనంతటి పరిణామము తెచ్చెను.

అరవిందు డీ దశలో తా నాచరించు కర్మయంతయు స్వబుద్ధితో చేయునదిగా కాక పరమేశ్వరాదేశముగనే పాలించెను. తనకు స్వాతంత్ర్యము లేదనియు, తాను నిమిత్త మాత్రుడనియు తెలిపి, ఎవరో నడిపించునట్లు నడిచెడివాడు. ఇట్టి కర్మాచరణమునే మన పూర్వులు కర్మయోగమనిరి. ఈ స్థితిలో నరవిందుడు సూరత్ పట్టణమునుండి తిరిగివచ్చుచు బరోడా చేరెను.

సంస్థానమును వదిలిన తరువాత అత డచటి కదివరకు పోలేదు. అరవిందుడు వచ్చుచున్నాడనగనే ఊరంతయు నుప్పొంగి పోయినది. పోయినచోట నెల్ల సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శమును ప్రకటించుచుండుటయే ఆతడప్పుడు చేయుచుండినపని. విద్యార్థుల కీ సందేశము వినబడరాదని కాబోలు, అప్పటి కళాశాలాధ్యక్షులు, అరవిందుని దర్శింపరాదనియు, సన్మానింపరాదనియు విద్యార్థులను హెచ్చరించిరి. ఈ విషయములో మహారాజున కెట్టి సంబంధమును లేదు. ప్రాత పరిచయము పురస్కరించుకొని అరవిందు డాయనను దర్శించి మాటాడియుండెను. స్వాతంత్ర్యప్రియుడైన ఆ మహారాజు అతని నాదరించెను. అంతర్యము నెరుగక, అధికారుల ఆదరమునకు పాత్రుఁగుదుమను వారిలో నగ్రేసరుడైన కళాశాలాధ్యక్షుని స్వప్రతాపమే యిది. కాని కల్మషమెరుగని విద్యార్థులు ఆతనికి తగినపాఠమే చెప్పిరి. అరవిందుడు కళాశాల మార్గమున నరుగుచున్నాడని వారికి తెలియవచ్చెను. అధ్యక్షుని హెచ్చరికను, కళాశాలను అధ్యక్షునకే విడిచిపెట్టి, వారు పరువెత్తుకొనిపోయి అరవిందుని చేరి నమస్కరించిరి. గుచ్ఛములను

బండినుండి తొలగించి బండిని తామే లాగుచు అరవిందు నూరేగించిరి. మహోత్సవమొనర్చి అరవింద సందేశము నాల కించిరి. గురువర్యుని పట్ల వారికిగల ప్రేమగౌరవము లట్టివి!

ఆ సమయమున బరోడాలోనున్న, యోగసాధకుడగు లెలే మహాశయుని దర్శనము అరవిందునకు లభించినది. ఏ యాలోచనయు చేయక, మనస్సునందే దృష్టియుంచి, తలంపు లను దూరముగా త్రోసివేయగలుగుచో మనస్సు సంపూర్ణముగా నిశ్చలస్థితి నందునని, యీ యోగి సంభాషణవలన తెలిసినది. వారి కభిముఖముగనే కూర్చుండి అప్పుడే దానిని ఆచరణలో పెట్టి చూచెను. మరుక్షణములో నరవిందున కా అనుభవము కలిగినదట! మూడు దినము లిట్లే సాధనచేయగా మౌన సాక్షాత్కారము - పరాశాంతి - సిద్ధించినవట!

★ ★ ★ ★

సూరత్ కాంగ్రెసు విధ్వంసమైన క్రొత్తలో వంగదేశ పరిస్థితులు తారుమారైనవి. మితవాదులు జాతీయపక్షమును నిర్మూలింప ప్రయత్నించిరి. వారిని చేరదీసి అధికారులును జాతీయ వాదులపై దండెత్త సాగిరి. శాసనబద్ధమైన యాందోళనముకూడ పాలకులకు సహింపరానిదయ్యెను. నిర్దయగా వారు శిక్షించిన కొలదిని యువకులలో ప్రతీకారకాంక్ష ప్రబలసాగెను. ఓర్పుతో శాంతిమార్గము ననుసరించుటమాని, క్రౌర్యమునకు క్రౌర్యమే మందని, విధ్వంసక చర్యలకు పూనుకొనసాగిరి. దొరలను చంపుటయే దొడ్డ దేశభక్తియను దుర్భ్రమ వ్యాపించినది. ఈ పరిణామము ఫలితముగనే ఆలిపూరు హత్యాభియోగము వచ్చినది.

నాటి ప్రభుత్వోద్యోగులలో "కింగ్సుఫర్డు" క్రూరాతి క్రూరుడు. చిన్న నేరములకుకూడ పెద్ద శిక్షలు వేసెడివాడు. అతని నెట్లైన నంత మొందింపవలెనని దీక్షవహించిన యువకులు ఏ పాప మెరుగని "కెన్నడీ" దంపతులను కింగ్సుఫర్డు బృందముగా భ్రమించి హత్యగావించిరి. హత్యయే దోషము, అమాయకుల హత్య మరింత దోషము. అపకారచింత ఏకోశముననులేని అరవిందుడు ఇట్టి నెపముతో బంధింపబడుటయే ఆ మహాదోషము నకు ఫలము. అతడు నిష్కల్మష హృదయుడుగాన నది అతని కుపకారకమే అయినది. కాని, తమకై సర్వస్వము నర్పించిన పరోపకార పరాయణుడును, మహాయోగి కానున్న పుణ్యాత్ము డును అయిన అరవిందుడు తాముచేసిన దోషమునకై బంధము నందుట జాతికంతకు శిక్షయే.

ఆ దినమున నింకను తెల్లవారలేదు. అరవిందుడు శయ్యపై పరుండియుండెను. చెల్లెలు సరోజిని భయపడుచు గదిదగ్గరకు పరుగెత్తుకొనిపోయి అన్నను గట్టిగా పిలిచినది, అతడు మేలు కొనెను. అంతలో నాతని గది సాయుధరక్షక భటులతో నిండి పోయెను. ఆ స్థితిలో నెంతటివానికైన ఆందోళన కలుగును గదా! నిర్దోషియు, నిర్భయుడుగాన అరవిందు డల్లే నిబ్బర ముగా పక్కపైననే కూర్చుండెను. ఇంటినంతటిని తుపాకులు చేతపట్టిన పోలీసులు చుట్టుముట్టిరి. ఇన్‌స్పెక్టరులు, గూఢ చారులు మున్నగు నున్నతాధికారులు ఇంటిలో వీరవిహారము చేయసాగిరి. ఒకానొక తెల్లదొర అరవిందుని సోదరి గుండెలపై పిస్తోలు గురిపెట్టి బెదరించినాడట!

క్రేగన్ దొర గదిలోనికివచ్చి "అరవిందఘోషెవ"రనీ ప్రశ్నించెను. తానే అరవిందుడని తెలుపుకొనుటచే ఆతనిని బంధింపుడని ఆ దొరయే ఉత్తరువు నిచ్చెను. అరవిందుకు అధికార పత్రమునడిగి తీసికొని చదివి చేవ్రాలు చేసెను. దానిని చదువుటతో తన బంధనమునకు హేతువైన అధికారులభ్రాంతి అతనికి తెలిసినది. అట్టి పరిస్థితులలో ఇంటిని సోదా చేయుట కెవ్వరు నడ్డుపెట్టలేదు. ఆ అధికారపత్రములో, ఇంటిని సోదా చేయుమని యున్న దేకాని వ్యక్తిని బంధింపుమని లేదు. తనయింట బాంబులు గాని, తత్సంబంధమైన స్ఫోటక ద్రవ్యములుగాని ఏమియు లేవు. ఆలిపూరు హత్యతోగాని, వంగదేశమున జరుగుచున్న కుట్రతో గాని అరవిందున కెట్టిసంబంధమును లేదు. అయినను నతడు నిర్వ్యాకారుడై శరీరము నప్పగించెను. పోలీసు లతనిచేతులకు సంకెళ్లు తొడిగిరి. మొలకు త్రాడుచుట్టి పారిపోవు పశువును పట్టియుంచునట్లు ఒక డా త్రాటిని పట్టుకొని వెనుక నిలబడెను. అరవిందునంతటివాని విషయమున పాశ్చాత్యపాలకు లవలంబించిన నాగరక పద్ధతి యిది. ఇక సంభాషణలో ఆ దొరగారు ప్రయోగించిన పదజాలమును, నతడు ప్రకటించిన సంస్కృతిని సంస్మరించుటకూడ సంస్కారహీనతయే అనిపించును.

ఇంత చేసియు ఆ శోధనలో అరవిందుని యింట వారి కేమియు లభ్యము కాలేదు. రామకృష్ణ పరమహంస నివసించిన దక్షిణేశ్వరమునుండి పవిత్ర భావముతో అరవిందుడు తెచ్చుకొన్న మట్టిముద్దను చూచి, అది భయంకర స్ఫోటకపదార్థమను సందేహముతో ఆందోళన జెంది, తుదకు వట్టి మట్టియని గ్రహించి యచ్చ

టనే విడిచిపోయిరి. 'అతి ముఖ్యమైనది, అత్యావశ్యకమయినది' అనుకొనుచు కొన్ని కాగితములను మాత్రము భద్రపరచిరి.

అరవిందునకు జూపిన శోధనాధికారపత్రములో నున్నది కేవల హత్యాభియోగమే కాదు. రాష్ట్రవిప్లవకారు లొనర్చుచున్న రహస్య ప్రయత్నములకు సంబంధించిన అభియోగమంతయు నున్నది. ముజఫరుపూ రనుచోట బాంబులు ప్రేలి ఇరువురు యూరోపియన్ స్త్రీలు మరణించిరి. అప్పటికి 'కెన్నడీ' దంపతుల హత్యజరిగి ఎన్నాళ్ళో కాలేదు. ఈమారును బాంబులుపయోగింపబడుటచే ఈ హత్యాకాండ యంతయు పెద్ద ప్రయత్నముతో జరుగుచున్న కుట్రయని అధికారు లనుకొనుటలో నాశ్చర్యములేదు. ఆ విప్లవకారులకు నాయకత్వము వహించుచున్న వారీంద్రు డరవిందుని సోదరుడు. కావున నరవిందునకుగూడ దీనిలో సంబంధ మున్నదని సర్కారువారు భావించిరి. అరవిందునకున్న సంబంధము తమ్ముని తోడనేకాని, అతని యుద్యమముతోగాదు.

ఏమైననేమి? అరవిందుడు నిందితుడుగా శ్రీకృష్ణ జన్మస్థానమున కేగవలసి వచ్చెను. గృహశోధన జరుగుచున్నంతవరకు నిబ్బరముగా నున్నను, పోలీసులు పట్టుకొని లాల్ బజారు ఠాణాకు తీసికొని పోవునపుడు, ఒక్కక్షణము పరమమాహేశ్వరుడైన యతనికి పరమేశ్వరు డేమైనాడా యనిపించినది. రెండు మూడు దినముల నిర్విరామ ప్రార్థనచే అతని హృదయ మారాట ముడిగి ప్రశాంతి నందినది. అప్పు డతనికి లోనుండి "విశ్వాసము వీడక వేచియుండి నిరీక్షింపు"మను వాణి వినిపిం

చినది. అత డక్లే నిరీక్షించినాడు. కొలది దినములలో నతనిని లాల్ బజారునుండి ఆలిపూరునకు గొంపోయిరి.

అక్కడ కేంద్ర కారాగృహమున్నది. దానిలో నరవిందు నొక మాసము దినములు హంతకులనుంచు చీకటి కొట్టులో నుంచిరి. తీరుబడి లేకుండ అహర్నిశము జనుల నడుమ నుండుట కలవాటయిన ప్రజానాయకునకు నిర్జన కారాగార వాసము! విధి వైపరీత్యము నేమనగలము? ఎటుచూచిన నెత్తయిన కారాగృహ కుడ్యములు, రాత్రింబవళ్ళు నిష్పక్షపాత ముగ క్రమ్ముకొను కారుచీకటి! వేళ కాహారము తెచ్చివేయు కావలివాని కనులు తప్ప జీవవస్తు దర్శనమే లేదు. ఆ భయంకర వాతావరణమున నా యంధ తమసమున నరవిందారవిందము ముకుళించుకొనిపోక యెట్లుండును? కావలివాని కనులు గూడ చూడకుండ పరాశాంతినందిన మనస్సుతో భగవదాదేశమునకై నిరీక్షించుచుండెను. అది యింకను మౌనసాక్షాత్కారమే! అయి నను మూడు దినములు గడుచుసరికి లోనుండి జ్ఞానభాస్కరుని సందేశ కిరణ పరంపరలు ప్రసరించి యమరారవిందమును ప్రఫుల్ల మొనర్చినవి.

"నీవు త్రెంపుకొన లేని బంధనములను నేనే త్రెంపి వైచితిని"

"ఇంతవరకు నీవొనర్చినంత మాత్రమే నీకార్యముకాదు. నాకై నీ వొనర్పవలసిన కార్య మింతకంటె విస్తృతమైనది. దానికై చేయవలసిన కృషి నీవు చేయలేక పోవుచున్నావు. నీ సందేహములుతీర్చి నీచే కృషిచేయించుటకే యీకారావాసము"

"స్వాతంత్ర్యమునకై ఉద్యమించుచున్న భారత దేశము సిద్ధి బొందిన పిమ్మట చేయవలసిన దేమియో తెలియునా? సమస్త ప్రపంచమునను ధర్మము వ్యాప్తినందుటకు జీవింపవలెను. అందులకే భారత దేశము నిప్పు డుద్ధరించుచున్నాను. నన్ను తెలుపగల ఆధ్యాత్మికవిజ్ఞానమే ధర్మము. దానికొరకే భారతాభ్యుదయము."

పదేపదే వినిపించిన యీ సందేశములతో అరవిందునకా కారావాసము ఆశ్రమవాసమే అయ్యెను. ఇంకను చీకటికొట్టు నందే యుంచుచున్నను, కారాగృహాధికారులు ఉదయము, సాయంకాలము గదికావల నడయాడుట కతని కవకాశమిచ్చిరి. ఒకనాడట్లు నడచుచుండగనే అతనిలో దైవశక్తి ప్రవేశించినది. చకితుడై నలువంకలను చూడగా అంతయు వాసుదేవమయము! చీకటికొట్టు గోడలు వాసుదేవమయములై అతనిని పరివేష్టించి నవి. వృక్షము వాసుదేవుడై యాచ్ఛాదన మొసంగెను! కావలి కాయుచుండినది నారాయణుడే? అరవింద మహాయోగి కృష్ణ జన్మస్థానమున పరమాత్మానుభవము నందెను.

అంచెలంచెలుగా సాగు న్యాయస్థానవిచారణ పూర్తి యగుటకు సరిగా సంవత్సరము పట్టినది. మొదటి దినములలో నరవిందుడు న్యాయవాదులకు సలహాలిచ్చి తోడ్పడినాడు, కాని, భగవదాదేశముచే తుదకదియు మానివేసెను. అన్నిటికి నాతడే కర్తయని తాను సాధనయందే నిమగ్నుడయ్యెను.

అతని విడుదలకై వంగభూమియేకాదు, దేశమంతయు తహతహలాడినది. అతని పక్షమున వాదించు న్యాయవాదుల కిచ్చుటకు ధనము కావలెనని శ్రీమతి సరోజినీదేవి తెలియజేసి

నంతనే సామాన్యజనులును, నిరుపేదలును కూడ తమశక్తికి మించిన త్యాగమొనర్చి ముప్పదివేల రూప్యముల సమకూర్చి యిచ్చిరి. ధర్మరక్షణార్థమై కంకణముధరించి దేశబంధు చిత్తరంజనుదాసు, న్యాయపక్షమున అహోరాత్రములు కృషిచేసి, ప్రభుత్వవాదియగు నార్టను ప్రయత్నములను పటాపంచలు గావించి, అరవిందుని సౌశీల్యము నావిష్కరించినాడు. సర్వాంతర్యామియగు నారాయణుని లీల కాకున్నచో నిందితుడుగా కారాగృహమునకేగిన అరవిందుడు భగవత్సాక్షాత్కారము నందిన మహాయోగిగా వెలువడుట యెట్లు పొసగును?

అతడు విడుదలయై వచ్చుసరికి వంగభూమి యనాథయై కళావిహీనయై యుండినది. అది యంతయు పాలకుల దమన ప్రనీతిభావము. నాయకులందరు కారాగృహ బద్ధులుకాగా, ప్రజానీకము చైతన్య రహితమైయుండెను. ఎదలలో నెంత యుద్రేకమున్నను కాయములు కట్టువడి కదలాడకుండిరి. మాతృదేశ దైన్యమునుచూచి సహింపలేక, అరవిందు డీశ్వరాదేశము ననుసరించి, 'కర్మయోగి' యను పత్రిక నాంగ్లముననను 'ధర్మ' యను పత్రికను వంగభాషయందును ప్రకటింపసాగెను. అందలి వ్యాసములలో నతడు తన కీశ్వరు డిచ్చిన సందేశమును విపులీకరించెను. ఆరంభించిన రెండువారములలోననే "వందేమాతరము" వలె "కర్మయోగి" యు బహుళ ప్రచారము నందినది.

ఆ పత్రిక తరతరములనుండి వచ్చుచున్న భారతీయ విజ్ఞానమును త్రవ్వి తలకెత్తినది. ఇతరు లెరుగని ఆధ్యాత్మిక శక్తి వైభవమును బహుముఖములుగ ప్రశంసించినది. భారతీయ

సభ్యతలోని విశిష్టతను లోకమునకు చాటి చెప్పినది. ఆ కాల మున నరవిందుడు సాధించిన యోగాభ్యుదయమును వ్యక్తము గావించినది.

అప్పటి కరవిందుడు విడుదలయై వచ్చి మూడు మాస ములు కూడ కాలేదు. కర్మయోగి పత్రిక ఐదవ సంచిక మాత్రమే వెలువడినది. "నా దేశీయుల కొక బహిరంగ లేఖ"- అను పేరున రాజకీయ స్వాతంత్ర్యసిద్ధికై భారతీయు లవలం బించిన సాత్త్వికి నిరోధవిధానమును చాల విపులముగా చర్చించి ప్రకటించెను. పది వత్సరముల తర్వాత గాంధీమహా త్ముడు దేశీయ మహాసభచే నంగీకరింపజేసిన విధానము నీ లేఖలో నరవిందుడు సూచించినాడు.

ఆ కాలమున నతడు తదేకనిష్ఠతో యోగాభ్యాస మొన ర్చెడివాడు. దినములకొలది ఏకాంతవాసమున నుండు టలవా టయినది. మిత్రులకు కూడ దర్శనము లభించెడిది కాదు. శిక్షిం చుటకు సాధ్యము కాక విడుదల చేసినను ముందేమి చేయునో యను భీతిగల ప్రభుత్వ మతనిని కనిపెట్టియుండుట మానలేదు. వారీ యేకాంత వాసములను సరిగా నర్థము చేసికొనలేదు. అరవిందుని ప్రవాసమునకు పంపనెంచుచున్నారను పుకారులు గూడ బయలుదేరినవి. ఏ ప్రమాదమైనను రావచ్చుననియు, నిరపాయస్థలమునకు పోవలసినదనియు మిత్రులెందరు చెప్పినను నతడు వినలేదు. అంతర్వాణి ఆదేశమునకై వేచియుండి, అది వినిపింపగనే అరవిందుడు మాతృభూమి నుండి అంతర్ధాన మయ్యెను.

ఫ్రెంచివారి పాలనలోనున్న పుదుచ్చేరి చేరి, తానక్కడ నున్నట్లు ఆయనయే ప్రకటించువరకు ప్రభుత్వమున కాయన సమాచారమే తెలియదు, అయినను ఈ విధముగా నతడు వెడలి పోవుట వారి కవమానమనిపించెను. పొమ్మనుటకుగాని, యుండు మనుటకుగాని యధికార మత్తకే యుండవలయును గదా! తమ అధికారమును ధిక్కరించిన అరవిందు నెట్లైన సాధింపవలె నని, అతడు రాజద్రోహముచేసి దండనమునకు భయపడి పారిపోయినాడని దుష్ప్రచారము ప్రారంభించిరి. కర్మయోగి పత్రికలో ప్రకటితమైన బహిరంగలేఖ రాజద్రోహ ప్రబోధకమని ముద్రాపకునిపై నభియోగము తెచ్చిరి. ఇది రుజువైనచో వ్రాసినవా డరవిందుడుగాన అతనిని స్వాధీనము చేయుడని ఫ్రెంచివారి నడుగవచ్చును. హృదయమున నింత విషముండినది కావుననే దైవము వారికి కలిసిరాలేదు. బహిరంగలేఖ ప్రకటిత మైన పిమ్మట తొమ్మిది నెలలవరకు కర్మయోగి పత్రిక వచ్చుచునే యున్నది. ఇన్నాళ్లులేని రాజద్రోహ మిప్పు డెక్కడనుండి వచ్చి నది? పైగా ఆ లేఖలోనున్నది స్వాతంత్ర్య ప్రబోధమేకాని రాజ ద్రోహముకాదు. వారి న్యాయాధిపతులే ఇట్లు తీర్పుచెప్పుటచే ప్రభుత్వముచేయు దుష్ప్రచారము నిర్హేతుకమని తేలిపోయినది. స్వదేశమున నున్నంతకాల మరవిందుడు రాజకీయ రంగమును విడువలేకపోయెను. ఈశ్వరాదేశము ననుసరించి దానిని విడువ వలెనన్నచో ప్రవాసము తప్పనిసరియయ్యెను. నిరంతర యోగా భ్యాసనమున కనుకూలించు ఏకాంతవాసము నందలి యఖిలా

పయు, ఈశ్వరాదేశమును, అరవిందుని ప్రవాసమునకు హేతువులు. ప్రభుత్వము దండించునను భీతి యెన్నటికిని కానేరదు.

* * * *

దక్షిణ భారతదేశము ఆధ్యాత్మిక విజ్ఞానమునకు అనాదిగా నిలయము. వేదార్థము విప్పి చెప్పిన విద్యారణ్యులు వెలసిన దీ పుణ్యక్షేత్రముననే. ప్రపంచ ప్రఖ్యాతి నందిన త్రిమత స్థాపనాచార్యులగు (శ్రీ) శంకర, రామానుజ, మధ్వాచార్యుల యుద్భవమును నిచ్చటనే. ఈ దేశమునకు వచ్చిన యరవిందులు యోగసిద్ధినందుటచే నిది మరింత పవిత్రమైనది. యోగసిద్ధినంది యాయద్భుత శక్తితో మరల స్వదేశమునకేగి, రాజకీయ రంగమున ప్రవేశింప వలయునని యే వారి ప్రథమ సంకల్పము. కాని పుదుచ్చేరిలో వారందిన యోగానుభూతియు, మహోన్నతాధ్యాత్మిక పరిణామమును, ఆ సంకల్పమును మార్చుటయేకాదు, అనవసరమనియు తోపజేసినవి. అందులకే దేశీయులు దేశీయ మహాసభాధ్యక్షులుగా రండని ఆహ్వానించినను వారు రాలేదు.

ఒకవంక ప్రథమ ప్రపంచ సంగ్రామమునకు సన్నాహములు జరుగుచున్న దినములవి. అప్పటి కరవిందులు పుదుచ్చేరికి వచ్చి నాలుగు వత్సరములైనది. ఆ నాలుగేండ్లును నిర్విరామముగా నొనర్చిన యోగసాధనచే తమకు గలిగిన దివ్యానుభవములను ప్రకటించుటకై "ఆర్య" అను పత్రికను ప్రారంభించిరి. దైవికముగా తమకడకు వచ్చిన రిచర్డు దంపతుల ప్రోద్బలము దీనికి మూలము. ఈ ఆర్యాపత్రిక ప్రారంభముకూడ ఆగస్టు 15 వ తేదీన జరుగుట చిత్రము. ఎక్కువమంది నల్ప

కాలములో ధ్వంస మొనర్పగల మారణాయుధములను, ఒకరిని మించి మరియొకరు కనిపెట్టుటలో పాశ్చాత్య వైజ్ఞానికులు పోటీపడుచుండగా, మన దేశమున నరవింద మహాయోగి భాగవత జీవనావసరమును ప్రబోధింపసాగెను.

అరవిందయోగి ఆత్మనుండీ యావిష్కృతమైన దివ్య జ్యోతిని అక్షరరూపమున లోకమున కనుగ్రహించిన ఆర్యపత్రిక తనయేడవ యేట నకస్మాత్తుగా నాగిపోయినది. అరవిందు లేకాంతవాసమున కేగి యోగానుభవములందు నిమగ్నులగు టయే దానికి హేతువు. ఆ పత్రికలోని అరవిందుని రచన లన్నియు పరమేశ్వరుడు తానై పలికినవే. ఆర్య వాఙ్మయ మంతయు నిగూఢార్థములతో, వారి కవగతమైనది. గీతా భాష్యము, వేదరహస్యము, భాగవత జీవనము మున్నగున వన్నియు నప్పుడే వెలువడినవి. యోగమున నెంత అభ్యున్నతి నందుచున్నను, దాని కంతకు మూలకందమైన దేశోద్ధరణ లక్ష్యము వారి స్మృతిపథమున మరుగుపడలేదు. భారత దేశ సముద్ధరణము, హైందవ సభ్యతా సమర్థనము, భావికవిత్వము, మున్నగు విపుల విమర్శక వ్యాసములు అపుడపుడు వచ్చుచుండె డివి. వేయేల! ఆ పత్రిక అరవిందుల సర్వజ్ఞత్వమును ప్రత్యక్షర మున నిరూపించినది!

ఆర్యా పత్రికాప్రకటన మాగిపోయిన తరువాత అయిదు సంవత్సరములవరకు యోగసాధనయందే అధికముగా నిమగ్ను లగుచు, దినమున కొకటి రెండు పర్యాయములు మాత్రము, ఆ మహాయోగి, శిష్యులకు కనిపించుచుండెడివాడు. అట్టి సమ